# విషయ సూచిక

# ముందు మాట

ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీ నిర్మాతలలో, ప్రముఖ నాయకులలో ఒకరైన కామ్రేడ్ మద్దుకూరి చంద్రశేఖరరావుగారు 1974 జూలై 26 న మరణించారు.

కమ్యూనిస్టుపార్టీ నడిపిన పత్రికలకు ఆది నుండి దీర్ఘకాలం, చంద్రంగారు సంపాదకులుగా ఉన్నారు. విశాలాంధ్ర దినపత్రికకు చాలా కాలం ప్రధాన సంపాదకులుగా ఉన్నారు. ఈ కాలంలో వీరు చాలా వ్యాసాలురాశారు.వాటిలో కొన్నిటిని సేకరించి, పుస్తక రూపంలో ప్రకటించాలని విశాలాంధ్ర విజ్ఞాన సమితి నిర్ణయించింది.

ఆ నిర్ణయం మేరకు వివిధ దశలలో, వివిధ పార్టీ, అభ్యుదయ పత్రికలలో చంద్రంగారి రచనల నుంచి కొన్నిటిని ఏరి ప్రచురిస్తున్నాము.

పార్టీ పాలసీని వివరించటంలో వారి నైశిత్యాన్ని, సంస్కృతీ, సాహిత్య సమస్యలను మార్క్సిస్టు దృక్కోణంలో పరిశీలించుటలో వారి సామర్థ్యాన్ని, రచనా పటుత్వాన్ని ఈ వ్యాసావళిద్వారా పాఠకులు గ్రహించగలరని ఆశిస్తున్నాను.

ఇట్లు,

విజయవాడ,
18-12-'74.

వై. వి. కృష్ణారావు,
అధ్యక్షులు
విశాలాంధ్ర విజ్ఞాన సమితి.

# జీవిత సంగ్రహం

శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు 1907 లో కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా వెంట్రప్రగడలో సామాన్య రైతు కుటుంబంలో జన్మించారు. వీరి తండ్రి పేరు సుబ్బయ్య, తల్లి పేరు పూర్ణమ్మ. వీరికి ముగ్గురు సోదరులు, ఒక సోదరి. వెంట్రప్రగడలో స్కూల్ ఫైనల్ వరకు చదివారు. తర్వాత బందరులోని జాతీయ కళాశాలలో మెకానికల్ ఇంజనీరింగ్ కోర్సులో చేరారు.

## జాతీయోద్యమంలో

1929 లో గాంధీజీ ఆంధ్రప్రదేశ్ పర్యటనకు వచ్చినప్పుడు ఆయన చేసిన జాతీయోద్యమ ప్రబోధంతో ఉత్తేజితులై 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఈ సందర్భంలో అరెస్టయి పామర్రు మేజిస్ట్రేటు కోర్టులో 3 నెలలు కఠినశిక్ష విధించబడి రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపబడ్డారు. జైలునుండి విడుదలైన తర్వాత విదేశ వస్త్ర బహిష్కరణ ఉద్యమంలో పాల్గొన్నారు.

1928 లోనే సైమన్ కమిషన్‌కు నల్లజెండాలు చూపేందుకు యువకులను సమీకరించారు.

1932 ఏప్రిల్‌లో వ్యష్టి సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు.

ఆ సందర్భంలో రహస్య కరపత్రాలు ప్రచురించటం ప్రారంభించారు. దాంతో వెంట్రప్రగడలో తిష్టవేసిన ప్యూనిటివ్ స్క్వాడ్స్ గ్రామం మొత్తానికి జరిమానాలు వేస్తూ, ఆయనను పట్టివ్వమని పోరు పెట్టాయి. ఎవరూ పట్టివ్వలేదు. మొత్తంమీద బుడమేరు పాయలలో ఆయనను పట్టుకొని 'సైట్ సార్జెంట్' (యూరోపియన్ కెప్టెన్)

రహస్యాలు బైటపెట్టమని బాధించి, నోటివెంట నురుగు, రక్తం కక్కేదాకా చిత్రహింసలు పెట్టారు.

ఆ విషయం తెలిసిన 'మిసెస్ కెప్టెన్' ఆయనను తీసుకెళ్ళి చికిత్స చేయించారు. అనంతరం గుడివాడ డిప్యూటీ కలెక్టరు రెండేళ్ళ కఠినశిక్ష, జరిమానాలు విధించారు. తిరిగి రాజమండ్రి, అటు పిమ్మట బళ్ళారి జైలుకు పంపబడ్డారు.

1933 అక్టోబరులో గాంధీజీ హరిజనోద్యమ సందర్భంలో ఉపవాసం జరుపుతున్న సందర్భంలో, జైలు నుండి విడుదలయ్యారు. హరిజన సేవక్ సంఘాలలో పనిచేసి హరిజనుల దేవాలయ ప్రవేశానికి కృషి చేశారు.

1935-36 లో జిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. వామపక్ష కాంగ్రెసువాదులు - సోషలిస్టులు కమ్యూనిస్టులు కలసి ఏర్పరచిన కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో పనిచేస్తూ అనేకమంది యువకులను సమీకరించారు. 1930-32 జైలులో ఉండగానే టెర్రరిస్టు విప్లవకారులతో పరిచయాలు కల్గాయి. మార్క్సిస్టు సాహిత్యాన్ని అధ్యయనం చేశారు. విడుదలకాగానే రాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమ స్థాపనకు ఇతరులతో కలసి కృషి ప్రారంభించారు. 1937 లో ప్రారంభమైన పార్టీ పత్రిక నవశక్తికి సంపాదకులుగా పని చేశారు.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ప్రభుత్వ నిర్బంధ విధానం ప్రారంభమై పత్రికను మూసేవరకు సంపాదకులుగా వున్నారు.

పిమ్మట కమ్యూనిస్టుపార్టీ రహస్య పత్రిక 'స్వతంత్ర భారత్' కు సంపాదకత్వం వహించారు. 1939 - 42 మధ్య అజ్ఞాత వాసం గడిపారు.

కమ్యూనిస్టుపార్టీకి బహిరంగ అవకాశాలు వచ్చిన తర్వాత పార్టీ ప్రారంభించిన ప్రజాశక్తి వార పత్రికకు 1942 - 45 వరకు సంపాదకత్వం వహించారు.

1946 లో ప్రజాశక్తి దినపత్రికగా మారినప్పటి నుండి 1948 నిర్బంధ కాలంవరకు దాని సంపాదకులుగా వున్నారు.

1948 జూన్ 1 న డి. ఎస్. పి. థామస్ ఆయనను బుద్ధవరంలో అరెస్టుచేసి, రహస్య సమాచారం చెప్పించేందుకు ఆయనను స్పెషల్ ఆర్మ్‌డ్ పోలీస్‌చేత రకరకాల చిత్రహింసలు పెట్టించారు. అయితే "నువ్వు నాకు శత్రువు" నీకు చెప్పేదేమీ వుండదంటూ స్పృహ కోల్పోయారు. థామస్ ఆయనను చిత్రహింసలుపెట్టి, విజయవాడ పోలీసు క్యాంపుకుతెచ్చి, అక్కడినుండి, రాజమండ్రి జైలుకు పంపారు. ఆ జైల్లో ఎ. కె. గోపాలన్, 'సెగ్రిగేషన్' రద్దు చేసేదాకా సాగిన నిరాహార దీక్షలో శ్రీ చంద్రం పాల్గొని విజయం సాధించారు.

1948 డిసెంబరులో కడల్లూరు జైలుకు మార్చబడ్డారు. ఆ జైలులోనే అప్పుడు రెండుసార్లు జరిగిన కాల్పులలో కొందరు కామ్రేడ్సు చనిపోయారు. కొందరు గాయపడ్డారు, అప్పుడు అక్కడి వారికి నాయకత్వం వహించారు. తండ్రి చనిపోగా, పెరోల్‌మీద విడుదలయ్యారు.

1952 లో విశాలాంధ్ర దినపత్రిక ప్రారంభమైంది. అప్పటి నుండి 1957 వరకు ప్రధాన సంపాదకులుగా ఉన్నారు.

తిరిగి 1964 నుండి 68 వరకు విశాలాంధ్ర సంపాదకులలో ఒకరుగా ఉన్నారు.

1951 లో రాష్ట్ర కమ్యూనిస్టుకమిటీ కార్యదర్శిగా ఎన్నికై 1956 వరకు కొనసాగారు. 1948 నుండి 51 వరకు అఖిలభారత పార్టీ పొలిట్ బ్యూరో సభ్యులుగా ఉన్నారు.

1964 నుండి 70 వరకుతిరిగి రాష్ట్ర సమితి సభ్యులుగాను, రాష్ట్ర కంట్రోల్ కమిషన్ సభ్యులుగాను వున్నారు.

చంద్రంగారి భార్య శ్రీమతి పుణ్యావతి, కృష్ణాజిల్లా కమ్యూనిస్టు నాయకులలో ఒకరైన మైనేని లక్ష్మణస్వామిగారి సోదరి. జిల్లా మహిళా కమ్యూనిస్టు ఉద్యమాలలో పని చేశారు. 48-52 నిర్బంధ కాలంలో పోలీసుల నిర్బంధకాండను ఎదుర్కొన్నారు.

శ్రీ మద్దుకూరి దంపతులు 1968 లో మంగోలియా జాతీయ దినోత్సవాలకు హాజరై, సోవియట్ యూనియన్‌లో పర్యటించారు. శ్రీమతి పుణ్యావతి 1970 లో మరణించారు. వీరికి ఇద్దరు ఆడపిల్లలు,

# మాటా - మంతి

గాంధీ - ఇర్విన్ సంధి నాటినుండి నేటివరకు జరిగిన కాంగ్రెస్ చరిత్రను సింహావలోకనం చేస్తూ, శ్రీ చంద్రశేఖరరావుగారు వ్రాసిన చక్కని వ్యాసం కూడా ఈ సంచికలో వుంది. అందరూ దాన్ని ముఖ్యంగా చదవాలి, విమర్శించాలి అని మనవి చేస్తున్నాము.

ప్రభ : సంపాదకుడు గద్దె లింగయ్య, సం 1 — సంచిక 4 — 1935 మే 20

# 1. కాంగ్రెస్ దేవులాట

— శ్రీ చంద్రశేఖరరావు

గాంధి-ఇర్విన్ సంధినాటి నుండి కాంగ్రెస్ చరిత్రను తగిన జాగరూకతతో పరిశీలిస్తే సహకారపు దేవులాట కనబడుతూనే వుంది.

1930 వ సంవత్సరపు శాసనోల్లంఘన ఉద్యమానికి ఆర్థికంగా సహాయం చేసిన మిల్లు యజమానులంతా సంధి సంప్రతింపులు జరిగే కాలంలో గాంధీగారితో కూడా ఢిల్లీలో ఉండి తమ పరిశ్రమలకు తగిన రక్షణ సంపాదించారు. సంధి షరతుల్లో లెక్కగొనదగ్గది, స్వదేశీని ప్రోత్సాహపరిచే పికెటింగు మాత్రమే. మిల్లు యజమానులకు మాత్రమే లాభదాయకమయిన ఈ సంధిని కరాచీ కాంగ్రెస్ అంగీకరించింది.

సంధి అనంతరం గాంధీగారు ఒక్కరే కాంగ్రెసు తరఫున రౌండ్ టేబిలు కాన్ఫరెన్సుకు ప్రయాణం కట్టారు. గుజరాతు రైతులను ప్రభుత్వం దయకు వదలి, సంపూర్ణ స్వాతంత్ర్యం తీర్మానించిన కాంగ్రెసు ఏకైక ప్రతినిధి, గాంధీగారు, రాష్ట్ర పరిపాలన చాలన్నారు. ధనికుల శాసనసభ (అప్పర్ ఛేంబర్) వుండడానికి అంగీకరించారు. ఫెడరల్ శాసనసభకు ఇండైరెక్టు ప్రాతినిధ్యం అంగీకరించారు. నిరంకుశులైన సంస్థానాధిపతుల ప్రతినిధులతో శాసనసభలను నింపబడడానికి ఒప్పుకొన్నారు. తాము కోరిన హక్కులిస్తే బ్రిటిషు వస్తువులను అభిమానించడానికి సమ్మతించారు. మాగ్డనాల్డుగారికి, సహకారం చేస్తామని వాగ్దానంచేసి మరీ యింటికి మరలారు.

కాని భారతదేశంలో పరిస్థితులు విషమించాయి. ఆర్థిక దుస్థితివల్ల యిదివరకే హీనస్థితిలో వున్న రైతులు - కార్మికులు విజృంభించారు. ముఖ్యంగా సంయుక్త పరగణాలలో, సరిహద్దు రాష్ట్రాలలో రైతులు పన్నులు నిరాకరణ ప్రారంభించారు. అరెస్టులు ప్రారంభమయినాయి. సహకారము చేయాలనే సంకల్పంతో ఇంగ్లండు నుండి బయలుదేరిన గాంధీ రాజ ప్రతినిధిని ఇంటర్వ్యూ అడిగాడు. గాంధీ చాచిన సహకార హస్తాన్ని విల్లింగ్డన్ నిరాకరించాడు.

మళ్లీ శాసనోల్లంఘనం ప్రారంభమయింది. ప్రభుత్వం తీవ్రమైన నిర్బంధ విధానాలతో, లాటీఛార్జిలతో, కాల్పులతో ఎదుర్కొంది. 1930లో ఆర్థికంగా సహాయము చేసిన మిల్లు యజమాను లందరూ తమ పబ్బం గడవడం చేత ఉద్యమానికి సాయంమాని ప్రభుత్వానితో సహకారం చేశారు. ప్రజలు తమంతట తామే రెండు వత్సరాలు ఉద్యమాన్ని నడిపారు. జైయిలు నుండి బయటపడిన నాయకులంతా ఉద్యమాన్ని గంగ కలిపి - హరిజనోద్ధరణ చేస్తామన్నారు.

పూనాలో నాయకులంతా కూడి సమిష్టి శాసనోల్లంఘనం మాని, వ్యక్తిగత సత్యాగ్రహం సాగించాలని తీర్మానించారు. గాంధిగారు సత్యాగ్రహం ఫలప్రదం గాకపోవడం వాలంటీర్లు అహింసా నిరతులు గాకపోవడం వల్లనే అని అన్నారు. రహస్య పద్ధతులను నిరసించారు. అప్పుడే జెయిలు నుంచి విడుదల అయిన జవ్హార్‌లాల్ పోరాటంలో రహస్యం తప్పనిసరి అన్నాడు. గాంధీని స్వరాజ్యమంటే ఏమిటో నిర్ధారణ చేయమన్నాడు. ఆంగ్లేయులు తొలగడంతోనే దోపిడి విధానం అంతమొందదనీ, కష్టజీవుల ప్రభుత్వం స్థాపించడమే స్వరాజ్యమనీ అన్నాడు. గాంధీ సరియైన జవాబు చెప్పకుండా, ధర్మ సూత్రాల చాటున ప్రధాన సమస్యను వదిలేశాడు.

అన్సారీ, ధన్‌రాయి, సత్యమూర్తి, దేశాయిలు ఏకమై కౌన్సిల్ ప్రోగ్రాము లేవదీశారు. అఖిలభారత కాంగ్రెసు సంఘము సమావేశమై శాసనోల్లంఘనం రద్దు చేసింది. ప్రభుత్వము కాంగ్రెసుపై ఆంక్ష తొలగించింది.

కాంగ్రెసు పార్లమెంటరీ బోరు యేర్పడింది. అసెంబ్లీకి పోటీ చేస్తామన్నారు. అక్కడ నిర్బంధ శాసనాలను రద్దుచేయించడానికి పోరాడతామన్నారు. జవహార్‌లాల్ సూచించితే, తాము మొదట నిరాకరించిన, "కాన్‌స్టిట్యూయెంటు అసెంబ్లీ" కోసం పాటుపడతామన్నారు. వచ్చే రాజ్యాంగ విధానాన్ని త్రోసిరాజంటామన్నారు. ఎలక్షన్‌లో పోటీ చేసి జయమొందారు.

అఖిలభారత కాంగ్రెస్ సభ బొంబాయిలో సమావేశమయింది. కౌన్సిలువాదులు తీర్మానాలన్నీ గాంధీగారి చేయూతలో ప్యాసయినాయి. వచ్చే రాజ్యాంగ విధానంలో ఆఫీసు అంగీకరించకూడదన్న తీర్మానాన్ని "ఇప్పుడు కాదు విచారించవలసింద"ని త్రోసివేశారు. అంటే, ఒక విధంగా ఆశ వున్నదని అర్థంగా ? ఒక వైపున రాజ్యాంగ విధానం బహిష్కరిస్తామంటారు. మినిష్టరీలు స్వీకరించకూడదని తీర్మానించడానికి వెనుకంజ వేస్తారు. అంటే వచ్చే రాజ్యాంగ విధానానికి తల ఎగరవేస్తారనే అర్థంగాక యింకేమిటి ? అయితే అలా ఒప్పుకుంటే ప్రజ లేమంటారో అని భయమా ?

స్వరాజ్యం అంటే బీదల రాజ్యమనే సామ్యవాదుల తీర్మానాలన్నీ త్రోసివేశారు. సామ్రాజ్య యుద్ధం వస్తే, కాంగ్రెస్ కర్తవ్యాన్ని చెప్పే తీర్మానాన్ని చర్చకే రాకుండా చేసింది, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ. ఇక అసెంబ్లీలో——

"కాన్‌స్టిట్యుయెంటు" అసెంబ్లీకోసం పోరాడతామని ఎలక్షన్ వాగ్దానాలతో యేకరువు పెట్టినా కాంగ్రెస్ వాదుల్లో ఒకరైనా, జాయింటు పార్లమెంటరీ కమిటీ రిపోర్టుపై చర్చలో మచ్చుకైనా దాన్ని గురించి మాట్లాడలేదు. అసలు దీనిని కాంగ్రెసు నాయకులు మొదట నిరసించారు గాని, ఎలక్షన్ యెత్తుగా పార్లమెంటరీ బోర్డు స్వీకరించింది. తరువాత దైవానికో దయ్యానికో దాన్ని వదిలేసింది. దాన్ని గురించి అడిగితే సి. రాజగోపాలాచారిగారు "అసెంబ్లీ ఉపన్యాసాలవల్ల సంపాదించలేం. త్యాగం కావా"లన్నారు. "ఐతే స్వరాజ్యం, సత్యమూర్తి దేశాయిగార్ల వాగ్ధాటికే రాదని తెలిసికూడా అసెంబ్లీకి ఎందుకు పోటీ చేశారు ?

సి. ఆర్ కూడ పార్లమెంటరీ బోర్డులో ఉన్నారుగా : ఎలక్షన్ మ్యానిఫెస్టోలో దీన్ని యెందుకు చేర్చారు ? ప్రతి ఉపన్యాసంలో తామంతా ఎందుకు యేకరువు పెట్టారు ? ప్రజలను మోసపుచ్చటానికా ?

బడ్జెటు ఉపన్యాసములో దేశాయిగారు తాము మంచిని స్వీకరిస్తాం అని చెడు నిరాకరిస్తామని అంగీకరించారు. ఐతే ఇన్‌కం టాక్సుకు వ్యతిరేకంగా యూరపేయన్లతో కలిసి ఓటుచేయడ మెందుకు ? అది ప్రజాసామాన్యానికి బాధాకరమనా ! ఒక్కొక్కడికి సగటున సాలుకు రు. 15 లైనా ఆదాయం లేని భారతదేశంలో, రు. 150 లకు ఆదాయపు పన్ను భారమనా ? అంటే కాంగ్రెస్ పార్టీ భాగ్యవంతులపార్టీ మాత్రమే నని తెలియడం లేదా ?

క్రిందటి నెలాఖరున జబల్పూరులో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ సంఘం కూడ స్వరాజ్యం అంటే కష్టజీవుల రాజ్యమనే సామ్యవాదుల తీర్మానాన్ని త్రోసివేసింది. సంస్థాన ప్రజాహక్కుల తీర్మానానికి సుప్రసిద్ధ నాయకులంతా వ్యతిరేకంగా మాట్లాడారు. పైగా, అసెంబ్లి కాంగ్రెస్ పార్టీ నాయకుడు, ఫెడ్రల్ రాజ్యాంగ విధానంలో సంస్థాన ప్రజలకు తావులేకుండా జాగ్రత్త పడవలసిందని మహారాజాలకు సలహా ! (ఆక్షేపిస్తే, వ్యక్తిగత దూషణ అంటారు కాబోలేం ?)

సామ్రాజ్య యుద్ధంలో మన కర్తవ్యాన్ని గురించిచెప్పే తీర్మానం విచారించకుండా త్రోసివేయడం, కాంగ్రెసు నిజంగా స్వాతంత్ర్యాన్నీ, బ్రిటనుతో విడివడడాన్నీ కోరడంలేదని తెలియజేయడంలేదా ? వచ్చే సంస్కరణల్లో మంత్రి పదవులు స్వీకరించ కూడదనే తీర్మానాన్ని ఓడించడం, అసెంబ్లీలో సహకారంకోసం దేవులాడే దేశాయిగారి పోలసీని హర్షించడం, కాంగ్రెసు వచ్చే కానిస్టిట్యూషన్ పర్కుచేస్తుందనీ, మంత్రి పదవులు స్వీకరిస్తుందనీ చెప్పకే చెప్పుతున్నాయి. అంటే కాంగ్రెసు సామ్రాజ్య ప్రతికూలం కాదన్నమాట !

చక్రవర్తి జూబిలీ ఉత్సవాన్ని గురించి వెలుపల కాంగ్రెసు మౌనం వహించడం, అసెంబ్లీలో జూబిలీ గ్రాంట్స్ పై ఓటివ్వక

న్యూట్రల్‌గా ఉండడం, చక్రవర్తికి (బ్రిటిష్‌వారికి) మనల్ని పరిపాలించే హక్కున్నదని అంగీకరించడం గాదా? ఒకవైపున పార్లమెంటరీ బోర్డు కార్యక్రమాన్ని సమర్థిస్తూ, ప్రచారం చేస్తూకూడా, తాము మాత్రము శాసనసభలలో ప్రవేశించక, అనారోగ్యంవల్లనో, తదితర కారణాలవల్లో తాము రాజకీయాలలో నుంచి తప్పుకొన్నామని కొందరు కాంగ్రెసు నాయకులు సాకులు చెప్పడానికి కారణ వేమిటి? తిరిగి ప్రజలు విజృంభించి ముందుకు వస్తే, సహకారానికి బాధ్యులం మేము కామని యధాప్రకారం నాయకత్వం సంపాదించడానికేమో!! తిరిగి ప్రజాశక్తిని వృధాపుచ్చడానికేమో!!

# జమీందారులు రైతుల ఆందోళన

## భూమి సమస్య

(నవశక్తి, 15-12-1937)

జమీందారులు తమ బలగాన్ని సమకూర్చుకొంటున్నారు. దేశమందంతటా రైతులలో కలిగిన సంచలనం గాంచి, కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలో రైతుల కిచ్చిన వాగ్దానాలు ఆచరణలో పెట్టుదురేమోనని, భీతిలి జమీందారులు సమాలోచనలు సాగించుచున్నారు. సంయుక్త రాష్ట్రాల్లో, ఒరిస్సాలో, బీహారులో వారు సభలు చేసి కాంగ్రెస్ మంత్రి వర్గాలను, తమకు హితకరం గానట్టి, తమ వంశ పారంపర్య అధికారాలను తగ్గించునట్టి శాసనాలు చేస్తే, అవసర మైతే సత్యాగ్రహమైనా చేస్తామని బెదిరించు చున్నారు. ఆహా! వైపరీత్యం!! స్వాతంత్ర్యం కొరకు సత్యాగ్రహం సల్పినపుడు సామ్రాజ్యవాదుల పక్కతాళం వేయుచు, శాసనోల్లంఘనాన్ని అరాచకోద్యమ మని యీసడించి, శాంతి భద్రతల కాపాడుటకు (Law & order) తాము ఎల్లప్పుడూ సిద్ధమని సామ్రాజ్యవాదులకు బాస చేసిన ఆ జమీందారులే నేడు తమ స్వార్థానికి కించిత్ నష్టం వచ్చు ననగానే "సత్యాగ్రహానికి" కాలు దువ్వుటకు తయారు! అయితే పరస్పర విరుద్ధంగా కాన్పించు యీ వాదనలలోని మూలసూత్రం మాత్రం ఒక్కటియే. నాడు, నేడు వీరు ప్రజా సామాన్య శ్రమ ఫలితాన్ని దోచుకోవడంలో సామ్రాజ్య వాదులతో భాగస్వాములే. అపుడు సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కొంటున్న

ప్రజల స్వాతంత్ర్యోద్యమానికి యిపుడు ప్రజలకు, రైతులకు తప్పని సరిగా యివ్వాలసిన అత్యవసర సంస్కరణలకు కూడా వ్యతిరేకులీ జమీందారులు.

ఇక మదరాసు రాష్ట్రంలో ఎన్నికల వాగ్దానముల నములు పరచుటలో కాంగ్రెసు మంత్రివర్గం వెనుకంజ అయినా జమీందారులు వెనుకంజ కాదు. వారంతా పిఠాపురం రాజా వారి ఆధిపత్యం క్రింద మద్రాసులో సమావేశ మయ్యారు. అధ్యక్షులు, ప్రభుత్వ జమీందారీ విచారణ సంఘం ఎదుట తమ తరపు సాక్ష్యాన్ని సిద్ధపరచాలని జమీందారులకు హెచ్చరిక చేశారు. కాంగ్రెసు ప్రభుత్వమైనా తమ హక్కుల కెట్టి లోటు రానియ్యదనే నమ్మకం వెల్లడించారు. అదే విషయమై వారి పత్రిక 'జనవాణి' ఎలక్షన్లకు ముందు ఏవేవో చాలా వాగ్దానాలు చేశారు. అదంతా ఎలక్షను ఎత్తు......యిపుడు అధికారానికి వచ్చారు. కాబట్టి ఆ సంగతులన్నీ మరచి, అందరి హక్కులు– అంటే జమీందారుల హక్కులు కూడా రక్షించాల్సిన బాధ్యత వారిదేనంటూ కాంగ్రెసు మంత్రి వర్గానికి జోజోలు పాడుతూంది. దీనికి సరియైన సమాధాన మివ్వాలంటే ఎలక్షన్ల ముందు నుంచి జరిగిన విశేషాలు, రైతాంగ పరిస్థితులు నాడు, నేడు యివన్నీ ఒకసారి పర్యాలోకించాలి.

## ఎలక్షన్లకు పూర్వం

ఇదివరకు ప్రజలకు బాధ్యత వహించని సామ్రాజ్యవాద ఉద్యోగులు, జస్టిసు మంత్రుల హయాములో. జమీందారులు, రైతులు తర తరాలనుండి సాగు చేయుచున్న భూములను తమ స్వాధీనం చేసుకున్నారు. ప్రతి ఎస్టేటు, ప్రతి జమీందారీ గ్రామ చరిత్ర ఒకసారి పరికించితే, 30 సంవత్సరాలీ మధ్యనే రైతులు వేలకొలది ఎకరాలు కోల్పోయారనే

సంగతి రుజువు పడుతుంది. అందు శిస్తులు, మగతాలు చెల్లించలేదని 'చేలో' చేర్చుకొన్న భూములున్నాయి. రైతుల కృషివలన సారవంతమై పండుతూంటే, ఆశ జూపి, బెదరించి లాక్కొన్న భూములున్నాయి. జలాశయాలు బాగు చేయించక తమ స్వంత భూములు సాగు పూర్తి అయిన తర్వాత గాని నీ రివ్వక పోవుటచే రైతులు మక్తాలు యివ్వలేక వదలుకొన్న భూము లున్నాయి. అటుల భూమి అంతా రైతుల స్వాధీనం నుండి జమీందారుల పాలయింది. అప్పుడు రైతులు నోరు మెదల్పక, తెల్ల మొహాలు వేసి, ప్రభుత్వం తమది కాదని నిస్పృహజెంది, జమీందారులకు వ్యతిరేకంగా నోరెత్తిన, వారికి అండగా వచ్చు పోలీసు ఉద్యోగులకు జడిసి పూర్వజన్మ ఫలితమని వేదాంతంలో సమాధాన పడ్డారు.

## ఎలక్షను దినాల్లో

ఎలక్షను దినాల్లో, సోషలిస్టులు, యువజనులు, అన్ని స్థలాలలోను, కాంగ్రెసుకు ఎదురుగా సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతో జమీందారులు పోటీ చేస్తున్న స్థలాలలో, కాంగ్రెసు నాయకులను బలపరచి, జమీందారీ విధానానికి వ్యతిరేకంగా తీవ్రమైన ప్రచారం సాగించారు. రైతుపాటలు సోషలిస్టు యువజనుల, దిగ్గంతరాలు తల్లడిల్లచేసే ఆ "ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా", "మాకొద్దీ జమీందార్ల పొందు" అనే పాటలు, "జమీందారీ విధానం నశించాలి", "విప్లవం వర్ధిల్లాలి" అనే నినాదాలు మిన్నుముట్టాయి. దాని ఫలితమే ఏనాడూ జమీందారుకు, సాహుకారుకు ఎదురాడని రైతులు, కూలీలు, పల్లె ప్రజలు వారికి వ్యతిరేకంగా కాంగ్రెసుకు ఓటు చేశారు. కాంగ్రెసు నాయకు లేమి చెప్పినా, అంగీకరించకపోయినా, సోషలిస్టు భావాలు ప్రతిధ్వనింపజేసిన, యువకుల. వాలంటీర్ల గొంతు ధ్వనులకు కర్షకుల హృదయ తంతులు స్పందించి

నాయనుట సత్యము. తాము మనుషులమని, తమలోనూ శక్తి వుందని నమ్మకమేర్పడింది.

## నేడో

దాని ఫలితమే నేడు ఎల్లెడల గాంచుచున్న విజృంభణ, రైతులకు స్వరాజ్యమంటే భూమి తృష్ణ తీరుట, ఆకలి తీరుట. అందుకే వారు కాంగ్రెసుకు ఓటిచ్చారు. కాంగ్రెసు విజయానికి సంతసించారు. తమ స్నేహితుల ప్రభుత్వమని ఆశ. జమీందారులు తిన్నదంతా కక్కమంటున్నారు. నాడు జమీందారులు సామ్రాజ్యవాదుల అండతో లాక్కొన్నారు రైతుల నుండి భూములు, నేడు రైతులు తమ ప్రభుత్వం (కాంగ్రెసు) అధికారంలోకి వచ్చిందనే నమ్మకంతో "ముందుకు సాగుదాం, పదరా" అంటున్నారు. ఇదివరకు సామ్రాజ్యవాదులచే చేయబడిన శాసనాల (**LAW**) క్రింద వారికి వచ్చే లాభంలేదు. అందుకే జమీందారులు, ముఖాసాదారులు, ఎన్నడు కోటలు దాటి ఎరుగనివారు, నేడు పిటీషన్లతో పశ్చిమ కృష్ణా, తూ. గోదావరి (నే నెరిగినంతవరకు) జిల్లా కాంగ్రెసు సంఘాధ్యక్షుల వద్దకు వస్తున్నారు. వారు "రైతులతో మాకేం తగవులేదు. ఎస్టేటు లాండ్ ఆక్టు క్రింద మాకున్న అధికారాల జోలికిమాత్రం రావద్దంటున్నారు" ఇలాంటి విషయమై ముఖాసాదార్లు పశ్చిమ కృష్ణా కాంగ్రెసు అధ్యక్షులు పేట బాపయ్యగారి వద్దకు రాయబారం వచ్చినపుడు నేను హాజరుగా వున్నాను.

కర్షక సమస్య నానాటికీ తీవ్రరూపం దాలుస్తూ వుంది. ఇప్పటి స్థితి యిలాగే వుండాలంటే (**STATUS QUIO**) లాభంలేదు. ప్రపంచం ముందుకు సాగుతూంది "నే నిలచిన చోటే వుంటా"నంటే అభివృద్ధి నిరోధకుల క్యాంపులో కలిసి పోతారు. కాంగ్రెసు మంత్రులు ప్రజలు తమకంటే ఎన్నో రెట్లు ముందున్నారనే సంగతి గ్రహించాలి.

# రెండే మార్గాలు

కాంగ్రెసు మంత్రులు తమకు చిక్కులు కల్పించుచున్నారని దేశమంతటా కార్మిక, కర్షకులలో సంచలనం గాంచి సమ్మెలు చేయించుచున్నారని, సోషలిస్టులను నిందించిన లాభంలేదు. ఒకరు ప్రోత్సహించిన కార్మికులు పొట్టకట్టుకొని సమ్మె చేయరు. కర్షకులు జమీందారు చేలో పంట, చేలోనే దిగవిడువరు (తూర్పు గోదావరి, కేశనకుర్రు, వగైరా గ్రామాలలో అట్లు జరిగింది.) తమ కష్ట ఫలితం తమకు చేరుట లేదనే సంగతి తెలిసినపుడే అటుల చేస్తారు.

ఎంతకాలం అమాయకత్వం, మూఢ నమ్మకాలవల్ల తమ కష్టాలు పోవడం సంభవమనే ఆశలేక నిస్పృహులుగా వున్నారో అంతకాలం జమీందారీ ప్రభ చలామణి అయింది. ఇష్టమొచ్చినటుల బండి నడిచింది. నేడో? రైతులు మేల్కొన్నారు. తమ సంగతులు విచారించేవాళ్లు కష్టాల మూల కారణాన్ని అన్వేషించేవాళ్ళు, రైతు సంఘాలు, సోషలిస్టులు వారి మధ్య ఎప్పుడు కన్పించారో, నాటినుండి వారు తమ శక్తిని తెలుసుకొన్నారు. ఉత్సాహ జ్వాలలు లేచాయి, కష్టాల నెదుర్కొన సిద్ధపడుచున్నారు. వారి కోర్కెలు కొంతవరకైనా తీర్చితే యీ అగ్ని చల్లారుతుంది. అందుకు రైతుల దిగువ కనీసపు కోర్కెలైనా తీర్చాలి.

1 భూములలోని చెట్లు, ఎస్టేటు ల్యాండు ఆక్టుపూర్వపువి, తరువాతవి కూడ రైతులవేనవి అంగీక రించుట.

2. జమీందారు న్యాయమైన శిస్తును (అవి ఏ సందర్భములోను రైత్వారీ ప్రాంత శిస్తును మించి వుండరాదు.) వసూలుచేయు ఏజెంటు మాత్రమేనని భూమి స్వాధీనపు హక్కు రైతుదేనని స్థిరపరుచుట.

3. బకాయీల క్రిందగాని, జబర్దస్తీవల్లగాని యిదివరకు జమీందారులు రైతుల నుండి లాక్కొన్న భూమిని రైతులకిచ్చుట.

4. శిస్తు, మక్తా బకాయీలన్నీ రద్దుచేయుట

5. శిస్తు, మక్తాలు వసూలు సందర్భములో. రైతుల నుండి జీవితాని కవసరమైన కనీసపు భూమి, యిల్లు, పశువులు, ధాన్యము వగైరాలు జప్తులోనికి రాకుండాచేయుట.

6. జమీందారులకు వెట్టిచేయుట, మర్యాదకై చేయవలసియుండు యితర నిర్బంధాలు వెంటనే తొలగించుట.

7. జలదారులు జమీందారుల ఖర్చుపై నిర్బంధముగా బాగుచేయించాలనీ, లేనిచో డి. పి. డబ్ల్యుశాఖ వారి పరంచేయుట.

8. అడవులలో రైతులకు, కూలీలకు పుల్లరి హక్కు కట్టె, కలప, ఆకు, ఉచితంగా గృహోపయోగాలకు తెచ్చుకొనే హక్కునిచ్చుట.

9. భూమి శిస్తు విధానాన్ని మార్చి, ఆదాయాన్ని అనుసరించి, వృద్ధి క్రమానుసారముగా ఇన్‌కంటాక్స్ పద్ధతిని పన్ను విధించుట. కాంగ్రెసు మంత్రులు యివన్నీ శాసన రూపేణా వెంటనే అమలు జరుపుట అవసరం. (ఇటులే కార్మికులకు సంబంధించిన కనీసపు హక్కులు.

అంతేగాని జమీందారీ సభవారి మాటలు, వారి పక్షపత్రికల జోల పాటలకు చెవి యొగ్గినచో, రైతుల విశ్వాసాన్ని గోల్పోతారు. అంతే కాంగ్రెసుకు స్వాతంత్ర్యోద్యమానికి బలగమైన ప్రజల పక్షాన్నుండి జమీందారుల పక్షానికి జేరుతారు. ఆపాలసీ సామ్రాజ్యవాదుల వైపుకు దారి తీయుటకు కూడ ఎంతో అంతర ముండదు. కాన, కాంగ్రెసు మంత్రులు రైతులకు, కార్మికులకు హక్కుల నిచ్చే శాసనాల్తో ముందుకు

సాగాలి. చేయగలిగారా, మంచిది! ప్రజలకు సౌకర్యాలు కల్గించిన వారౌతారు.

గవర్నర్లు ప్రత్యేకాధికారాలతో అడ్డువచ్చారా? ప్రజా సామాన్య మంతా మంత్రుల వైపు. డెడ్ లాక్స్‌కు (ప్రతిష్టంభనలకు) జడిసి జమీందారులకు లొంగారా ప్రజల ఏశ్వాసాన్ని కోల్పోతారు. జమీందారుల మెప్పులు, సామ్రాజ్యవాదుల ఆశీస్సులు అందొచ్చుగాని అశేష జన సామాన్యం వ్యతిరేక మవుతుంది. రెండే మార్గాలు కాంగ్రెసు మంత్రులకు: (1) కార్మిక కర్షకుల కనీసపు కోర్కెలు సాధించుటకు శాసనాలతో ముందుకు సాగుట, చేయగల్గితే చేయుట డెడ్‌లాక్ (ప్రతిష్టంభన)వస్తే ఎదుర్కోడం జంకకుండా (2) జమీందారులు, ధనస్వాములకు వారి కండయైన సామ్రాజ్యవాదానికి లొంగారా, వారికి, ప్రజలకు మధ్య అంతర మేర్పడుతుంది.

## యువకులు, సోషలిస్టుల కర్తవ్యము

దేశ మందంతటా, కార్మికులలో, రైతాంగములో వున్న కదలికను గమనించాలి. ఇదే మంచి సమయము. వర్గ సంఘాల నిర్మాణానికి బలపరచడానికి. సంఘ బలం, నిర్మాణ బలం లేనిదే ప్రజలలో వున్న ఉత్సాహం, శక్తి వృధా అవుతుందనే సంగతి మరచిపోరాదు.

(15-12-1937)

1942 లో విజయవాడలో జరిగిన రాష్ట్ర మహిళా పాఠశాల అధ్యాపకులలో ఒకరుగా శ్రీ చంద్రం. (ఎడమనుండి కుడికి) శ్రీ చలసాని వాసుదేవరావు, శ్రీ చంద్రం, శ్రీ సుందరయ్య, శ్రీ చండ్ర రాజేశ్వరరావు.



# 2. కృష్ణా పత్రిక సంపాదకులకు బహిరంగ లేఖ

ప్రజాశక్తి —7-2-1945

పూజ్యులైన తాతగారికి,

మహాశయా, నమస్కారాలు, మీరు ఆంధ్ర జాతీయ వికాసానికి తోడ్పడిన పెద్దలలో ఒకరు. కృష్ణా పత్రిక ద్వారా మీరు తెలుగు భాషకు, ప్రజలకు చేసిన సేవను తెలుగు ప్రజలందరూ కీర్తించుతారు. వందేమాతరం కాలం నుంచీ మీరు అనేక ఉద్యమాలలో భాగస్వాములు; ఆంధ్ర జాతీయోద్యమానికి పన్నె బెట్టిన ప్రముఖులలో మీ రొకరు. గాంధీ యుగంలో భారత స్వాతంత్ర్యోద్యమ సందేశాలను తెలుగు ప్రజలకు అందజేసిన ముఖ్యులలో మీ రొకరు. ఆ రెండు తరాల జాతీయోద్యమంలో పుట్టి పెరిగి స్వాతంత్ర్య సందేశాన్ని కార్మిక, కర్షక ప్రజాసామాన్యంలోకి తీసుకుపోతున్న మాకు—కమ్యూనిస్టులకు పితృతుల్యులు.

జాతీయోద్యమంలో మొదటి తరం వారైన మీకు మూడో తరం వారమైన మాకు అనేక విషయాలలో అభిప్రాయ భేదా లుండవచ్చు. అలా వుండటం సహజమే కూడ. కాని సత్యవాక్పరిపాలనే ఆదర్శంగా గల పెద్ద లు మీరు. వాస్తవిక పరిస్థితులకు అనుగుణ్యంగా కార్యక్రమం వేసుకొని అమలు జరిపితేనే స్వాతంత్ర్యం సాధించగలమని నమ్మే ప్రజా సేవకులం-మేము. అందుచేత ఏమైనా భేదాలు పొడసూపినపుడు ఒకరి నొకరు అర్థం చేసికోవడానికి ప్రయత్నించడం మీకూ మాకూ కూడా మంచిది. మేమేమైనా పొరపాటు పడితే నిజమేమో తెలిసికొని పూజ్య

లైన మీరు హెచ్చరించడం సబబే. పెద్దలైన మీరు ఏమైనా భ్రమపడితే "తాతగారూ! పొరపాటుపడుతున్నారని" మనవి చేయడం మా విధి. అందుకే నేనీ జాబు వ్రాస్తున్నాను తమకు.

## మీ ఆరోపణలు

1945 జనవరి 27 వ తేదీ సంపాదకీయంలో మీరు యిలా సెలవిచ్చారు. "ఇంతకాలమూ భూగర్భమున దాగి గూఢప్రచారము గావించుచుండిన కమ్యూనిస్టులు సహకారపద్ధతి నవలంబించి, ప్రభువుల అనుగ్రహముతో వెలుగులోకి వచ్చిరి. ఊరూరా వారి సభలు పోలీసు బందోబస్తుతో నిర్భయముగా చెలరేగెను. ఆ అదనులో కాంగ్రెస్‌ను దుర్బలపరచి, తమ పలుకుబడిని వ్యాప్తిని హెచ్చించుకొనుట కెన్నియో ఉపాయములను బన్నిరి. ఆగస్టు తీర్మానమున కపార్థములను గల్పించి, కాంగ్రెసే 'శాబటేజ్' అకార్యములను ప్రోత్సహించుచుండినట్లు దుష్ప్రచారము గావించిరి. కాంగ్రెస్ పేరిట ఎవరో దుండగులు ప్రచురించిన సర్క్యులర్లను కాంగ్రెస్‌కు అంటగట్టి కాంగ్రెస్ జపాన్‌కు అనుకూలముగా "పంచమాంగ దళమైనట్లు నిందింపసాగిరి. ఇంతటితో ఆగలేదు. కాంగ్రెస్ షాహుకార్ల సంస్థయనిరి. గాంధీ మహాత్ముడు కోటీశ్వరుల చేతిలో కీలుబొమ్మ యని చాటుటకు కూడా జంకలేదు. ఈ దుష్ప్రచార బీజము దేశములో నాటుకొనుటకు విద్యార్థి బృందముల నాకర్షించి, వారికి మార్క్సిజం నూరిపోసిరి. రచయితలను జేరదీసి రష్యను గాథలను ప్రచార మొనర్చిరి. ఎర్రజెండా క్రింద రైతు సభలను సమావేశపరచి వారికి విప్లవ గీతములను వినిపించిరి. కర్మకారులను పురికొల్పి వారిచే సమ్మెకట్టులను గట్టించిరి. ఈ విధముగా కమ్యూనిస్టులు దేశము మధ్య ఒక రాజ్యము నిర్మించుచున్నట్లు గన్పట్టెను" అని వ్రాశారు.

ఈ మాటలు, సత్యం దైవస్వరూప మనుకునే మీబోటి పెద్దల కలంనుండి వెలువడవలసినవి కావు. కమ్యూనిస్టు వ్యతిరేకతే ఆదర్శంగా గలవాళ్ళ – స్వంత ఆస్తి ప్రజా హస్తగతం అయిపోతుందని భయపడే

కోటీశ్వరుల - కలవరింతలే అయితే నేను ఈ జాబు వ్రాయవలసిన అవసరం ఉండేదికాదు. పూజ్యులైన తాతగారు, ఆశ్రితుల మాటలకు చెవి యొగ్గి పొరపాటు పడి వుంటారు.

అందుచే నేను ఈ బహిరంగ జాబు ద్వారా తమ అపోహలను తొలగించడానికి ప్రయత్నించుతాను. ఈ నిందారోపణలవల్ల ప్రజలలో కలిగే అనుమానాలను తొలగించడానికి కృషిచేస్తాను.

## నాటి ప్రపంచ విపత్తు

కమ్యూనిస్టుపార్టీకి బహిరంగంగా పనిచేసే అవకాశం లభించ డాన్ని గురించిన విషయంతో మీ ఆరోపణలు ప్రారంభమయ్యాయి. అందుచే నేను కూడా అప్పటినుంచి కమ్యూనిస్టుపార్టీ అనుసరించుతున్న పాలసీని వివరించుతాను. ఆ యా సమయాలలో కమ్యూనిస్టుపార్టీ, కృష్ణా పత్రికా అనుసరించిన విధానాలను పోల్చిచూపుతాను. తాతగారు సంపాదకీయంలో చేసిన ఆరోపణలు నిజమో, అబద్ధమో నిర్ణయించే అధికారం ఆంధ్ర ప్రజలది.

కమ్యూనిసుపార్టీపై ఉన్న నిషేధాన్ని 1942 జూలైలో ఇండియా ప్రభుత్వం తొలగించింది. ఎందువల్ల ? తాతగారు అన్నట్లుగా 'ప్రభు వుల అనుగ్రహంతోనా ? అనే ప్రశ్నలు సహజంగా వస్తాయి. వీటికి సమాధానం కావాలంటే అప్పుడు పరిస్థితులు ఎలా ఉన్నాయో తెలిసి కోవాలి. అందుకు మీ సంపాదకీయాల నుంచే ఉదాహరణలు చూపి, ఆ రోజులలో ప్రపంచ పరిస్థితులు, మన దేశ స్థితిగతులు ఎలా ఉన్నమో తెలుపుతాను.

19:2 మే 28వ తేదీ సంపాదకీయంలో యుద్ధపరిస్థితులను వివ రించుతూ తమరిలా వ్రాశారు : "దైవ విశ్వాసం గల మనం అధర్మ పక్షం గెలుస్తుందని ఎట్లా నమ్ముతాం చెప్పండి ? జర్మనీవాడు గెలిస్తే ఇంకేమైనా ఉందా ? వాడి జాతీయ దురహంకారం క్రింద లోకం తగుల బడిపోదా ? భూదేవి ఎంత క్షమా స్వరూపిణి అయినా, ఇంత వినాశ

నాన్ని సహించి వూరుకుంటుందా !" అని మీరు రానున్న ప్రపంచ విప త్తును పాఠకులకు చూపారు. తత్వవేత్తలైన మీరు, భూదేవి యిలాంటి వినాశాన్ని సహించదనీ ఎలుగెత్తి చాటారు. మీరు సూచించిన లోక విప త్తును కమ్యూనిస్టులం కూడా స్పష్టంగా గ్రహించగలిగాం. తాతగారూ ! మీవలె తత్వవేత్తలం కాము. ప్రజలే మాకు దైవము. రానున్న లోక విపత్తును ప్రజల సాయంతో ఎదిరించ దలచాము. అది లోకానికి స్పష్టంగా వెల్లడించాము ఏ స్వాతంత్ర్యానికై భారతీయుల మంతా యిన్నాళ్ళనుండి పోరాడుతున్నామో. ఆ స్వాతంత్ర్యోద్యమ క్షేమంకొరకే ఫాసిస్టు దుండగీడుల ప్రవాహాన్ని అరికట్టాలని ఎలుగెత్తి చాటాము. జర్మనీ, జపాను ముష్కరులను ఓడించడానికి పోరాడుతున్న ప్రపంచ ప్రజల పక్షాన భారతీయులం కూడా నిలబడతామని హెచ్చరించాము. అందుకు భారతీయులకు అవకాశ మీయాలని ప్రభుత్వాన్ని డిమాండు చేశాము. ఈ వాంఛ ఒక్క కమ్యూనిస్టులదేకాదు. భారత ప్రజలంవరూ ఈ కోర్కెను బలపరచారు. కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించక తప్పలేదు ప్రభుత్వానికి. అందుచే తాతగారు ఆలోచించినట్లుగా 'ప్రభుత్వం అనుగ్రహం' వల్ల కాదు మాకు లీగాలిటీ వచ్చింది. లోకానికి ఘటిల్లిన విపత్తును ఎదిరించటానికి 'మా పార్టీ సరియైన కార్యక్రమం యిచ్చింది. ప్రజల సాయంతో బహిరంగంగా పనిచేసే అవకాశం సంపాదించింది : ప్రభుత్వాధికారుల చేతులలో నుంచి లీగాలిటీని గుంజుకోగలిగింది.

## సాబటేజి చేసిందెవరు ?

"కాంగ్రెసే 'సాబటేజి' అకార్యములను ప్రోత్సహించినట్లు దుష్ప్రచారము" గావించామని తాతగారు రెండో నిందారోపణ చేశారు. 1942 ఆగష్టు ఘటన లప్పటి నుండి విధ్వంసక చర్యలు (సాబటేజి) కాంగ్రెస్ కార్యక్రమంకాదని కమ్యూనిస్టులం స్పష్టంగా ప్రకటించాం. ఈ విషయమై కృష్ణా పత్రిక వ్యాసాలు, మా నాయకుల ప్రకటన ఇచట ఉదహరించుతాను.

1942 ఆగస్టు 22 వ తేదీన కృష్ణాపత్రిక సంపాదకీయంలో ఇలా మీరే వ్రాశారు:-

"ఎప్పుడైనా అనుకొన్నామా; ఈ విధంగా దేశమంతా అల్లరు జరుగుతాయని? ఒక చోటా, రెండు చోట్లా? ఆసేతు హిమాచలం చిచ్చులు అంటుకొని, ఏ ప్రభుత్వం ఊరుకొంటుంది చెప్పండి జనమిట్లా అల్లకల్లోలంలోకి దిగితే? ఇది కేవలం కాంగ్రెస్ పనే అనుకోడానికి వీలులేదు." అని వ్రాసింది. తరువాత ఇది సత్యాగ్రహం కాదని స్పష్టపరచింది. యూనివర్శిటీలకు తాళాలు పెడితే పిల్లలకే నష్టమని చెప్పింది. తరువాత "ఇంతటితో ఆగిందా? టెలిగ్రాఫ్ తీగలు తెంపడం, రైళ్ళ పట్టాలను పీకడం, ట్రెయిన్లను పడకొట్టడం, స్టేషన్లను తగులబెట్టడం, సారాకొట్లనే కాకుండా గవర్నమెంటు ఆఫీసులకు గూడా చిచ్చు పెట్టడం, ఏమి పనులివి? ఇవన్నీ గూండాలుచేసే దుండగాలై ఉంటాయి. కాని శాంతవ్రతులైన కాంగ్రెస్ గోత్రీకుల చర్య లనుకోవడం వట్టి పొరపాటు."

ఇదే సంపాదకీయంలో దేశాన్ని ఎదుర్కొంటున్న భీషణ పరిస్థితు లను యిలా వర్ణించారు మీ కృష్ణా పత్రికలో. "ఇట్టి పరిస్థితులలో గవర్నమెంటు కర్తవ్యమేమి? కాంగ్రెస్ నాయకులు జైళ్ళలో ఉండె కాంగ్రెసేతర ప్రముఖులు జనానాలను వదలి బయటకు రారాయె. నానాటికి మూకల దుండగాలు హద్దులు మీరి పోతుండె. నాగపూర్ చుట్టు ప్రక్కల గ్రామాలను చూడండి. ఒక అగ్ని పర్వతమై పోయింది. మేజిస్ట్రేటు, సూపరింటెండెంటు, పోలీసు ఆఫీసర్లు హింసింపబడ్డారట. ఆఫీసులన్నీ తగులబెట్టబడుతున్నాయి. రోడ్ల మీద జనాన్ని నడవనీయడం లేదు. ఇంత అరాజకం బయలుదేరుతూంటే సహనం ఉండమంటే ఎట్లా? పైగా శత్రువు పొలిమేరల్లో సైన్యం నివహాలను చేరుస్తున్నట్లు వినికిడి. లేకపోతే బర్మాలో కొత్త కొత్త పటాలాలను దించడం దేనికి? ఇండియాలో అల్లర్లు సాగుతున్నాయి కదా, ఇదే సమయం దేశంలో జొరబడడానికి అని ఊహిస్తూ ఉండవచ్చు. బాబూ వాడు కూడా దేశం మీద బడ్డాడా అంటే చిచ్చుకు,గాలి, తోడైనట్లగుతుంది. దేశంలో కొందరు శత్రువు రాక నభిలషించే ద్రోహులు లేకపోలేదు" అని మీరు వివరించారు.

ఇంకా మీరు ఇలా చెప్పారు : "ఇప్పటికే కాలాతీతమైపోయింది. దేశంలో శాంతి భద్రతలు భంగమవుతున్నాయి. వర్తకవ్యాపారాలు స్తంభించిపోయినాయి. గ్రామాలలో దోపిళ్ళు సాగే సూచనలు కూడా కనబడుతున్నాయి. జాగు సేయరాదు. జర్మనీవాడు దక్షిణ రష్యా నంతా ఆక్రమించుకొని ఇరానుగుండా వస్తాడేమో అనే భయం కలుగుతోంది. జపానువాడు ఇండియాపై రేపో, మాపో దాడి సాగిస్తాడు. ఇంకా వట్టి మాటలతో కాలం గడపడమా ? ముందు దేశంలో శాంతి నెలకొల్పడ మవశ్య కర్తవ్యం. ఇందుకు సౌమ్యమార్గమే యథార్థమైన, స్థిరమైన, ఫలప్రదమైన మార్గం. అరెస్టులు, లాటీలు, కాల్పులు ప్రజలలో ద్వేషా నలాన్నింకా ప్రజ్వలింపజేయునే కాని ప్రజానురాగాన్ని ఆకర్షింపలేవు" అనిస్పష్టపరిచారు. తరువాత సంపాదకీయం ఇలా ముగిసింది. "కాల యాపన కూడదు. ఇండ్లు తగులబడి పోతూంటే ఇంకా కుతర్కాలేమిటి? అధికారులు వెంటనే జైళ్ళను తెరచి కాంగ్రెసును, లీగును ఏకం చేసి ప్రజా ప్రభుత్వానికి శంఖుస్థాపన నెంత త్వరగా చేస్తే, దేశానికి బ్రిటన్‌కు మిత్రరాజ్యాలకు అంత మేలు. అప్పుడు ప్రజాదృష్టి అంతా జపానును ప్రతిఘటించే వైపుకు తిరిగి, దేశానికేగాక నేడు యుద్ధపీడిత మైన యావత్ప్రపంచానికి శాంత్యానందాలను కురిపిస్తుంది."

ఆ సంపాదకీయంలోనే కాంగ్రెస్ నాయకులు జైళ్ళలో వుండు టచే యీ అల్లరులను ఆపలేకపోతున్నారని తాతగారు వ్రాశారు. ఇతర పార్టీల నాయకులను ప్రజలలో సభలు పెట్టి ప్రచారం చేసి శాంతి నెల కొల్పమని మీరు హెచ్చరించారు. నిజంగా తాతగారు ఆనాడు దేశాన్ని ఎదుర్కొంటున్న ప్రమాదాన్ని గ్రహించారు. తీవ్ర జాతీయవాదులమని చెప్పుకుంటూ తప్పుమార్గాన పడినవారి ఆక్షేపణలను లెక్కచేయకుండా ప్రజాసేవకుల కర్తవ్యాన్ని తేటతెల్లం చేశారు. సత్యానికి నిలబడ్డారు

## జోషి ప్రకటన

ఈ ఘటనలను గురించే 1942 ఆగస్టు 15 వ తేదీన భారత కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి కామ్రేడ్ పూర్ణచంద్ర జోషి యిలా ప్రకటించాడు :

"పొగరుబోతు సామ్రాజ్యవాదులు మొదటి దెబ్బకొట్టారు. కాంగ్రెసు రాజీకి యింకా తలుపులు తెరిచేవుంది. నిరంకుశ ప్రభుత్వం యావత్తు కాంగ్రెసు నాయకత్వాన్ని అరెస్టు గావించి పరిస్థితిని మరింత అధ్వాన్నమొనరించింది. ప్రభుత్వమే రెచ్చగొట్టింది. అది అరాచక శక్తులకు కళ్ళెంవదలివేసింది. ప్రభుత్వము గుడ్డితనంగా, జాతీయ ప్రతికూల కాంగ్రెసు - సంఘటనను యేర్పరచాలని చూస్తున్నది.

ప్రభుత్వం వెనుకడుగు వేసేదాకా, మా శక్తినంతా ఉపయోగించి పనిచేస్తాం. జాతీయనాయకులను విడిచి పెట్టాలనీ, జాతీయ ప్రభుత్వం విషయమై, ఇండియా స్వాతంత్ర్యం విషయమై కాంగ్రెసుతో తక్షణం రాయబారాలు జరుపవలెనని, ప్రభుత్వాన్ని కోరడానికి మేము ప్రజలను సమీకరించుతాం. అరాచక జ్వాలలో మన మహాజాతీయోద్యమం పోకుండా ఉండడానికి మా శక్తినంతా వుపయోగించి పనిచేస్తాం. ప్రభుత్వం మనయింటికి నిప్పంటించింది. ప్రజలొక్కరే వినాశనం గాకుండా, కూలిపోకుండా రక్షించుకోగలరు. ప్రతి సోదర భారతీయుని ప్రతి సోదర సంస్థను, పరిస్థితులకు తగిన కార్యాచరణకు పూనుకొండని మేము ప్రార్థించు చున్నాము. ఈనాడు మన దేశభక్తియే విషమ పరీక్షకు గురి అయింది. ఫాసిస్టు దురాక్రమణ దారులకు ప్రతికూలమైన ఒకే ఒక ఆయుధమైన జాతీయ ఉద్యమాన్ని ప్రభుత్వం నాశనంచేసి పూడ్చి పెట్టాలని ప్రయత్నించుతోంది.

కాంగ్రెస్ ప్రతికూల సంఘటనను నిర్మించ ప్రయత్నించే ప్రభుత్వ కుట్రను మనం భగ్నంచేయాలి. ఏ పార్టీకి చెందియున్నప్పటికీ యావన్మంది దేశభక్తులు ఐక్య కంఠంతో, కాంగ్రెస్ నాయకులను విడుదల చేయాలని, ఇండియా జాతీయ వాంఛను దీర్చడానికి రాయబారాలు ప్రారంభించాలని, ప్రభుత్వాన్ని కోరాలి. ఇది హిందూ దేశ ప్రజల క్షేమం మనస్సులో వుంచుకొని, యునైటెడ్ నేషన్సు ప్రజల క్షేమాలను మనస్సులో పెట్టుకొని కోరుతున్న కోరిక. ఒక్కొక్క రోజు గడిచిపోయేకొద్దీ, ఫాసిస్టు దురాక్రమణదారులు ఒక్కొక్క అడుగు ముందుకు వేసి జయాన్ని పొందుతున్నారనే విషయం జ్ఞప్తిలో ఉంచుకోండి."

# కమ్యూనిస్టులం ఏమి చేశాం?

కామ్రేడ్ జోషి ప్రకటించినట్లుగానే అప్పటినుంచి యిప్పటివరకు కమ్యూనిస్టు పార్టీ పనిచేస్తోంది. మా పత్రికలలోనుంచి, తీర్మానాలలోంచి యింకా అనేక ఉదాహరణలను నేను యివ్వవచ్చు. కాని స్థలాభావంవల్ల ఇవ్వడంలేదు. తాతగారూ! మీకు కూడా కమ్యూనిస్టు పార్టీ నాటి నుండి ఎలా పనిచేస్తోందో తెలిసే ఉండాలి. మా సభలు "పోలీసు బందోబస్తుతో నిర్భయముగా చెలరేగెను" అని మీరు వ్రాయడం సాహసం. కాంగ్రెస్‌పై అమెరి వేసే నిందలు శుద్ధ అబద్ధాలని మా పత్రికలు ప్రచారం చేస్తూ, మా కామ్రేడ్సు వందలకొలదిగా అరెస్టు అయ్యారు. లీగల్‌గా పోరాడి వారిలో అనేకమందిని విడిపించుకొన్నాం. కొందరు ఇంకా అక్రమంగా జైళ్ళలో మ్రగ్గుతున్నారు.

కాంగ్రెస్ తీర్మానానికి విధ్వంసక చర్యలు పూర్తిగా విరుద్ధమైన వని కమ్యూనిస్టులం ప్రచారం చేశాము. గాడి తప్పిన కాంగ్రెస్ సోదరులు యిందుకే మమ్మల్ని నిందించారు. వారి వాదన యిది: "మీరు పోరాటంలో చేరకపోతే పోయారు కాని మీరు యిది కాంగ్రెస్ పోరాటమే కాదంటున్నారు, రౌడీలు పంచమాంగదళం అనుసరించాలిసిన కార్యక్రమం అంటున్నారు. ఇది అన్యాయం. వెన్నుపోటు పొడవడమని" వాపోయారు. వారి కోపమంతా మేము సాబటేజ్ కాంగ్రెసు కార్యక్రమం కాదన్నందుకే. ఈ సందర్భంలో పూజ్యులైన మీకు ఒక విషయం మనవి చేయడం అవసరం. 1942 ఆగస్టు 22వ తేదీ మీ సంపాదకీయం పట్టాలు తప్పిన కాంగ్రెస్ సోదరులకు ఎంత కోప కారణమయిందో మీకూ తెలుసు. ఒకవేళ మరచిపోతే దయవుంచి జ్ఞప్తికి తెచ్చుకొండి.

మేము కాంగ్రెస్‌ను ఎన్నడూ పంచమాంగ దళమనలేదు. పైగా, దోవ తప్పిన కాంగ్రెస్ సోదరులను వారనుసరించేది కాంగ్రెస్ బాట కాదని స్పష్టంగా హెచ్చరించాము. అందుకే వారికి మీమీద ఆనాడు ఎలా కోపం వచ్చిందో మామీదా అలాగే కోపం వచ్చింది.

అయితే పంచమాంగదళం అని మేము ఎవరినీ అనలేదా? అంటే అన్నాము. స్పష్టంగా అన్నాము. కాని ఎవరిని? "మద్రాసుపై జపాను బాంబులు పడ్డప్పుడు, గుంతకల్లులో పట్టాలు పీకండి - వైజాగ్‌లో జపాను వాళ్ళు దిగితే బలేగా ఉంటుంది. బోసు జపాన్ సైన్యాలతో వచ్చి మనకు స్వరాజ్యం యిప్పిస్తాడు" అని చెప్పిన కొందరున్నారు. వారిని మేము స్పష్టంగా పంచమాంగ దళమని పిలిచాము. వారే ఆకలితో మాడే ప్రజలను దోపిడీలకు ప్రేరేపించిన అరాజకవాదులు-వారే రహస్య పత్రికలలో జపాను అనుకూల ప్రచారం చేశారు. పైగా వాళ్ళు తమ కుళ్ళను కాంగ్రెస్‌కు అంటగట్టడానికి తమ పత్రికలు రాష్ట్ర కాంగ్రెస్ తరఫున, అఖిల భారత కాంగ్రెస్ కమిటీ తరఫున. ప్రకటించబడు తున్నాయని మోసగించ జూశారు. మీరు ఆపాదించినట్లుగా అవి కాంగ్రెసు పత్రికలని మేము ప్రచారం చేయలేదు. స్పష్టంగా ఇలాంటి ప్రచారం చేసిన వ్యక్తులను మేము పంచమాంగదళమని నాడు పిలి చాము. అందుకు నేడు కూడా మేము సిగ్గుపడవలసిన పనిలేదు. ఆ వ్యక్తులే తమ అకార్యాలకు నేటికైనా సిగ్గుపడి, తలవంచుకోవలసి ఉంది. ఈ మాటలు, నేను "చూచారా! మేము చెప్పినట్లే జరిగిందనే" అహంకారంతో చెప్పడంలేదు. అలా చేసిన వాళ్ళు తమ మచ్చఏమిటో యిప్పటికీ తెలిసికొనలేకపోయినందుకు మరల త్రవ్వవలసివచ్చింది. వారెవరైనా మీ చెవివద్దచేరి "కాంగ్రెస్‌నే కమ్యూనిస్టులు పంచమాంగదళ మన్నారని" ఊది వుండవచ్చు.

తాతగారికి నా దొకటే మనవి. అలా చెప్పినవాళ్ళు ఆ రోజులలో తామేమి చేసేవారో, ఎలా వూహించేవారో మీతోనైనా హృదయం విప్పి చెప్పమనండి. మీవలె ప్రపంచానికి దేశానికి వచ్చిన విపత్తును వారు కించిత్తయినా గుర్తించారేమో తెల్సుకోండి. ఇప్పటికైనా వారు 1942 ఆగస్టు 22 వ తేదీన మీరు వ్రాసిన సంపాదకీయాన్ని అంగీకరించి తమ తప్పును గుర్తించారేమో అడగండి!

## ప్రజా సమీకరణ

తాతగారూ! మీ ఆరోపణలలో కార్మికులను, రైతులను, పాటక జనాన్ని మేము ఆకర్షించామన్నారు. నిజమే. ప్రజాసేవ చేశాము.

ఆహారం దొరకక యిబ్బందిపడే ప్రజలకు, రేషనింగ్ ద్వారా తిండి పెట్ట మని ఆందోళన చేశాము. కరువు ప్రాంతాలగు రాయలసీమ, వైజాగ్ లకు వాలంటీర్లను పంపాము. చందాలు పోగుచేసి పంపాము. ప్రజల యిబ్బందులను తీర్చడానికి కృషిచేశాము. ఈ విధమైన ప్రజాసేవ వల్లనే ప్రజలను ఆకర్షించాము. ఈ విషయం మీరు కూడా మీ సంపాదకీయంలో (తేదీ జ్ఞాపకంలేదు) అంగీకరించారు.

కాని మేము బుర్రకథలు, విప్లవ గీతాలతో పాటక జనాన్ని ఆకర్షించామని మీరిప్పుడంటున్నారు. మీరు బహుశా వీటిని వినలేదేమో కేవలం వీటివల్లనే ఎవరికీ ప్రజాపలుకుబడి రాదు. ఏమంటే బిచ్చగాండ్లు ఏండ్ల తరబడి చెప్పడం లేదా? ప్రజాసేవకులు చెప్పే బుర్రకథలు, విప్లవగీతాలకు ప్రత్యేకమైన ప్రాముఖ్యం ఉంది. ప్రజాసమస్యలను ఉత్తేజపరచి, కర్తవ్య నిరతులను చేస్తాయి. అందుకే ప్రజలను ఆకర్షించుతున్నాయి. ఈ సత్యం మీరు గుర్తించాలి. అంతేగాక ప్రాచీన ఆంధ్ర జాతీయ కళారూపాలన్నింటినీ పునరుజ్జీవింపచేసి ప్రజాసేవకు వినియోగించుతున్నందుకు మమ్ములను ఆశీర్వదించాలి.

## చివరి మాట

జనవరి 27 వ తేదీ సంపాదకీయంలో మీరింకా యిలా వ్రాశారు: "కాంగ్రెస్ ప్రముఖులు జైళ్ళలో మ్రగ్గుచుండుటయు, దేశంలో వివిధ వర్గములు కమ్యూనిస్టుల పలుకుబడిలో బడిపోవుటయు కొందరు కాంగ్రెస్ దుర్బలులకు దుఃఖకారణములయ్యెను. కమ్యూనిస్టుల కట్టడములకు దేశములో పునాదులు లేవని వీరు గ్రహించలేక పోయిరి"

కాంగ్రెసు నాయకుల విడుదలకు 1942 నుంచే కృషి చేస్తున్నాము. ఒక్క 1942 నవంబరులో జరిపిన జాతీయ వారంలోనే మేము ఆంధ్ర దేశంలో 1000 గ్రామాలలో సభలు జరిపాము. లక్షల కొలది, ప్రముఖ నాయకుల విడుదలను కోరుతూ నినాదాలు చేశారు. సంతకాలతో పిటిషన్లు పెట్టారు. మీరు ఆరోపించినట్లుగా కాంగ్రెస్ నాయకులు జైళ్ళలో

ఉండుటవల్ల మేము బలపడలేదు. ప్రజలకు సేవచేసి వారి మెప్పులు పొందాము. మేము బలపడటం కాంగ్రెస్‌కు స్వాతంత్ర్యోద్యమానికి బలం. మీరు చెప్పినట్లుగా "కాంగ్రెస్ దుర్బలులు" దుఃఖించవలసిన కారణం లేదు. ప్రజాసేవనువదలి మఠాలు నిర్మించుకొని పూర్వ పుణ్యంతో పెత్తనం చేద్దామనుకునేవారు మాత్రమే భయపడాలి. "కమ్యూనిస్టుల కట్టడములకు దేశములో పునాదులు లేవని" తమరు సెలవిచ్చారు.

ప్రజలే మాకు పునాది. ప్రజాసామాన్యానికి అనుగు బిడ్డలమైన కమ్యూనిస్టులం ప్రజలలో వేరూని వున్నంతకాలం ప్రజాసేవే మా ప్రధాన లక్ష్యమైనంతకాలం, మమ్మలను ప్రత్యర్థులు ఏమీ చేయలేరు. "కాంగ్రెస్ దుర్బలుల"వలె బలహీనపడతామనే భయమూ కమ్యూనిస్టులకు ఎన్నడూ లేదు.

మేము కాంగ్రెస్‌ను కోటీశ్వరుల సంస్థ అనుటలేదు. కాంగ్రెస్ స్వాతంత్ర్యం కోరే ప్రజలందరి సొత్తు. వారందరికీ దానిలో స్థానం ఉండాలంటున్నాము.

దేశంలో తాండవమాడుతున్న కరువు నుండీ, అంటువ్యాధుల నుండీ ప్రజలను రక్షించడానికి మేము దేశభక్తులందరి, కాంగ్రెస్‌వాదులందరి సహకారం కోరుతున్నాం. కాంగ్రెస్-లీగ్ ఐకమత్యం ఏర్పరచి, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల నుండీ, జాతీయ ప్రభుత్వాన్ని గుంజుకోడానికి కాంగ్రెస్ దేశభక్తుల సహకారం కోరుతున్నాం. ఈ కర్తవ్యాలను నెరవేర్చినపుడే స్వాతంత్ర్యోద్యమం బలపడుతుంది. దేశభక్తి పునాదిగా గల పార్టీలన్నీ బలపడతాయి.

మా సభలకు ఎన్నడూ పోలీసుల సహాయం పెట్టుకోలేదు. దుండగీడుల నుండి మా సభలను ప్రజలే రక్షించుతారు. మీరు అభినవ చాణక్యులని పొగడిన కాశేశ్వరరావుగారే బందరు సభకు పోలీసు రక్షణ పెట్టుకున్నారు. మమ్మలను తిడుతూ పోలీసుల ఛాయలో సభను జరుపు

కున్నారనే సంగతి బందరు పౌరులకు తెలుసు. ఇది గాంధీ తత్వమో, సత్యాగ్రహమో, జాతీయ సంప్రదాయమో తమరే సెలవివ్వండి

పూజ్యులైన తాతగారూ! చాలా పొడుగాటి జాబు వ్రాశాను. సత్యాన్ని మరుగు లేకుండా ఎరుకపరచి, మీ హృదయిం దగ్గరకు చేరాలని ప్రయత్నించాను. బందరులో కమ్యూనిస్టు వ్యతిరేకసభను జరిపిన రంగా, కాశేశ్వరరావు ప్రభృతులు మాపై ఏమేమో చెప్పి మీ మనస్సును చికాకు పరచి ఉండవచ్చు. వారు సభలో పలికిన మాటలు, ఆడించిన ఆటలు మన జాతీయ సాంప్రదాయాలకు తగినవేమో తమరే శాంతంగా ఆలోచించండి. మహిళా ఉద్యమాన్ని దూషించిన పెద్దలకు బుద్ధి గరపండి.

శెలవు.

విధేయుడు,

మద్దుకూరి చంద్రశేఖరరావు

(ప్రజాశక్తి వారపత్రిక 7-2-1945)

# 3. రంగా గారి జోబీ సంస్థలు

కంచు కాగడా (17-9-46) ప్రజాశక్తి

ఆచార్య రంగా గారికి జోబీ సంస్థలను నిర్మించడమంటే మహా సరదా! చిన్నపిల్లలు బొమ్మరిళ్లు నిర్మించినట్లే! అవసరమైనపుడెల్లా ఆ సంస్థల పేర్లతో స్టేట్‌మెంట్లు దంచుతారు. అవసరం లేకపోతే జోబీలో పెట్టి దాచివేస్తారు.

చూడండి గత రెండు ఏళ్ళలోనూ ఎన్ని పేపరు సంస్థలను నిర్మించారో!

1944 అక్టోబరు, నవంబరు నెలల్లో రంగాగారు గాంధీజీని కలుసుకున్నారు. కాంగ్రెస్ నాయకత్వం క్రింద పనిచేస్తాం. కిసాన్ కాంగ్రెస్ పెట్టుకుంటామని ఆయన గాంధీజీతో వాదించాడు. "మీ వంకర టింకర మార్గాలు నాకు అర్థంకావు" అని గాంధీజీ ఆక్షేపించారు. ఐనా రంగాగారు తనకు గాంధీజీ అనుమతి యిచ్చాడని డబ్బా వాయించుతూ నిర్మాణ కార్యక్రమం ప్రారంభించారు. వరుసగా కిసాన్ కాంగ్రెస్, లేబరు కాంగ్రెస్, విద్యార్థి కాంగ్రెస్, యువజన కాంగ్రెస్, చేనేత కాంగ్రెస్ వగైరా వగైరాలు వెలిశాయి.

రంగాగారు కిసాన్ కాంగ్రెస్‌కు ఒక ప్రమాణపత్రం తయారు చేశారు. దానిలో ఒకవైపు గాంధీజీ భక్తులనిపించుకోటానికి సత్యా అహింసలను చేర్చారు. రెండవవైపు ప్రజలను మోసపుచ్చడానికి రైతు కూలీ ప్రజారాజ్యం అనే నినాదం చేర్చారు. "జాతీయ కాంగ్రెస్, కిసాన్ కాంగ్రెస్‌ల రైతు కూలీ ప్రజారాజ్యం (పూర్ణ స్వరాజ్యం) ఆశయము

వకు అంగీకరించుతూ యీ ఆశయ సాధనకు వారి సత్యా అహింసాత్మక మార్గములన్నింటిని బలపరచుచున్నాను." (జమీన్ రైతు 1945)

* * * * * *

ఎన్ని జోబీ సంస్థలున్నా రంగాగారి తృప్తి తీరలేదు. 1945 మార్చిలో 'అఖిలభారత గ్రామీణ ప్రజామండలి'ని స్థాపించారు. దాని తరపున ఇండియా ప్రభుత్వ సభ్యుడు సర్ జోగేంద్ర సింగ్‌కు విందు చేశారు.

ఆచార్యరంగాగారు నిజంగా అదృష్టవంతులు. జోబీలో దాచిన గ్రుడ్లు క్రమంగా పొదిగి పిల్లలయ్యాయి. రైతు కాంగ్రెస్, లేబరు కాంగ్రెస్, చేనేత కాంగ్రెస్ వగైరా వగైరా. రైతు-కూలీ ప్రజారాజ్య నినాదమూ, కాంగ్రెస్‌లోని తీవ్రవాదులను ఆకర్షించాయి. వాళ్ళు రంగా గారిని నాయకుడుగా ఎంచసాగారు. రంగాగారి నక్షత్రం ఒక్కొక్క మెట్టుగా నిచ్చెన ఎక్కసాగింది.

రాష్ట్ర కాంగ్రెస్ ఎన్నికలు వచ్చాయి. కాంగ్రెస్‌లోని తీవ్ర వాదులు, ఆగస్టు వీరులు రంగాగారిని బలపరిచారు. రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులయ్యారు.

అటు గ్రామీణ ప్రజామండలి తరపున రంగాగారు 'ప్రపంచ వ్యవసాయదారుల మహాసభకు' ప్రతినిధిగా వెళ్ళారు. ఎంతవారయ్యారో చూడండి ! ఎలిజత్ యువరాణితో కరస్పర్శ చేశారు. ఫొటో తీయించు కున్నారటకూడా.

అలా వుండాలి మరి అదృష్టమంటే. ఇటు రైతు కూలీ ప్రజా రాజ్య నినాదం ! అటు ప్రిన్సెస్ ఎలిజబెత్‌తో షేక్‌హాండ్ ! రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం వచ్చింది. ప్రపంచ ఖ్యాతీ వచ్చింది.

* * *

జూలై 8 వ తేదీన జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీలో రంగా గారు స్వరాజ్యం వచ్చేసినట్లే మాట్లాడినారు. "బ్రిటిష్‌వాళ్లు గాంధీ

గారి 'క్విట్ ఇండియా' నినాదం అంగీకరించారు. వెళ్ళి పోవడానికే మూటాముల్లె కడుతున్నారు" అని సెలవిచ్చారు.

బ్రిటిష్ రాజీ బేరాలను త్రోసివేయాలని తీవ్రవాదులు వాదించు తున్న సమయంలో రంగా గారు యిలా మితవాదుల తరపున చేరాడు. ఇది తీవ్రవాదులలో అసంతృప్తి కలిగించింది.

మేడ ఎక్కిన తరువాత నిచ్చెనతో పని తీరిపోతుంది. ఏరు దాటి నాక తెప్ప ఎందుకు ? అవకాశవాదు లందరి పద్ధతి యిదే !

రంగాగారికి రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షత వచ్చింది. ఇంక నిచ్చె నతో పనే ముంది ? యువజన కాంగ్రెస్ అక్కర లేదన్నారు. దానితో తీవ్రవాదులలో సంచలనం బయలుదేరింది. పత్రికలలో రంగాగారిని విమర్శించుతూ వ్రాయసాగారు.

రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడుగా చేసిన అవకతవకలను తీసుకొని పట్టాభి మొదలైన అఖిల భారత వర్కింగ్ కమిటీకి వరుసగా కంప్లెయింట్లు పంపారు. కాంగ్రెస్‌ను - కిసాన్ కాంగ్రెస్‌ను రంగాగారు కలగా పులగం చేస్తున్నారని ఆక్షేపణలు తెలిపారు.

వర్కింగ్ కమిటీ రంగాగారిని సంజాయిషీ అడిగింది. దానితో రంగాగారు ప్లేటు మార్చారు. ఢిల్లీ వెళుతూ యిలా ఒక స్టేటుమెంటు విసిరి వేశారు.

"ఇపుడు కాంగ్రెస్ విప్లవ సంస్థగా పరివర్తన చెందుతున్నది కనుక, యిక ప్రత్యేకంగా, 'కిసాన్ సభ' అంటూ వుండవలసిన అవ సరం లేదు. కిసాన్ సంస్థలన్నీ కాంగ్రెస్‌లో చేరడం సముచితం" (24 ఆగస్టు - ఆంధ్రప్రభ)

చూడండి ! విచిత్రం ! రంగాగారికి రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షత వచ్చింది, కాబట్టి వారికి స్వరాజ్యం వచ్చినట్లే వుంది. కాంగ్రెస్ ఉద్యో గాలలో ప్రవేశించింది కాబట్టి రంగాగారి దృష్టిలో "కాంగ్రెస్ విప్లవ సంస్థ" అయింది. ఇక కిసాన్ కాంగ్రెస్‌లాంటి సంస్థలు అనవసరం. పైగా హైకమాండ్‌కు కోపం వస్తుంది. కాబట్టి కిసాన్ కాంగ్రెస్

బోటును నట్టేట ముంచవలసిందే! దానిలోవున్న శిష్యులకు వార్నింగైనా యివ్వనక్కరలేదు.

*　　*　　*

ఢిల్లీనుంచి రంగాగారు, లండన్‌లో జరుగుతున్న ప్రపంచ ఆహార మహాసభకు దయచేశారు. ఆయన యీసారి ఇండియా మంత్రి పెథిక్ లారెన్స్ ప్రభువును, హెండర్ సన్‌ను కలుసుకొన్నారు. "కార్మిక పార్టీ వారినిగాని, భారతీయునిగాని, ఇండియా రాజ ప్రతినిధిగా వేయమని" రంగాగారు హిజ్‌మెజస్టీస్ ప్రభుత్వానికి సలహా యిచ్చారట! రంగాగారి అదృష్టపు నక్షత్రం ఆకాశంవైపు పరుగులెత్తుతూందా?

కాని ప్రజలకు కావలసింది లేబరు పార్టీ వైస్రాయీలు కాదు, భారత వైస్రాయీలూ కాదు. బ్రిటిష్ సామ్రాజ్యం పోవాలి. భారత స్వాతంత్ర్యం కావాలి. బ్రిటిష్ ఏజంట్లు, బ్రిటిష్ సైన్యం పోవాలి. భారత ప్రజారాజ్యం రావాలి.

రంగాగారు చాలా కాలం ప్రజలను మభ్య పెట్టగలిగారు. తామెక్కిన నిచ్చెన మెట్లను ఒక్కొక్కటే విరగగొడుతున్నారు.

కాంగ్రెస్‌లోని తీవ్రవాదుల కొక మనవి: ప్రజా ఉద్యమాలను చీల్చబోకండి, పోటీ సంస్థల నిర్మాణం మానండి. రైతుకూలీ సంఘాల్లో చేరి ప్రజా సేవకు పూనుకోండి. ఐక్య ప్రజా ఉద్యమాలతో బ్రిటిష్ సామ్రాజ్యవాదులను పోలీసు దౌర్జన్యాలను ఎదిరించుదాం రండి!

# 4. రాష్ట్ర సమస్య

"విశాలాంధ్ర" మాసపత్రిక జూన్ 1948. సంపుటి-1 సంచిక-4

"ఆంధ్ర రాష్ట్రాన్ని గురించి మనం ఎంత తక్కువ మాట్లాడితే, అంత త్వరగా దానంతటదే రాష్ట్రం వస్తుంది" అంటూ డాక్టర్ పట్టాభి గారు, ఏప్రిల్ ఆఖరు వారంలో విజయవాడనుంచి ఒక ప్రకటన చేశారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడైన ఆచార్య రంగాగారు, ఇతర కాంగ్రెసు నాయకులు కూడా యిదే ధోరణిలో మాట్లాడుతున్నారు.

నిజంగా ఆంధ్రరాష్ట్రం దానంతటదే వస్తుందా? పూర్వపు వాగ్దానాలను పాటించి, కాంగ్రెసు ప్రభుత్వం భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పరుస్తుందా? ఈ ప్రశ్నలు ఆంధ్ర ప్రజలను నేడు ఎదుర్కొంటున్నాయి.

కాని వాస్తవానికి కాంగ్రెసు నాయకులు బ్రిటీషు సామ్రాజ్యవాదుల వలనే భాషా ప్రయుక్త రాష్ట్రాలను నిర్మించడానికి సిద్ధంగా లేరు. ఈ విషయం కాంగ్రెసు నాయకుల ప్రకటనలే ఋజువు చేస్తున్నాయి.

## క్రొత్త సామ్రాజ్యవాదం

అహమ్మదాబాద్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ 1947 సం॥ వార్షిక సభలో ఉపన్యసించుతూ సర్దార్ వల్లభాయి పటేలు ఇలా అన్నారు:

"గుజరాతీలు పరిశ్రమలలోను, వర్తక వ్యాపారాల్లోను ప్రముఖ స్థానం సంపాదించారు. విశేష ధనం గడించారు. తిండి, బట్ట కరువుతో బాధపడే ప్రజలకు సాయపడండి. రాబోవు 50 సంవత్సరాలు మీరు

భారతదేశ మంతటిలోనూ సంపూర్ణ వ్యాపార సౌకర్యాలు అనుభవించ గలుగుతారు. లేకపోతే ఇతర జాతుల ప్రజలు మిమ్ము అసూయతోనూ, ద్వేషంతోను పరిగణిస్తారు."

ఆ సమావేశంలో పాల్గొంటున్న గుజరాత్ మార్వాడి కోటీశ్వరు లకు, వారి రాజకీయ నాయకుడైన సర్దారు పటేలు యీ విధంగా సలహా యిచ్చారు – ఇదే విధంగా బిర్లా పత్రిక అయిన 'హిందుస్థాన్ టైమ్స్,' భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనను వ్యతిరేకిస్తూ అనేకసార్లు వ్రాసింది.

తాతా కంపెనీలో భాగస్తులైన సర్. హెచ్. పి. మోడీ, సర్. అర్దేశ్వర్‌దలాల్ లాంటి ప్రముఖ పెట్టుబడిదారులు కూడ "భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పరచడంవల్ల జాతిద్వేషాలు హెచ్చుతాయ"ని వ్యాసాలు వ్రాశారు.

"ప్రస్తుతం బెంగాలు గవర్నరు, కాబోవు గవర్నర్ జనరల్, ప్రముఖ తమిళ కాంగ్రెసు నాయకుడైన రాజగోపాలాచారిగారు మే 24 వ తేదీన డార్జిలింగులో ఉపన్యసిస్తూ పై ధోరణినే వెల్లడించారు. రాష్ట్ర సరిహద్దుల విషయమై తగవులను, భాషా రాష్ట్రాల విభజన కొరకు జరుగుతున్న ఆందోళనను నిరసిస్తూ ఆయన యిలా అన్నారు :

ప్రస్తుతం మనం ఇండియాను బలపరచడంలోనూ, దానిని సురక్షితంగా సుఖప్రదంగా చేయడంలోనూ నిమగ్నులం కావాలి. ఈ ఆశయం సాధించిన తరువాత రాష్ట్రాలను పునర్నిర్మించడం విషయమై ఆలోచించ వచ్చు" అంటూ అంతవరకు రాష్ట్రాల పునర్విభజన సమస్యను తలపెట్టరాదని వాదించారు.

ప్రముఖ కాంగ్రెసు నాయకులు, పెటుబడిదారులు చేసే యీప్రకటనలో, సత్వర భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణానికి వ్యతిరేకత స్పష్టంగా కనిపిస్తోంది. అంతేకాదు వివిధ జాతులమధ్య తగవులు పెట్ట డానికి ప్రయత్నాలుకూడ జరుగుతున్నాయి.

# తగవులు పెట్టే ప్రయత్నాలు

ఉదాహరణకు అఖిల భారత భాషా ప్రయుక్త రాష్ట్ర సమితి ప్రొఫెసర్ రాధాకమల్ ముఖర్జీ అధ్యక్షతను ఏర్పరచి మహారాష్ట్రిలు కన్నడులు, మలయాళీలు మొదలైన ప్రత్యేక రాష్ట్రాలు లేని వివిధ జాతుల ప్రజలను సమీకరించడానికి, ఆంధ్రులు కృషి చేశారు. కాని ఈ కృషిని, కాంగ్రెసు నాయకత్వం ఒక ఎత్తువేసి విచ్ఛిన్నం చేసింది. "ఆంధ్రరాష్ట్రం సులభంగా నెరవేరే పని, ఇతర రాష్ట్రాల సమస్యతో ముడిపెడితే, ఆంధ్ర రాష్ట్రం కూడ వెనుకబడిపోతుందని ఒక చేత్తో ఆశ – రెండో చేత్తో భయంపెట్టి, ఆంధ్రులను తక్కిన వారినుంచి విడదీశారు. విభజించి పాలించే సామ్రాజ్యవాద నీతిని అవలంబించారు.

పండిట్ నెహూౄ కాన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీలో "ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం సులభమే" నని చెప్పడంలో కూడా అంతరార్థ మిదే. ఈ ప్రకటన జరిగిన వెంటనే మహారాష్ట్రిలు, కన్నడులు వగైరా ఆంధ్రులకు ఏదో వరం వచ్చినట్టు, తమకు రానట్టు ఆందోళన పడసాగారు. కాని నెహూౄ ప్రకటన జరిగి 6 నెలలు గడిచి పోయినా, ఇండియా ప్రభుత్వం ఆంధ్రరాష్ట్రం విషయమై వీసమంతపని అయినా చేయలేదు. నూతన భారత రాజ్యాంగం ముసాయిదాలో ఆంధ్ర రాష్ట్రాన్ని చేర్చలేదు.

పైగా నెహూౄ ప్రకటన వివిధ జాతుల మధ్య తగవులు పెంచడానికి ఉపయోగ పడింది.

ఆంధ్రులతోపాటు, కన్నడులు. మలయాళీలు మా రాష్ట్రం సంగతేమిటని, ఎవరికి వారే వేరు వేరుగా ఆందోళన చేస్తున్నారు. నెహూౄ పండితుడు ఢిల్లీలో చేసిన వాగ్దానం, విశాఖపట్నం ఉపన్యాసంతో ఎగిరిపోయింది. పైగా యీ క్లిష్ట సమయంలో, ప్రత్యేక రాష్ట్రం కోరడం సంకుచిత తత్వమని ఆంధ్రులపై ఆయన విరుచుకు పడ్డారు.

నెహ్రూ విశాఖపట్నం ఉపన్యాసం, కాంగ్రెసు ప్రభుత్వంపై ఆశలు పెట్టుకున్న అనేక మంది భ్రమలను పటాపంచలు చేసింది.

కొండా వెంకటప్పయ్యగారు మొదలుకొని అనేకమంది తమ అసమ్మతిని తెలియజేశారు. తెలుగు పత్రికలన్నీ అసంతృప్తిని వెల్లడించాయి.

## విచారణ కమిటీ నాటకం

ఈ రభస అంతా జరిగాక, రాజ్యాంగ నిర్మాణ సభ అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ "ఆంధ్ర, కన్నడ, కేరళ, మహారాష్ట్రములను విభజించుట వీలగునా ?" అని విచారించడానికి ఒక సబ్ కమిటీని వేశారు. ఇందులో ముగ్గురు నిపుణులుంటారట. సలహా సంఘంలో ఆంధ్ర, కేరళ, తమిళ, కన్నడ, మహారాష్ట్ర, గుజరాత్ ప్రతినిధులు ఒక్కొక్కరు చొప్పున 6 గురు సభ్యు లుంటారు. వీరికి ఓటింగు హక్కు వుండదు; నిపుణుల సంఘానికి సలహా లివ్వడమే వీరి పని.

ఎంతో కాలంనుంచి జాతీయోద్యమం భాషా ప్రయుక్త రాష్ట్ర సూత్రాన్ని, అంగీకరిస్తోంది గదా : అలాంటపుడు యీ విచారణ నాటకం ఎందుకు? కళ్ళనీళ్లు తుడవడానికి, వివిధ జాతులమధ్య తగవులు రెచ్చగొట్టడానికి తప్పితే, ఈ విచారణ సంఘాన్ని ఎందుకు నియమించారు ? బెంగాల్, ఒరిస్సా, బీహార్ రాష్ట్రాల విషయాన్ని ఎందుకు వదిలివేశారు? యీ సందేహాలు అనేకులకు కలుగుతున్నాయి.

ఈ విచారణ పేరుతో కాలయాపన చేయడం, "మీలో మీకు తీవ్రమైన అభిప్రాయ భేదాలున్నాయి కాబట్టి, యిపుడు పునర్విభజన సాధ్యం కాద"ని తీర్పు చెప్పడంతో, విచారణ కమిటీ నాటకం అంతమొందుతుంది. ఇందుకేమీ సందేహం లేదు. ఇదే పద్ధతిలో మద్రాసు మంత్రివర్గం కూడ ఆంధ్రులలో, రాయలసీమ – సర్కారుల మధ్య విభేదాలను, రెచ్చగొట్టడానికి కుట్రలు సాగిస్తోంది.

## విభేదాలు రెచ్చగొట్టే కుట్ర

వివిధ జాతుల మధ్యనూ, ఒకే జాతి ప్రజలలోను తగవులు పెట్టడం, బ్రిటీషు సామ్రాజ్యవాదుల కుటిల నీతిలో ఒక భాగం.

సామ్రాజ్యవాదులు మద్రాసు రాష్ట్రంలో ఆంధ్ర - తమిళ ద్వేషాన్ని రెచ్చగొట్టారు. ఆంధ్రులలో సర్కారు - రాయలసీమ భేదాలను రెచ్చగొట్టారు. దీని ఫలితంగా ఆంధ్ర యూనివర్శిటీ నుంచి రాయలసీమ విడిపోయింది.

రాష్ట్రంలో కాంగ్రెసు మంత్రివర్గం అధికారంలోకి వచ్చి, రెండేళ్లు దాటింది. రాయలసీమ కాలేజీలను ఆంధ్ర యూనివర్శిటీలో చేర్చాలని కోరుతూ ఆంధ్ర యూనివర్శిటీ సెనేట్ ఏనాడో తీర్మానించింది. కాని కాంగ్రెసు ప్రభుత్వం ఇంతవరకు [illegible]నికి ఒడిగట్టలేదు. బ్రిటీషు వాళ్ళు పెట్టిపోయి [illegible].

కర్నూలులో కాలేజీ నిర్మాణానికి, మద్రాసు మంత్రివర్గం నైజాం ఉస్మానియా యూనివర్శిటీకి అనుమతి ఇచ్చింది. మన తెలంగాణా సోదరులను నరకబాధలు పెడుతోన్న నరకాసుర ప్రభుత్వానికి, తన విష ప్రచారం సాగించడానికి యీవిధంగా లైసెన్సు ఇచ్చింది. మద్రాసు ప్రభుత్వం కడపలో నిర్మించే కాలేజీ కూడ, మద్రాసు యూనివర్శిటీ క్రిందనే వుంటుందని వార్తలు వస్తున్నాయి.

రాయలసీమ రైతాంగాన్ని పీడించే భూస్వాముల ప్రతినిధులైన లింగారెడ్డి, బి. శేషారెడ్డి, మృత్యుంజయశాస్త్రి మొదలైన వారు రాయలసీమ మహాసభ పేరిట, ఆంధ్ర రాష్ట్రమే వద్దని ప్రచారం చేస్తున్నారు. మే 27 న బళ్ళారి సభలో మాట్లాడుతూ మృత్యుంజయశాస్త్రి గారు "బ్రిటిషు వాళ్ళు చేసిన రాష్ట్ర విభజనే సర్వోత్తమమైనదని" పొగిడారు. భాషా రాష్ట్ర సిద్ధాంతమే పనికి రాదంటున్నారు. వీరిని ఈ మధ్య కాంగ్రెసులో వున్న భూస్వాముల ప్రతినిధులైన మంత్రి సీతారామరెడ్డి, సంజీవరెడ్డి మొదలైన వారు కూడ పరోక్షంగా బలపరుస్తున్నారని తెలుస్తూంది. "హిందూ" వంటి పత్రికలు వీరి ప్రచారానికి ప్రాముఖ్యమిస్తున్నాయి.

రాయలసీమ ఆర్థికంగా చాలా వెనుకబడి వుంది. నిత్యం కరువు తాండవమాడుతూ వుంటుంది. పెన్నా, కృష్ణలకు ఆనకట్టలు కట్టి,

ఇంకా మైనరు ప్రాజెక్టులు నిర్మించి, రాయలసీమ భూములను పంట పొలాలుగా మార్చాలని ఆంధ్ర ప్రజ లందరూ కోరుతున్నారు. కాని ఆ విషయమై మద్రాసు ప్రభుత్వం అణుమాత్రమైనా కృషి చేయు లేదు. కాని 'రామపాద సాగర్' ముందా ? 'సంగమేశ్వరం' ముందా ? అనే వివాదం అంతులేకుండా పెంచుతోంది. రాయలసీమ, సర్కారు జిల్లాల మధ్య విభేదాలు తీవ్రతరం చేయడానికి రెచ్చగొడుతోంది.

ఈ రకంగా కాంగ్రెస్ మంత్రివర్గం ఆంధ్ర ఐక్యతను నిర్మించడం లేదు. సరిగదా, అనేక విధాల ఆంధ్ర జాతీయైక్యతను విచ్ఛిన్నం చేస్తూంది. కళ్ళఎదుట, సాగిపోతూన్న యదార్థ దృశ్యాలివి. కాని — పట్టాభి, రంగాగార్లవంటి కాంగ్రెస్ నాయకులు "ఆంధ్ర రాష్ట్రం దానంతటదే వస్తుంద"ని చెపుతున్నారు! ఆంధ్రులలో రేగుతున్న ఆందోళన చల్లార్చడానికి, అసత్యాలు వల్లిస్తున్నారు.

బొబ్బిలిరాజు, రెడ్డినాయుడు గార్లు మొదలుకొని, ప్రకాశం, గోపాలరెడ్డి గార్ల వరకు అధికారంలోకి వచ్చిన జస్టిస్, కాంగ్రెస్ నాయకు లందరూ ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర సమస్యను వెనుకవేయడం పరిపాటి అయింది. తమకు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యత్వం యిచ్చినందుకు కృతజ్ఞతగా పట్టాభి, రంగాగార్లు "ఆంధ్ర రాష్ట్రం విషయమై కాంగ్రెస్ ప్రభుత్వాన్ని తొందరచేయ వద్దం"టున్నారు. భారత కోటీశ్వరుల ప్రతినిధులైన నెహ్రూ, పటేలు, రాజాజీ ఉపదేశాలకు ఆంధ్ర కాంగ్రెసు నాయకత్వం యీ విధంగా దాసోహమంటోంది.

## విశాలాంధ్రకు పునాదులు

తెలంగాణాలో మన సోదర ప్రజలు, నైజాం రాక్షస పరిపాలనకు వ్యతిరేకంగా వీరోచిత పోరాటం జరుపుతున్నారు దాదాపు 2500 గ్రామాలలో నైజాం నవాబు ప్రభుత్వం సాగకుండా చేస్తున్నారు దేశముఖులు, జాగీర్దారులను సాగనంపి సాగుచేసే రైతాంగానికి భూమిని పంచుతున్నారు.

వయోజన ఓటింగుతో ప్రజాస్వామ్య పరిపాలనను రూపొందించుకోవాలనీ 1931 కరాచీ ప్రధాన హక్కుల తీర్మానంలో స్వాతంత్ర్యోద్యమం ఉద్ఘాటించింది.

"రహస్య యంత్రాంగ మనేది" సుతరాం పనికిరాదని ఒకవైపున నిర్దేశించుతున్నప్పటికి ప్రభుత్వ దమన నీతి తాండవిస్తున్న సమయాలలో రహస్య కరపత్రాలను, పత్రికలను ప్రచురించడం, విరివిగా పంచడం, శాసనోల్లంఘనోద్యమంలో అంతర్విభాగంగానే సాగుతుండేది. ఆంధ్ర దేశంలో 1930-32 శాసనోల్లంఘనోద్యమాల సందర్భంలో "జయభారత్" "రెడీ" వగైరా రహస్య పత్రికలు, సత్యాగ్రహ బులిటిన్లు ప్రకటిత మయ్యాయి.

1930-32 శాసనోల్లంఘనోద్యమాలను బ్రిటిష్ పాలకులు హింసాకాండతో అణచివేశాక జైళ్ళ నుండి తిరిగి వచ్చిన అనేకమంది యువకులలో స్వతంత్ర భారతదేశంలో సామాజిక విధానం ఎలా వుండాలనే మీమాంస బయలుదేరింది. కేవలం గాంధీజీ పద్ధతులతో స్వాతంత్ర్య సముపార్జన సాధ్యం కాదనే తర్జన భర్జన ఒకవైపు, బహు సంఖ్యాకు రైతాంగం, శ్రామిక ప్రజా ఉద్యమాలను సంఘటితపరచి తంత్ర్యోద్యమానికి జతపరిస్తేనే జాతీయ విముక్తిపోరాటం బ్రహ్మాండన స్వరూపం ధరించి, గమ్యాన్ని సాధించుకోగలుగుతామనే ఆకాంక్ష మరొకవైపు ప్రబలాయి.

## కాంగ్రెసు సోషలిస్టు పార్టీ అవతరణ

కాంగ్రెసు యువకుల్లో ప్రజ్వలించిన నూతన చైతన్యానికి 1935 లో ప్రారంభమైన కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ చిహ్నమనవచ్చు. రెండోవైపున 1917 సోవియట్ సోషలిస్టు విప్లవం నుండి ఉత్తేజం పొంది, బొంబాయి, కలకత్తా, కాన్పూరు వగైరా పట్టణాల్లో కార్మికోద్యమాలలో పాల్గొంటూ మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతాల అధ్యయనంతో ప్రేరితులైన మరికొందరు కార్యకర్తలు కమ్యూనిస్టు గ్రూపులను అప్పటికే నిర్మించారు. శాస్త్రీయ సోషలిస్టు సూత్రాల ఎడల విశ్వాసంగల

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ శాఖలను తమవైపు ఆకర్షించటం ద్వారా కమ్యూనిస్టు గ్రూపులకు దేశవ్యాపిత కార్మికవర్గ విప్లవ పార్టీని నిర్మించే అవకాశం లభించింది.

ఆంధ్రలో 1934 చివరలో కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడింది. 1935 లో కీ॥ శే॥ గద్దె లింగయ్య ప్రచురించిన మాసపత్రిక "ప్రభ"లో "ఆకలి మంటచే మలమలమాడే అనాధులందరు లేవండోయ్"అనే అంతర్జాతీయ కమ్యూనిస్టు గేయం అనువాదం అచ్చయింది. "ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా" గేయాన్ని యీ పత్రికే ప్రకటించింది. మాగ్జిం గోర్కీ నవల "అమ్మ"ను ఆదర్శ గ్రంధమండలి ప్రకటించింది. "ప్రభ" కొద్ది సంచికలతోనే ప్రభుత్వ క్రోధాగ్నికి బలై పోయింది. "అమ్మ" నవల నిషేధించబడింది. ఐనా గోర్కీ నవల "అమ్మ" ఆంధ్రదేశంలో యువతీ యువకులను సోషలిస్టు లక్ష్యంవైపు ఆకర్షించడంలో గొప్పపాత్రను నిర్వహించింది. ప్రాథమిక దశలో ఆర్గనైజరుగా పనిచేసింది.

1936 ఎన్నికలు సంకుచిత ఓటింగుతో జరిగినప్పటికీ బ్రిటిషు ప్రభుత్వ గులాములుగా పనిచేసే జస్టిస్‌పార్టీ, లిబరల్స్ పరాభవం చెందారు. అతివాద శక్తులన్నీ కలసి బలపరచిన కాంగ్రెసు అభ్యర్థులే అధిక సంఖ్యలో ఎన్నికయ్యారు. 1939 వరకు సాగిన సామ్రాజ్య వ్యతిరేక ఐక్యసంఘటన ఆ రోజుల్లో జాతీయ విముక్తి ఉద్యమానికి విరాట్ స్వరూపాన్ని సమకూర్చింది. కార్మికోద్యమంలో ఐక్యతను సాధించడానికి, దేశవ్యాపిత రైతు ఉద్యమాన్ని నిర్మించడానికి కృషి జరిగింది.

అంతవరకు రహస్య కరపత్రాలను, సైక్లోస్టయిల్ పత్రికలను మాత్రమే కమ్యూనిస్టుపార్టీ నడపగలిగేది. రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రి వర్గాలు ఏర్పడటం వల్ల భారత కమ్యూనిస్టుపార్టీ బొంబాయి నుండి 'నేషనల్ ఫ్రంట్' అనే పేరుతో లీగల్ వారపత్రికను ప్రకటించడం మొదటిసారి ప్రారంభించింది.

## నవశక్తి

ఆంధ్ర దేశంలో నవశక్తి వారపత్రిక కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన నడచింది. సోషలిస్టు భావాలను, మార్క్సిస్టు సిద్ధాంతాలను ప్రజలలో ప్రచారం చేసేందుకు వినియోగపడింది. మార్క్స్ వ్రాసిన కమ్యూనిస్టు మేనిఫెస్టో, ఏంగిల్స్ కమ్యూనిస్టు సూత్రాలు, లెనిన్ సామ్రాజ్యవాదం తెలుగులోకి అనువదింప బడ్డాయి. 1937 లో రాష్ట్ర మహాసభలో కార్మిక, రైతు, యువక, మహిళా ఉద్యమాలను, విస్తృత ప్రజానీకాన్ని సమీకరించే కార్యక్రమాలను రూపొందించు కోవటం జరిగింది.

ఆ రోజులలో సోషలిస్టు, కమ్యూనిస్టు భావాలు గల యువకులకు జాతీయ ఉద్యమంతో సన్నిహిత సంబంధాలు వుండేవి. వారి వ్యాసాలను చిత్రగుప్త, ప్రజా బంధు, వగైరా పత్రికలు విరివిగా ప్రకటించేవి. కీ॥ శే॥ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్ర పత్రికలో ఉచితంగా కమ్యూనిస్టు మేనిఫెస్టో వగైరా ప్రచురణల ప్రకటన కొన్ని నెలలపాటు వేయించారు.

అందుచేత 1936 నుంచి రెండో ప్రపంచయుద్ధం ప్రారంభమయ్యే 1939 చివరిభాగం వరకు సాగిన కాలం సామ్రాజ్య వ్యతిరేక ఐక్య సంఘటనకు స్వర్ణయుగమని చెప్పవచ్చు ఆ దశలోనే విస్తృతమైన రైతు ఉద్యమానికి, ఐక్య కార్మికోద్యమానికీ, యువజన - మహిళా ఉద్యమాలకు పునాదులు పడ్డాయి.

## యుద్ధ కాలంలో

బ్రిటిష్ పాలకులు కేంద్ర అసెంబ్లీనిగాని, రాష్ట్ర ప్రభుత్వాలను గాని సంప్రదించకుండానే తమకుతామే బ్రిటిష్ ప్రభుత్వంతోపాటే భారత దేశాన్ని కూడా రెండో ప్రపంచ యుద్ధంలో దించారు. అందుకు అసమ్మతిగా కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా యిచ్చాయి. ఢిల్లీ అసెంబ్లీని జాతీయ నాయకులు బహిష్కరించారు. బ్రిటిష్ సామ్రాజ్య

వాదులు నిర్బంధ విధానాన్ని తీవ్రతరం చేశారు. భారతదేశ ఆర్థిక వనరులను, మానవ బలగాన్ని యుద్ధంలో తమ స్వప్రయోజనాలను నెరవేర్చుకునేందుకు సామ్రాజ్యవాదులు వినియోగించుకున్నారు. ఈదోపిడీని విమర్శించిన పత్రికలపై ప్రభుత్వం దమన నీతిని ప్రయోగించింది.

భారత కమ్యూనిస్టు పార్టీ నడిపిన 'నేషనల్ ఫ్రంట్' నిషేధించబడింది. ఆంధ్ర పార్టీచే నిర్వహించబడుతున్న 'నవశక్తి' నిలిచిపోయింది. ఆంధ్ర దేశంలో తిరిగి కమ్యూనిస్టు పార్టీ 'స్వతంత్ర భారత్' పత్రికను రహస్యంగా అచ్చువేసి, పంచడానికి పూనుకొంది. ఐతే యిలాంటి ప్రచురణలకు పరిమితావకాశాలు మాత్రమే వుంటాయి. అందుచేత 1940 లో పూజ్యులు తాపీ ధర్మారావుగారు స్థాపించిన 'కాగడా' పత్రిక సోషలిస్టు భావాలను, దృక్పథాన్ని వెల్లడించడానికి అవకాశమిచ్చి వామపక్ష ఉద్యమానికి తోడ్పడింది. యుద్ధకాలంలో ప్రజల యిబ్బందులను ప్రతిబింబించడానికి, ప్రభుత్వ దమననీతిని బట్టబయలు చేయడానికి సహాయపడింది.

1942 లో నాజీ మూకలు యూరపు నంతనూ ఆక్రమించి, సోషలిస్టు రాజ్యమైన సోవియట్ యూనియన్‌పై దండయాత్ర చేయడంతోనూ, చైనా భూభాగాల ఆక్రమణతో ప్రారంభమైన జపాన్ దండయాత్ర ఆసియా ఖండాని కంతటికీ విస్తరించడం వల్లనూ ఫాసిస్టు దానిసత్వ ప్రమాదం ప్రపంచమంతటినీ ఎదుర్కొంది.

బ్రిటిష్ ప్రభుత్వం 1942 ఆగస్టులో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించింది. జాతీయ ప్రభుత్వానికి పారిపాలనాధికారం అప్పగించటానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు నిరాకరించటంతో యుద్ధకృషిలో కాంగ్రెసు నాయకుల సహకారాన్ని సంపాదించడానికి బ్రిటిష్ మంత్రి క్రిప్స్ నడిపిన రాయబారాలు విఫలమయ్యాయి. జాతీయ నాయకులను జైళ్ళలో బంధించడంతో ఆగస్టు ఉద్యమం ప్రారంభమయింది.

ఒక వైపున ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించడం, రెండవ వైపున ఆగస్టు ఉద్యమాన్ని హింసాకాండతో అణచివేయడం జరుగుతోంది. ఒక వైపున ప్రపంచ మంతటినీ ఎదుర్కొం

టున్న ఫాసిస్టు ప్రమాదాన్ని ప్రతిఘటించి ఓడించడమే ప్ర
వ్యంగా కమ్యూనిస్టుపార్టీ ప్రచారం చేస్తూంటే, రెండోవైపు
జాతీయ వాంఛను నిరాకరించిన బ్రిటిష్ ప్రభుత్వాన్ని
పెట్టాలనే లక్ష్యసాధనకు ఆగస్టు ఉద్యమం పూనుకొంది. దీనివల్ల ..
నుంచి నిర్మించబడిన సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటన ఛిన్నాభిన్న
మయింది.

ప్రపంచ యుద్ధంలో ఫాసిస్టుమూకలు ఓడిపోయాయి. ప్రపంచ ప్రజాశక్తులు విజయం పొందాయి. కాని మనదేశంలో జాతీయోద్యమానికి, కార్మికవర్గ పార్టీకి మధ్య ఏర్పడిన గండిమాత్రం అలాగే వుండి పోయింది.

## ప్రజాశక్తి దినపత్రిక

1942 లో నిషేధం తొలిగాక కమ్యూనిస్టుపార్టీ "ప్రజాశక్తి" వారపత్రికను నడపడానికి పూనుకుంది. తర్వాత ఎన్నికలముందు ప్రజాశక్తి దినపత్రికగా మారింది. జాతీయ నాయకుల విడుదలకు ఆందోళన చేసింది. యుద్ధ కాలంలో జీవితావసర వస్తువులు దొరకక ప్రజానీకం పడే యాతనలను ప్రతిబింబించింది. కంట్రోల్ ధరలకు సరుకులను అందించాలని ఆందోళనచేస్తూ ప్రజా ఉద్యమాలను నిర్మించింది. బంజర్లను బీదలు ఆక్రమించి అధిక పంటలు పండించేందుకు ప్రోత్సహించింది.

యుద్ధానంతరం అజాద్‌హింద్ సైనికుల విడుదల కొరకు ప్రజ్వరిల్లిన ప్రజావెల్లువకు, నావికా తిరుగుబాటుకు, వివిధ ప్రజా ఉద్యమాలకు 'ప్రజాశక్తి' అండగా నిలబడింది. ఈ మహోద్యమాన్ని అణచటం సాధ్యంకాదనీ, గతంలో వలే దమనకాండతో వలస పరిపాలన కొనసాగించడం సాధ్యంకాదని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు గుర్తించారు. 1947 ఆగస్టులో రాజకీయాధికారాన్ని భారతీయులకు అప్పగించడానికి ఒక వైపున అంగీకరించుతూ, విభజించి పాలించాలనే దుష్ట రాజనీతితో

డోవైపున హిందూ–ముస్లిం మత విభేదాలు సాకుతో భారత ఖండాన్ని రెండుగా చీల్చారు.

తదనంతరం చెలరేగిన మత కలహాలను, దారుణ హింసా కాండను అరికటడానికి కమ్యూనిసుపార్టీ కృషిచేసింది. ప్రజాశక్తి,పై కర్తవ్యాన్ని నిర్వహించడంతోపాటు, తెలంగాణాలో నైజాం నవాబు నిరంకుశత్వానికి వ్యతిరేకంగా, ప్రజాస్వామ్య పరిపాలన కొరకు ప్రజా ఉద్యమాన్ని నిర్మించింది. దేశముఖ్‌ల దౌర్జన్యాలకు, రజాకార్ల దుండగాలకు వ్యతిరేకంగా తెలంగాణా రైతాంగం సాగించిన వీరోచిత పోరాటాన్ని ప్రోత్సహించింది.

## నైజాం వ్యతిరేక పోరాటం

కాంగ్రెస్ ప్రభుత్వం నైజాం నవాబుతో యథాతథపు ఒడంబడిక చేసుకుంది. తెలంగాణా విప్లవపోరాటానికి అండదండలుగా వున్న కమ్యూనిస్టు పార్టీపై దమనకాండ ప్రారంభించింది. 'ప్రజాశక్తి' పత్రికను 1948 ఏప్రిల్‌లో నిషేధించింది

కాంగ్రెసు ప్రభుత్వ నిర్బంధ విధానం నాంది ప్రస్తావన జరిగిన సమయంలో శ్రీ బొల్లిముంత శివరాం తెనాలి నుంచి ప్రచురించిన పక్ష పత్రిక "నగారా", మద్రాసు నుంచి శ్రీ సెట్టి ఈశ్వరరావుగారు నడిపిన మాసపత్రిక "విశాలాంధ్ర" ప్రజా ఉద్యమాలకు తోడ్పడ్డాయి. ఆ చీకటి రోజుల్లో ప్రభుత్వ దుండగాలను బహిర్గతం చేయడంలో సహాయపడ్డాయి.

1948 నుంచి, భారత రిపబ్లిక్ రాజ్యాంగం క్రింద ప్రథమ ఎన్నికలు 1952 లో జరిగే వరకు, కమ్యూనిస్టు ఉద్యమం దారుణమైనహింసా కాండను ఎదుర్కోవలసి వచ్చింది. ఆ చీకటి రోజుల్లో "విశాలాంధ్ర" అనే సైక్లోస్టైయిల్ పత్రికను కమ్యూనిస్టు పార్టీ రహస్యంగా నడిపింది. రహస్య కరపత్రాల ద్వారా ప్రజానీకంతో సన్నిహిత సంబంధాలు వుంచుకోడానికి ప్రయత్నించేది.

అదే సమయంలో మద్రాసు నుంచి పూజ్యులైన తాపీ ధర్మారావుగారు 'జనవాణి' వారపత్రికను నడపడం ప్రారంభించారు.

ప్రజల పైన ప్రభుత్వ హింసాకాండను, జైళ్ళలో ప్రజా సేవకులపై సాగించిన దౌర్జన్యాలను, జరిపించిన హత్యలను బట్టబయలు చేయడంలో 'జనవాణి' తోడ్పడింది. కాటూరు, ఎలమర్రు గ్రామాలలో గాంధీ మహాత్ముని శిలా విగ్రహం ముందు స్త్రీలను వరుసగా నిలబెట్టి దిగంబరులైన పురుషులచే ప్రదక్షిణలు చేయించడం లాంటి దారుణ దృశ్యాలను బహిఃప్రపంచానికి తెలిపి పత్రికా ధర్మాన్ని జనవాణి నెరవేర్చింది.

ఈ దశలోనే పార్టీ తరపున సిద్ధాంత మాస పత్రిక 'జనత', ప్రజా సమస్యల ఆందోళనకు 'సందేశం' నడుపబడ్డాయి. ఆ క్లిష్ట సమయంలో ప్రపంచ రాజకీయాలను, దేశ పరిస్థితులను అవగాహన చేసుకునేందుకు కార్యకర్తలకు వినియోగ పడ్డాయి.

రజాకార్ దుండగాలను ప్రతిఘటించుతూ, తెలంగాణా రైతు ఉద్యమం ఎదురుదెబ్బ తీయగల స్థితిలో వున్నప్పుడు ఇండియా ప్రభుత్వం 'పోలీసు చర్య' పేరుతో హైద్రాబాద్ సంస్థానాన్ని ఆక్రమించి, ఇండియన్ యూనియన్‌లో అంతర్భాగమని ప్రకటించింది. కాని రెండోవైపున గెరిల్లా దళాలపైన హింసాకాండ ప్రారంభించింది. పోరాటకాలంలో రైతులు స్వాధీనం చేసుకున్న భూములను దేశ్‌ముఖ్‌లు కాజేయడానికి తోడ్పడింది.

సకాలంలో పోరాట ఎత్తుగడలను నాయకత్వం మార్పుచేయలేక పోయినందున, కాంగ్రెసు ప్రభుత్వ సాయుధ సైన్యాలతో జరిగిన అసమ యుద్ధంలో అనేకమంది గెరిల్లా వీరులు, కమ్యూనిస్టు కార్యకర్తలు ప్రాణాలర్పించారు. అమరవీరులయ్యారు.

ఐతే కాంగ్రెసు హయాంలో 1948–51 మధ్య కాలంలో ప్రజలపై సాగిన హింసాకాండకు, అవమానాలకు 1952 ఎన్నికల్లో ఆంధ్ర ప్రజానీకం కాంగ్రెసు ప్రభువులకు గుణపాఠం నేర్పింది. తెలంగాణాలోనూ, ఆంధ్ర ప్రాంతంలోనూ కూడ కాంగ్రెసుపార్టీ మైనారిటీపార్టీ అయింది. కమ్యూనిస్టు, ఐక్యసంఘటన అభ్యర్థులను అత్యధికసంఖ్యలో ఎన్నుకొన్నారు. ఎన్నికల సమయంలో ప్రజాశక్తి ద్వైవార పత్రికగా యితోధిక సేవచేసి, విజయాలను చేకూర్చింది.

వివిధ దశలలో ప్రజానీకంలో రాజకీయ ప్రచారం చేయడానికి, సోషలిస్టు భావాలను కార్యకర్తలలో వ్యాప్తి చేయడానికి, ప్రజల యిబ్బందులను ప్రతిధ్వనించుటేగాక వాటిని తొలగించుకునేందుకు జరిగే ఉద్యమాలను ప్రోత్సహించడానికి, కమ్యూనిస్టుపార్టీ పత్రికలను నడిపింది. ఆంధ్రదేశంలో కమ్యూనిస్టుపార్టీని, ప్రజా ఉద్యమాలను విస్తృత పరచడానికి తద్వారా కృషిచేసింది. అదే గమ్యంతో విశాలాంధ్ర దిన పత్రికను 1952 జూన్ 22 వ తేదీన స్థాపించి నడుపుతోంది.

ముప్పది సంవత్సరాల మనుగడలో కమ్యూనిస్టుపార్టీకి, దానిచే నిర్వహించబడిన రహస్య, బహిరంగ పత్రికలకు అవినాభావ సంబంధాలు వున్నాయి. కమ్యూనిస్టుపార్టీ వార, దినపత్రికలను ఆర్గనైజు చేస్తే. వివిధ దశలలో కమ్యూనిస్టు పత్రికలు ప్రజా ఉద్యమాలను. కమ్యూనిస్టుపార్టీని ఆర్గనైజు చేయడానికీ సాధనాలుగా ఉపకరించాయి.

కమ్యూనిస్టు ఉద్యమాభివృద్ధికి, ప్రజాతంత్ర శక్తుల సమీకరణకు. యావదాంధ్ర ప్రజల శ్రేయస్సుకు గత 13 సంవత్సరాలుగా విశాలాంధ్ర దినపత్రిక, నిర్విరామ కృషి సాగించింది. ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం యొక్క,కమ్యూనిస్టు పత్రికలయొక్క, సత్సంప్రదాయాలను, సామ్రాజ్య వ్యతిరేక పత్రికా సాంప్రదాయాలను కొనసాగిస్తూ పీడిత ప్రజావాణిగా తన విద్యుక్త ధర్మాన్ని నెరవేరుస్తున్నది.

1964 నవంబరులో గుంటూరులో జరిగిన రాష్ట్రపార్టీ మహాసభలో వేదికపై చంద్రంగారు. ఎడమనుండి కుడిక ఈశ్వరరెడ్డి, స్వర్ణ వేమయ్య. మగ్దుం, డాంగే. చంద్రంగారు.



# కాంగ్రెస్ నాయకులు అధిక లాభాలను సమర్థించే బాధ్యత స్వీకరించ తగదు

విశాలాంధ్రలో చంద్రంగారి తుది వ్యాసం 27-5-74

కిలో బియ్యం రు. 1-90 పైసలకు అమ్మడం ఏమంత హెచ్చు ధర కాదు" అంటూ ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ గారు పత్రికా విలేకరుల సమావేశంలో సెలవిచ్చినట్లుగా వార్తలొచ్చాయి, రైతు కుటుంబంలో పుట్టిన మిత్రులు, ఆంధ్రప్రదేశ్‌లోని వాస్తవ పరిస్థితులను తెలిసిన వెంకటనారాయణగారు పై విధంగా ప్రకటించడం నాకు ఆశ్చర్యం, విచారం కలిగించింది.

ఏమంటే మాసూళ్ళ తరుణమైన డిశంబరులో అక్కాళ్ళ ధాన్యం 75 కిలోల బస్తా 1 కి రు. 52-50 చొప్పున రైతుల నుండి ప్రభుత్వం సేకరించింది, అలా సేకరించిన రెండు బస్తాల ధాన్యం మిల్లు పడితే 100 కిలోల (క్వింటాల్)కు పైగా మంచి బియ్యం లభ్యమవుతుంది. మిల్లు పట్టినప్పుడు వచ్చే, నూకలు ఖర్చులకు సరి పోతాయి. అందుచేత క్వింటాల్ 100 కిలోల బియ్యం బస్తా 1 కి రు. 105/- లోపుగానే గిట్టుబాటవుతుంది,

సేకరించిన లేవీ ధాన్యం కోపరేటివ్ మిల్లు ఉన్నచోట ప్రభుత్వ సంస్థలకు, లేనిచోట ప్రయివేటు మిల్లు యజమానులకు అందచేశారు.

ఆహార కార్పొరేషన్‌కు క్వింటాల్ 1 కి రు. 125/-లు చొప్పున మిల్లు యజమానులు బియ్యం సప్లయి చేయవలసివుంది. అందుచేత మిల్లు యజమానులకు బియ్యం బస్తా 1 కి రు. 20 లకు మించిన లాభం గిట్టుబాటయింది. ఆహార పదార్థాలలో యింత హెచ్చు లాభాన్ని మిల్లు యజమానులకు కట్టబెట్టే విధంగా కేంద్ర ప్రభుత్వం వడ్లు, బియ్యం ధరలు నిర్ణయించడమే పొరపాటు. బీదప్రజల శ్రేయస్సు దృష్టిలో వుంచుకుంటే అలా చేయవలసింది గాదు.

ఇంత హెచ్చు లాభం వుండటంవల్లనే ప్రయివేటు మిల్లు యజమానులు మాసూళ్ళ తరుణంలో అక్కుళ్ళ ధాన్యం బస్తా 1కి రు. 55 నుంచి 57 వరకు ధరబెట్టి మార్కెట్టులో కొన్నారు. అలా కొన్నప్పుడు కూడా క్వింటాల్ బియ్యం 1 కి మిల్లు యజమానికి 10 రూపాయలకు మించిన లాభం వుంది. ఈ విషయాన్ని కోపరేటివ్ మిల్లు యాజమాన్యం చేస్తున్న ప్రభుత్వ ఉద్యోగులే అంగీకరించారు.

అంతేకాదు. పలుకుబడి గల భూస్వాములు, ధాన్యం నిల్వ చేయగల ధనిక రైతులు, తమకు విధించిన లెవీ ధాన్యాన్ని చెల్లించలేదు. సేకరణాధికారులకు బస్తా 1 కి 4 లేక 5 రూపాయలు ముట్టజెప్పి, లెవీ ధాన్య మిచ్చినట్లు రశీదులు తీసుకున్నారు. ప్రభుత్వ సేకరణ ఉద్యోగులు ధాన్యంబస్తా 1 కి రు. 56 చొప్పున మార్కెట్టులోకొని, ఆ ధాన్యాన్ని పై భూస్వాముల లెవీగా జమ కట్టారు. తదనంతరం నిల్వ చేసిన భూస్వాములు విపరీత ధరలకు అమ్ముకుంటున్నారు. క్రమక్రమంగా అక్కుళ్ళ ధాన్యం బస్తాకి రు. 60/- ఫిబ్రవరిలో రు.70/- లకు పెరిగి యిప్పుడు రు. 80/-లు అమ్ముతున్నది. ధాన్యం నిల్వదారులు నాలుగు నెలల్లో 50 శాతం లాభం గడించారు. సన్నధాన్యం బస్తా 1 కి రు. 90/- పైగా అమ్ముతున్నారు.

ఇందువల్ల మాసూళ్ళ తరుణంలో అమ్ముకున్నరైతులు, ప్రభుత్వ లెవీని స్వయంగా, చెల్లించిన రైతులు, తాము దగా పడ్డామని బాధపడు తున్నారు. రెండో వైపున మార్కెటులో ముతక బియ్యానికే కిలో 1 కి రు. 1–80 పైసలుదాకా చెల్లించుతున్న జన సామాన్యం నానా బాధపడు తున్నారు.

ఇంక చౌక డిపోల తతంగం చూదాం, ప్రభుత్వం మిల్లులనుండి క్వింటాల్ 1 కి రు. 125 లకు సేకరించిన బియ్యాన్ని చౌక డిపోలలో కిలో 1 కి రు. 1–40 పైసలకు అమ్మించడం ఏప్రిల్లో ప్రారంభించింది. వాటిలో మట్టి, రాళ్ళు, వడ్ల గింజలు దండిగా వుంటున్నాయి. రైతాంగాన్నుండి సేకరించిన ధాన్యం ఆడితే మిల్లు యజమానికి శుభ్రమైన బియ్యం క్వింటాల్‌కు రు. 105 లకే లభ్యమవుందని పైన వుదహరించాను. అలాంటపుడు కిలో 1కి రు. 1–40 పుచ్చుకుంటున్న చౌకడిపోల్లోని బియ్యంలో మట్టి రాళ్లు వగైరా వుండాలసిన అవసరం ఏ మొచ్చింది. మిల్లు యజమానులనుండి ప్రభుత్వ వుద్యోగులు లంచాలు మేసి ఇందుకు అవకాశమిస్తున్నారు. కల్తీబియ్యంతో అవస్థపడలేని మధ్య తరగతి ప్రజలు బహిరంగ బ్లాక్ మార్కెటులో కిలో 1 కి రు. 1–80 లకు బియ్యం కొనుక్కోవలసి వస్తున్నది.

మిత్రులు వీరమాచనేనిగారు సైతం పై వాస్తవాలను కాదన లేరు. బహుశ శ్రీవారు ఇతర చోట్ల బియ్యం ధర చాలా హెచ్చుగా వుంది కాబట్టి ఆంధ్రలో యిపుడున్న ధర హెచ్చు కాదని వాదించారు.

కాని మిత్రమా ! నిల్వచేసే ఆర్థిక స్తోమత, వసతిలేని బీద రైతాంగం మాసూళ్ళ తరుణంలోనే అమ్ముకుందని తమకు తెలియదా ? లెవీ ధాన్యం సేకరణ ధర బస్తా 1కి రు 52 – 50 మాత్రమేనని తమకు

ఎరుగుదురుగదా ? కిలో 1కి రు. 1-25 లకే అమ్మించడానికి వీలున్న ముతక బియ్యం కొరకు మార్కెటులో రు. 1-80 ల చొప్పున అమ్మించడం ఘోరం కాదా ?

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా తమరు బాధ్యతాయుత స్థానంలో వున్నారు. బియ్యం మిల్లు యజమానులు, ధాన్యం నిల్వ వ్యాపారుల అధికలాభాలను సమర్థించే బాధ్యత తమరు స్వీకరించడం న్యాయంకాదని మనవి చేస్తున్నాను. ఆహార అధిక ధరలతో బాధపడుతున్న బీద ప్రజల శ్రేయస్సును గమనించండని ప్రార్థన.

# 7. నవ్యాంధ్ర సాహిత్య వీధులు

## గ్రంథ సమీక్ష

ఈ గ్రంథాన్ని హైదరాబాద్ నిజాం కాలేజీ ప్రొఫెసర్. శ్రీ కురుగంటి శీతారామయ్యగారు వ్రాశారు. పీఠికలో గ్రంథకర్తగారే చెప్పుకున్నట్లుగా "నవ్యాంధ్ర సాహిత్య వీధులు" మన సాహిత్య చరిత్రను అవలోకనం చేసిన ప్రథమ గ్రంథం. పత్రికలలోనూ, ఉపన్యాసాలలోనూ నవ్యసాహిత్య పోకడలను గురించి సందర్భానుసారంగా అనేకమంది సమీక్షలు చేశారు. కాని అవేవీ ఈ పుస్తకంవలే 1827 మొదలు 1942 వరకు అనగా 115 సంవత్సరాలలో ఆంధ్ర సాహిత్య వాడలో నిర్మించబడుతున్న నూతన వీధులను గురించియు, నూతన గృహాలను గురించియు చరిత్రాత్మకంగా సమీక్ష చేయలేదు. ఈ గ్రంథం అందుకు తొలి ప్రయత్నం. బెజవాడలో 1940 లో జరిగిన నవ్య సాహిత్య పరిషత్ సభలో శ్రీ విశ్వనాథగారు తమ ఉపన్యాసంలో నవ్య సాహిత్య చరిత్ర కిచ్చిన ఆకారాన్ని అనుసరించే తాను గ్రంథాన్ని వ్రాయబూనుకున్నామని రచయిత చెప్పుకున్నారు.

రచయిత 1827 నుంచి 1942 వరకు ఉత్పత్తి అయిన నవ-సాహిత్యాన్ని సింహావలోకనం చేశారు. ఈ 116 యేండ్ల కాలాన్ని మూడు భాగాలుగా విభజించారు. 1827 మొదలుకొని 1920 వరకు రచింపబడిన సాహిత్యాన్ని మొదటి భాగంలోనూ, 1920 నుంచి 1930 వరకు రెండో భాగంలోనూ, 1930 నుంచి 1942 వరకు మూడో భాగంలోనూ చర్చించారు. 600 పేజీల పుస్తకంలో వందల కొలది రచయితలను గురించి వ్రాశారు. వేలకొలది రచనలను పర్యాలోకించారు. ఈ చిన్ని వ్యాసంలో

గ్రంథంలోని వివరాలలోకి వెళ్ళడం సాధ్యం కాదు. అందుచే నవ్య సాహిత్యాభివృద్ధిని చరిత్రాత్మకంగానూ, శాస్త్రీయ దృక్పథంతోనూ సమీక్ష చేశారా? అనే విషయాన్ని మాత్రమే తర్కించగలం. సుప్రసిద్ధుల ప్రఖ్యాత రచనలను సరిగా విలువ గట్టగలిగారా? అని మాత్రం చర్చించగలం.

## ప్రథమ భాగం

నవ్యాంధ్ర సాహిత్యానికి పునాది 19 వ శతాబ్దం ఉత్తరార్థంలో పడిందనీ, వీరేశలింగం పంతులుగారు యీ సాహిత్యానికి మూలపురుషుడని చెప్పడం తప్పేమీ కాదు అని రచయిత గ్రంథాన్ని ప్రారంభించారు. 1827 కు తెలుగు పుస్తకాల అచ్చు ప్రారంభమయిందనీ, గ్రంథ ప్రచురణా, పఠనాభివృద్ధి ఎలా హెచ్చిందో తెలిపారు. ప్రారంభంలో క్రైస్తవ మిషనరీలు (బ్రౌన్‌దొర వగైరా) తెలుగుభాషకు చేసిన సేవను గురించి చెప్పారు. 19 వ శతాబ్దంలోకి ప్రబంధయుగం అనువృత్తమయిందనీ, ఉత్తరార్థంలో వీరేశలింగం గారు రంగం మీదకు వచ్చారనీ తెలిపారు.

ఈ సంధ్యా కాలంలో వచ్చిన మార్పులను రచయిత సరిగా అంచనా వేయలేదు. ఏదయినా చాలాకాలముంటే గాని, అనుభవించగలిగే దానికంటే ఎక్కువయితేగాని విసుగేస్తుంది. "కడుపు నిండితే గారెలు చేదు" ఒకప్పుడు ఆహ్లాదం కలిగించిన ప్రబంధ కవిత్వం బూజు పట్టిందని వ్రాశారు. "1857 సంవత్సరానికే ఇంగ్లీషువారి రాజ్యాంగం గట్టి పడింది. ఆ భాషను మన ప్రముఖులు కొంతమంది చదువుకొన్నారు. పరదేశ భాషాసంపర్కం మనవాళ్ళ చిత్తవృత్తుల్లో మార్పు కలుగజేసింది." క్రైస్తవమత ప్రచారం వల్ల సనాతనమతం లోపభూయిష్టమనే అభిప్రాయం కలిగి పరమతాలలో చేరటం తటస్థించిందనీ, యీ ఆపత్తును కొందరు మహాశయులు గ్రహించి బ్రహ్మమతం, ఆర్యసమాజం వంటి కొత్తమతాలు లేవదీశారనీ వ్రాశారు. ఎప్పుడైతే మతప్రచారానికి అడ్డు తగిలిందో, ఇంగ్లీషువారు అప్పుడు ఇంగ్లీషు భాషాపఠనం ప్రవేశపెట్టి

వైజ్ఞానికంగా కొంతవరకు విజయం పొందారనే రచయిత, మన సాహిత్యంలో వచ్చిన మార్పుకు కారణాలను, ఫలితాలను ఖరీదు కట్టారు.

మార్పుకు ప్రధాన కారణాన్ని రచయిత గ్రహించలేదు. మార్పు యొక్క బాహ్యరూపాలనే చూశారుగాని లోతుగా చర్చించి అసలు కారణాన్ని గ్రహించలేదు. బ్రిటిష్ పరిపాలన, అదివరకు వచ్చిన ముస్లిం పాలనవంటిదే ననుకొన్నారు గాని సమాజజీవితంలో అది తెచ్చిన గాఢమైన మార్పును గ్రహించలేదు. 19 వ శతాబ్దంలో అచ్చు యంత్రాలు వచ్చాయని వారు వ్రాసినా, భారతదేశంలో అదివరకున్న చేతిపరిశ్రమలూ స్వయం సంపూర్ణ గ్రామాలూ వుండిన ఆర్థిక జీవితాన్ని భగ్నంచేసి ఎలా బ్రిటిష్ సామ్రాజ్యం పెట్టుబడిదారీ ఆర్థిక విధానాన్ని ప్రవేశ పెట్టిందో గ్రహించలేదు "వర్తకపు సరకు"ను ఉత్పత్తిచేసే ఆర్థిక విధానం ప్రవేశించటంతో సమాజజీవితంలోనే మార్పువచ్చింది. విజ్ఞానంలో మార్పువచ్చింది ; నవ్యసాహిత్యానికి పునాది ఏర్పడింది. ఈ సంగతిని అవగాహన చేసికొనక పోవుటచే వీరేశలింగంగారి భాషా సేవను పొగిడినా వారి ప్రాముఖ్యతను గ్రహించలేదు. జమీందారీ యుగపు మూఢాచారాలను ఎదుర్కొంటూ నడిపిన వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమానికీ, నవ్య సాహిత్యానికీ ఆయన వేసిన పునాదులకూ వున్న అవినాభావ సంబంధాన్ని గ్రంథకర్త సరిగా గుర్తించలేదు. అందుచేతనే యీయన "యేనాడు వీరేశలింగంగారు ప్రారంభించారో హిందూ ధర్మ నిరసన ప్రతి అప్రయోజకుడికీ, నీచానువర్తికీ, త్రాగుబోతుకీ, వ్యభిచారికీ కూడ నిరసనకేంద్రమై పోయింది" అని వాపోయారు. (263 వ పేజీ) అందుచేతనే ప్రబంధసాహిత్యం ప్రజావరాన్ని కోల్పోవడానికి కారణం తెలుసుకోలేక, "కడుపునిండితే గారెలు చేదు" అని తేల్చి పారవేశారు.

ఈ భాగంలో వీరేశలింగంగారితో పాటు తరువాత భాషాసేవ చేసిన తిరుపతి వేంకటకవులు, నరసింహత్రయం. ఆంధ్రోద్యమం, విజ్ఞానచంద్రికా గ్రంథమాల, కృష్ణా, ఆంధ్రపత్రికల కృషిని చక్కగా ఉగ్గడించారు. భాషా సంస్కారానికి గిడుగు రామమూర్తిపంతులుగారు

ఆంధ్ర సాహిత్య పరిషత్తుతో సల్పిన పోరాటాన్ని తెల్పారు. వ్యవహార భాషావాదాన్ని ఆచరణలో పెట్టి చూపించి గురజాడ అప్పారావుగారు విజయం గాంచారు. కన్యాశుల్కం, ముత్యాలసరాలు, నీలగిరి పాటలు ద్వారా నూతన సాంప్రదాయాన్ని, ఒరవడిని ప్రారంభించారు.

గ్రంథకర్తగారు గురజాడవారి ముత్యాలసరాలను రాయప్రోలు సుబ్బారావుగారి తృణకంకణం పోల్చి రెండోదే నవ్యకవిత్వానికి ప్రమాణమని వ్రాశారు. (145 వ పేజీ) ఈ పోలిక రచయితకు సుబ్బారావుగారి యెడల అభిమానాన్ని, గురజాడ చూపిన విప్లవపంథాను అంచనా వేయడంలో సంకుచితభావాలను మాత్రమే చూపుతుంది గాని సరియైన అంచనాను తెలుపదు.

ఉత్తమ భాషాంతరీకరణాలైన నాటకాలను చూపుతూ, వీరేశలింగంగారి 'అభిజ్ఞాన శాకుంతలం'ను వసురాయల 'వేణీసంహారం' తో రచయిత పోల్చారు. "వీటి రెండింటిలో తారతమ్యం చర్చచేస్తే వేణీసంహారమే కొంచెం మించిందని చెప్పాలె" అని వ్రాశారు. గ్రంథకర్త యీ పోలికకూడా పూర్తిగా పొరబాటని ఆ రెండు నాటకాలు చదివిన వారికి ద్యోతకమవుతుంది.

అలాగే ఉత్తమ స్వతంత్ర రచనలైన వేదం వెంకటరాయశాస్త్రి గారి ప్రతాపరుద్రీయాన్ని గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కంతో పోల్చి, మొదటిదే మెరుగని తేల్చివేశారు. ఈ పోలికలోకూడ రచయిత సరిగా నిర్ణయించలేక పోయారు. అసలు, రెండు వేరువేరు విషయాలపై వ్రాయబడిన ఉత్తమ రచనలను పోల్చడం సరికాదేమో! అలాచేసినప్పుడల్లా రచయిత నిర్ణయాలు ఛాందస దృక్పథాన్ని మాత్రమే వెల్లడించాయి.

ప్రబంధ సాహిత్యాన్ని "కవిత్వతత్వ విచారం"లో కట్టమంచి రామలింగారెడ్డిగారు ఘాటుగా విమర్శించడం రచయితకు వెగటుగా తోచింది. తక్కిన విమర్శకులంతా రెడ్డిగారి పదవికి దాసులై ఆయన గ్రంథాన్ని పొగిడారని యీయన వాపోయారు. "పాశ్చాత్య వాతావర

ణంలో చేతులు మొగిడ్చి కూర్చున్నవారికి ప్రాచ్యకావ్య విషయము లెట్లు తెలియుననని" విమర్శించిన అక్కిరాజు ఉమాకాంతంగారి వాక్కులు తమ దృక్పథానికి అండగా ఉల్లేఖించుకొన్నారు. మన సారస్వతాన్ని సంప్రదాయానికి విరుద్ధమైన నియమాలతో పరీక్షించడం తప్పని చెబుతూ రచయిత యిలా వ్రాశారు :

"మన వాఙ్మయం చాలమట్టుకు శృంగారరస ప్రధానం. ఈ శృంగారం పాశ్చాత్య వాసనవున్న వాళ్ళలో కొందరికి తలకంటకం. శృంగారమంటే తలకంటకంగ వున్నట్లు కనబడుతారు గాని లోపల యిష్టమైనని ప్రవర్తనవల్ల కనబడుతుంది. ఉంటే ధర్మబద్ధమైన గార్హస్థ్యం వుండాలి ; లేకపోతే చిత్తచాంచల్యం లేని స్థిరప్రజ్ఞత్వం వుండాలె. కాబట్టి యీ ధర్మబద్ధమైన గార్హస్థ్యం పరమావధి దానికి శృంగారం ముఖ్యావసమైది"అని ప్రబంధ శృంగారాన్ని సమర్థించ చూశారు.

కాని, చలం కథలను గురించి వ్రాస్తూ (373 వ పేజీ) "వీటిని చదువుటవల్ల" స్వచ్ఛమై, సరళమై పవిత్రమైన ప్రేమాంకురములు పుట్టి విజృంభించి పెరుగవలసిన మనసులలో తుచ్ఛమై, హేయమై నీచాతినీచమునైన విషవృక్షాంకురము లుదయించి ప్రబలును." అనే ప్రతిభ విమర్శను ఉల్లేఖించుకున్నారు. రచయిత 'పాతవల్లా పవిత్రమైనవే' అనే మూఢ నమ్మకం వదలి ఆలోచించ గలిగితే పై విమర్శన ప్రబంధ సాహిత్యానికి కూడ సమంగానే వర్తించుతుందని గ్రహించ గలిగేవారు; 'కవిత్వతత్వ విచారం'వారి కోపానికి అంత గురి అయ్యేదికాదు. ప్రబంధాలలో రాజులు, గంధర్వుల పాత్రలువుంటే చలం కథలలో సామాన్య మధ్యతరగతి మానవు లున్నారు. రెండింటిలోనూ హేయమైన వర్ణనలే వున్నాయి.

1913–'18 యుద్ధకాలంలో పారిశ్రామిక నాగరికత భారతదేశంలో వేళ్ళూనింది. వెనుకటి మూఢనమ్మకాలు, ఆచారాలపై తిరుగుబాటు బయలుదేరింది. ఆ చిహ్నాలే వైదిక – నియోగి కక్షలు, కుల తిరుగుబాట్లు వగైరా వీటివల్ల దేశమంతా కులకక్షలతో నిండిపోయిందనీ "ఇందులో ఒక చిత్రం : ప్రతికులం బ్రాహ్మణులను దూషించడం, మళ్ళీ బ్రాహ్మణ ధర్మా

లనే అనుసరించటం" అని విసుపోయారు. కాని యీ అసంతృప్తికి, ద్వేషానికి వెనుకవున్న కారణాన్ని తెలిసికోలేదు. అదివరకు హెచ్చు తగ్గులతో నిండివున్న హిందూసమాజంలో క్రిందికులాల తిరుగుబాటు వచ్చిందని గ్రహించలేదు. అందుచే వీరు యీ తిరుగుబాటు ఉద్యమాలతో పాటు వ్రాయబడిన సాహిత్యాన్నికూడ సరిగా విలువ కటలేక పోయారు. త్రిపురనేని రామస్వామిగారి 'సూతపురాణం', పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'భారతవిమర్శనలు', ముద్దుకృష్ణ 'అశోకం' వగయిరా గ్రంథాలు యీ తిరుగుబాట్లకు ప్రతిబింబాలు మాత్రమే. ఇతర దేశాలలో కూడ సమాజానికి మార్పునుకోరే రచయితలు వెనుకటి గాథలనే తిరిగి క్రొత్త పద్ధతిని అన్వయించటంతో ప్రారంభించడమనే సాంప్రదాయముంది. కాని వారు తరువాత తమ పంథాను చూపగలిగిన నూతనసాహిత్యాన్ని రచించుకొన్నారు. మన తిరుగుబాటు దారులు ఆ పనిని తగినంత చేయలేదు. అదే వారి ప్రధానమైన లోటు, దానిని రచయిత గమనించలేదు.

మొదటి భాగాన్ని గ్రంథకర్త 1920 సహాయ నిరాకరణోద్యమ ప్రారంభంతో ముగించారు. యుద్ధఫలితాలు భారత జీవితంలో కలిగించిన మార్పులను రచయిత గమనించలేదు. పైగా ధాన్యం వగైరా ధరలు హెచ్చి కొందరికి ఉపకారం జరిగిందనీ, యుద్ధం రోజుల్లోనే దాదాపు నవ్య సాహిత్య పోషణయంతా జరిగిందనీ - వ్రాశారు. ప్రజాసామాన్యం యుద్ధం రోజుల్లో కరువులు, వ్యాధులవలన పడినబాధల ఫలితంగా రేగిన అసంతృప్తి. ప్రజల్లో కలిగిన చైతన్యం వీరికి కన్పించలేదు. అందుచేతనే అసంతృప్తి ఫలితంగా వచ్చిన ఉద్యమపు లోతును వీరు తరచలేకపోయారు.

## రెండో భాగం

ఈ భాగంలో 1920 నుంచి 30 వరకు ప్రచురణ అయిన సాహిత్యాన్ని చర్చించారు. వెనుకటి భాగంలో వదలివేసిన సహాయ నిరాకరణోద్యమం, అది ప్రజలలో కల్గించిన ఉత్తేజం ఫలితంగా బయలుదేరిన

జాతీయ వాఙ్మయంతో యీ భాగం ప్రారంభింపబడింది. ఆ ప్రవాహంలో జైలుకుకూడా వెళ్ళివచ్చిన రచయిత జాతీయ వాఙ్మయం ప్రజలలో కలిగించిన ఉద్వేగాన్ని సరిగానే అంచనా వేశారు.

నవ్యసాహిత్యంలో యీ కాలంలో వచ్చిన నూతన పోకడలను వీరు సమగ్రంగా సమీక్ష చేశారు. భావ కవులలో లాక్షణిక నియమాలను ఉల్లంఘించినవారిని ఆక్షేపించి, నియమాలను పాటించిన వారిని గౌరవించారు. అదేవిధంగా యీ దశ రచనలలో ద్యోతక మయిన అమలిన శృంగారాన్ని, నూతన రకపు ప్రణయంలో వున్న అభివృద్ధిని వీరు గమనించలేదు. అందుచేతనే "రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు నవ్యులకూ పూర్వులకూ భేదం చెబుతూ పూర్వులు తమ కెంత వైరాగ్య మున్నట్టు కనబడతారో, సమయమస్పుడు అంత భోగవాంఛ వాళ్ళవద్ద కనబడుతూ వుంటుందనీ, వాళ్లు ఆ వాంఛను తీర్చుకోడానికి కావలసిన శరీర మనోదార్ఢ్యాలు కలిగివుండేవాళ్ళని ఉగ్గడించి, యిప్పటివాళ్ళకు దుష్ప్రాంత్వం చేతనో, చిత్త ఏకాగ్రరాహిత్యం చేతనో ఆ పట్టుదల లేక సంపూర్ణముగా అనుభవించే శక్తి లేకుండా దుర్బలులై వున్నారని చెప్పారు. ఇది సత్యం వలెనే కనబడుతుంది" అని వ్రాయగలిగారు. రాయప్రోలును రచయిత నవ్వసాహిత్యానికి నాయకుడిగా గ్రహించి కూడా వారి అమలిన శృంగారంయొక్క పునాదిని,లోతును తెలుసుకోలేదు. జమీందారీయుగపు దేవుడు శంఖ చక్రధారీ - బాహుబల సంపన్నుడు - పెట్టుబడిదారీ యుగపు దేవుడు నిర్గుణ స్వరూపుడు." అదే విధంగా ప్రబంధాలలోని శృంగారం అవయవ వర్ణన, రతిచేష్టలతో నిండి వుంచే, నవ్య కవుల అమలిన శృంగారంలో వాటి అవసరం లేదు, ఈ సంగతి గ్రహించక పోవుట వల్లనే నవ్య పంథాలోని అభివృద్ధిని గమనించలేదు. తేలికగా వెక్కిరించ గలిగారు.

వాస్తవికతను, భావవాదాలను, (రియలిజం, ఐడియలిజంలను) గురించి చర్చించుతూ రచయిత పాశ్చాత్యుల కళా నిర్వచనాన్ని, విషయ విభాగాన్ని ఆక్షేపించారు. గ్రంథకర్త రస జగత్తును నూతన పద్ధతిని 3 భాగాలుగా విభజించారు.

"1. వాస్తవానుభవం (రియలిజం)

2. భావ సంచారం – వ్యక్తిగత సంస్కారం
(పాశ్చాత్యుల ఐడియలిజం)

3. రసానుభవం – అపరోక్షానుభూతి
(మన భారతీయ కవుల రస జగత్తు)"

వీరి దృష్టియందు పాశ్చాత్యుల ఐడియలిజంలో "వ్యక్తిగతమైన (SubJective) చిత్తసంస్కార విషయమేగాని అందు పరోక్షానుభూతి లేదు." భారత కవుల ఐడియలిజం అట్టిదిగాదనీ, భారత కవి రస భావ వివశుడగుట తోడనే, వాస్తవ జగత్తు నతిక్రమించి ఆనంద రస సింధువున నిమగ్నుడగును" అని వ్రాశారు. భారత కవుల ప్రత్యేక గొప్పతనమని చాటుకొంటున్న దశలను దాటి పాశ్చాత్య సాహిత్యం ఏనాడో ముందంజ వేసిందని రచయిత గ్రహించలేదు. రియలిజంలో రసానుభవం యిమిడి వుందనే సంగతి గ్రహించలేదు. అందుచే పాశ్చాత్యుల రియలిస్టు సాహిత్యం నీచమైనదిగా త్రోసివేశారు. భరత వర్షములో కూడ ఆర్యధర్మచ్యుతులైన కుకవులు లేకపోలేదనీ, వారి నీచకావ్యములు ముద్రణా సౌకర్యములే లేనియెడల ఏనాడో మక్షికములకు భక్ష్యములయ్యేవివి" అని వ్రాసుకున్నారు.

గ్రంథకర్త పాశ్చాత్య పోకడలను, నూతన ప్రజాసాహిత్యాన్ని సరిగా అర్థమే జేసుకోలేదనీ ఛాందసదృక్పథం వదలలేదనీ పైమాటలే రుజువుచేస్తాయి. రియలిస్టు సాహిత్యం, వాస్తవికతను, ప్రజల నికృష్ట జీవితాన్ని చిత్రించుతూనే తన్నివారణోపాయాన్ని సూచించుతుందని గ్రహించలేదు. వీరు రియలిజానికీ, సర్రియలిజానికీ వున్న తేడాను తెలిసికోలేదు. తత్ఫలితమే యీ గందరగోళమంతా. అందుచేతనే మూడవ భాగంలో సర్రియలిజాన్ని గురించి వ్రాస్తూ (౬37, 38 పేజీలలో), శ్రీశ్రీ 1923 ప్రాంతపు రియలిస్టు రచనలకూ, 1935 తరువాత వ్రాసున్న సర్రియలిజానికీ వున్న తేడాను గ్రహించలేదు. రెండింటినీ ఒకటిగానే చుట్టబెట్టారు.

# మూడవ భాగం

1930 నుంచి 1942 వరకు వున్న ఈ దశను గ్రంథకర్త 1930-34 సత్యాగ్రహోద్యమంతో ప్రారంభించారు. ఈ ఉద్యమం అపజయం పొందడం. ఆర్థిక సంక్షోభం ప్రపంచాన్నంతా ఆవరించడంవల్ల ప్రజల దృక్పథంలో కలిగిన మార్పులు, వాటి ఛాయలు తరువాత వచ్చిన సాహిత్యంలో ప్రతిబింబించడం గ్రంథకర్త గుర్తించలేదు. అందుచే 1920లో జైళ్ళకు పోయిన వారివలెనే 1930 సత్యాగ్రహంలో జైళ్ళకువెళ్ళివచ్చిన వారు తరువాత జీవయాత్ర జరగడంకోసం ఏదో వృత్తి నవలంబించారనేది మాత్రమే కన్పించింది. ప్రజలలో ప్రచారం కాసాగినసోషలిస్టు, కమ్యూనిస్టు భావాలు. నూతన సోవియట్ నాగరికతఎడల ఏర్పడిన ఆకాంక్షను గ్రంథకర్త అర్థంచేసికోలేదు. అందుచే యీ భాగంలోని సమీక్ష పేలవంగా వుంది. 'వెనుకటివే మంచిరోజులులే' అనే ఉపేక్షా భావంతో నిండివుంది.

కొంతవయస్సు వచ్చాక సాధారణంగా మనిషికి నూతనభావాలను గ్రహించేశక్తి సన్నగిలుతుంది చిన్ననాటి ప్రపంచమే సర్వోత్తమమనీ, తనేమి నేర్చుకునేది లేదనే ఉపేక్షాభావం పెరుగుతుంది. మూడవభాగం లోని సమీక్ష గ్రంథకర్తగారి గ్రహణశక్తి దీనికే ప్రతిబింబిమా అనిపిస్తుంది.

పత్రికల వృద్ధిని, సినిమాల రాకను. కష్టజీవుల జీవితాన్ని చిత్రించే సాహిత్యాన్ని కూడ వీరు యీ సంకుచిత దృష్టితోనే చూచారు, రెండవ దశలోనే ప్రాముఖ్యతకు వచ్చినవారి రచనలను మాత్రం సాకల్యంగా చర్చించారు. నవ్యసాహిత్య పరిషత్తువారిచే నడుపబడుతున్న, ప్రతిభ, చేస్తున్న భాషాసేవను చక్కగా ఉగ్గడించారు.

ఇపుడు ప్రచురింపబడుతున్న సాహిత్య మార్గాలను గ్రంథకర్త గారు యీ క్రింది విధంగా నిర్వచించారు.

"1. సామాన్య నవ్యమార్గం

2. పూర్వసాంప్రదాయ పునర్గమన మార్గం

3. అతి నవ్యమార్గం."

"ఖండకావ్యం రాయప్రోలు చేతుల్లో ధర్మబీజంలో పుట్టి కట్టలను తెంచుకొని సంచరించినప్పటికీ తుదకు విశ్వనాధలో స్థితిని పొందింది. వీరిద్దరూ అద్యంత రక్షకులుగా వున్నారీ ఖండకావ్యానికని వెనుక చెప్పాను. ఆప్రకారంగానే అప్పారావుగారిచేత నాటబడ్డ గేయమార్గం 'కిన్నరసాని' నడకల్లో పరిణతి పొందింది. ఈ రెండు మార్గాలను తనలో సమ్మేళనంచేసి పరిణతిని పొందించాడు విశ్వనాధ. నవలావీధి వీరేశలింగంగారి 'రాజశేఖర చరిత్ర'లో ధర్మ నైరశ్యంతోనూ, సంప్రదాయ నిరసనతోనూ ప్రారంభమై 'మాలపల్లి'లో సామ్యవాదాన్నంగీకరించి, తుదకు సంపూర్ణ ధర్మరక్షణలో 'వేయిపడగలు'లో స్థిరత్వం పొందింది. ఈ విధంగా కూడ విశ్వనాధలో యీమూడు వీధులూ కలిసి త్రివేణీ సంగమమైంది" అని గ్రంథకర్తగారు (53 వ పేజీ) సెలవిచ్చారు. ఈ వాక్యాలద్వారా గ్రంథకర్తగారు తమ భావాలను క్లుప్తంగానూ, స్పష్టంగానూ వెల్లడించారని చెప్పుకోవచ్చును.

కానీ, యిది సరియైన అంచనాయేనా? విశ్వనాధలో నూతన మార్గాలన్నీ పరిణతి చెందాయా? అనే ప్రశ్నలు వస్తాయి. విశ్వనాధ సత్యనారాయణగారు నవ్య సాహిత్యంలో వచ్చిన నూతన రూపాలను ఖండకావ్యం, నవల, కథ గేయం వగైరా అన్నిటినీ చక్కగా ఉపయోగించుతున్న మాట నిజమే. కాని సమాజాభ్యుదయానికీ, ప్రజాసాహిత్య నిర్మాణానికీ వినియోగించుతున్నారా? అంటే శూన్యం అనవలసి వస్తుంది. సామ్రాజ్యవాదుల దోపిడీవలన ఆర్థిక విధానంలో వచ్చిన మార్పు మన సాహిత్యంలో నూతన పోకడలను, రూపాలను సృష్టించింది. కాని, పారిశ్రామిక ఆర్థిక విధానం, విదేశ ప్రభుత్వం పెడుతున్న ఆటంకాల వలన వ్యాపించలేదు; రాజకీయంగా కూడ జాతీయోద్యమం వ్యాపించలేదు. వీటి ఫలితంగా వచ్చిన ఓటమి తత్వప్రతిబింబమే విశ్వనాధుని రచనలో స్పష్టంగా కనబడుతుంది. తెనాలి రామలింగని పిల్లివలే పాశ్చాత్య నాగరికతతో సంబంధించినదంతా ఆయనకు వెగటే. నూతన సాహిత్య రూపా

లను ఆయన నాగరికతాభివృద్ధిని నిరసించడానికీ వినియోగించు తున్నారు. అందుచే ఆయన రచన నవసాహిత్యానికి పరిణతి కాదు. ఎప్పుడూ కాజాలదు.

'కళకోసమే కళ' అనే వాదనను (Art for the Arts sake) రచయిత పనికిరాదన్నాడు. కళకు ప్రయోజనం వుండాలన్నారు.(44వ పేజీ) కాని వీరి దృష్టిలో జమీందారీ యుగపు హిందూ ధర్మరక్షణే సాహిత్యం యొక్క పరమావధి. అంతేగాని పీడితులై దుర్భర దారిద్ర్య మనుభవించుతున్న అశేష ప్రజాసామాన్యాన్ని కర్తవ్య నిరతులను చేయడము వారి హక్కులకై పోరాడటమనే విశాలమైన ప్రయోజనం సాహిత్యానికీ, కళకూ వుందని వీరు గ్రహించటంలేదు.

ఇంక గ్రంథకర్త పోల్చిచూపిన ప్రముఖ రచనలను గురించి ముచ్చటించి వ్యాసాన్ని ముగించుతాను. కాళీపట్నం కొండయ్యగారి "విశ్వరూపం" యుగాభరణ మన్నారు. అందులో అతిశయోక్తి ఏమీ లేదు. వేలూరి శివరామశాస్త్రిగారు అనువదించిన "ఆత్మకథ"నూ, ముదిగంటి జగన్నగారు అనువదించిన "నెహ్రూ జీవితా"న్ని పోల్చిచూపి రెండో అనువాదమే ఉత్తమంగా వుందని వ్రాశారు. రాజకీయ ప్రాముఖ్యతను బట్టి 'నెహ్రూ జీవితం' ప్రశస్తమైన గ్రంథమే. కాని అనువాదం "ఆత్మకథ" కంటే బాగుందనటం పెద్ద పొరపాటు. శివరామ శాస్త్రిగారిచే అనువదించబడిన గాంధీజీ "ఆత్మకథ" మృధువుగా నడుస్తూ, గాంధీగారి మూలంలోని భావాలను చక్కగా పోషించింది. జగన్నగారి అనువాదం అనేకచోట్ల పూర్తిగా విఫలమయింది. ఆ సంగతి రెండు పుస్తకాలనూ చదివిన వారందరికీ విశద మవుతుంది.

ఉత్తమ నవలలుగా ఉన్నవ లక్ష్మీనారాయణగారి "మాలపల్లి" అడివి బాపిరాజుగారి 'నారాయణరావు' విశ్వనాథ సత్యనారాయణగారి 'వేయిపడగలూ' పోల్చి గ్రంథకర్త "తుదిదే ఉదాత్తమమై, ధర్మరక్షణకు కంకణం కట్టుకొన్నది." అని ఎన్నుకున్నారు.

"వేయిపడగలు" జమీందారీ యుగానికి – దేవదాసీ నాగరికతకు తిరోగమనము చేస్తే ధర్మరక్షణ జరుగుతుందని వాదించుతుంది. "నారా

యణ రావు" జమీందారీ డాబుసరి. మూఢనమ్మకాలూ వదలి, సంస్కారం పొంది పెట్టుబడిదారి నాగరికతవైపు పోదామని సూచించుతుంది. "మాలపల్లి" సమాజంలో అట్టడుగున వున్న ప్రజా జీవితాన్ని చిత్రించుతుంది. ఆ ప్రజలను ఉద్ధరించి, సరియైన వెలుగును చూపలేకపోయినా అందుకు కృషిచేసింది. ఈ మూడు నవలల మధ్య యింత తేడావుంది. "వేయి పడగలు"కు వోటిచ్చిన వారి భావాలు ఎలావుంటాయో వేరుగా వ్రాయనక్కరలేదు.

గ్రంథకర్తగారు యీ విశాల గ్రంథంలో 115 ఏండ్ల చరిత్రను తెలిపారు. గ్రంథం శాస్త్రీయ దృక్పథంతో నవ్యసాహిత్యాన్ని సమీక్ష చేయలేకపోయినా చాల విషయాలను సేకరించి పాఠకుల ముందు వుంచారు. శక్తివున్న పాఠకులు గ్రంథకర్తగారి భావాలను వదలివేసి. విజ్ఞానం పొందడానికి బహుళసామగ్రి ఒకచోట చేర్చి కూర్చబడింది ఈ గ్రంథంలో.

—[1944 మార్చిలో ప్రకటించబడిన 'అభ్యుదయ రచనల సంపుటి' నుండి]

# 8. వీరేశలింగం

"వీరేశలింగం పంతులుగారు దేశమునకు చేసిన మహాసేవ రెండు విధములైనవి. ఒకటి భాషా విషయకము, రెండవది క్రియా రూపమును దాల్చినదీను. ఈ రెండు ఒకదానితో ఒకటి పైన గలసి సహకారము సల్పుచు ఆ మహామహుని కీర్తి చంద్రికలను దేశమంతటను వ్యాపింపజేయుచు, ఆంధ్ర దేశాభ్యుదయమునకు, సారస్వతాభి వృద్ధికిని, దోడ్పడినవి, వీరేశలింగంగారు నవీనాంధ్ర దేశమునకును, ఆంధ్ర వాఙ్మయమునకును యుగ పురుషుడు, పండిత పామరులకు హృదయ రంజకమగు సులభవచన శైలి నీయన నిర్మించి ఏ తన్మూలమున విద్యా సౌరభము, సంఘ సంస్కరణాభి రతిని ఆంధ్రావనిని వెదజల్లిరి."

(శ్రీరాయసం వెంకట శివుడుగారు - 1935 నవంబరు 'ఆంధ్రపత్రిక' నుంచి)

## బాల్యం - విద్యార్థి దశ

కందు. ౧ వీరేశలింగం పంతులుగారు 1848వ సంవత్సరం ఏప్రిల్ 16వ తేదీన రాజమండ్రిలో జనన మొందారు. నాలుగేండ్ల వయసులోనే తండ్రి చనిపోవుటచేత తల్లియు, పెద్ద తండ్రియు అతి గారాబముతో పెంచారు. ఉబ్బసం వ్యాధి వుండుటచేత దుర్బలంగా వుండేవారు.

పాఠశాలలో చదువుకొను కాలములోనే బాలుడైన వీరేశలింగంలో మేధాశక్తి, ప్రతిభ ద్యోతక మవసాగినవి. ఏ పాఠమైన ఒకసారి చదివినంతనే అప్పజెప్ప గలిగేవాడు. ఈయన తెలివితేటలు ఉపాధ్యాయులను, విద్యార్థులను కూడా ఆకర్షించాయి. 4వ తరగతి

చదువుతుండగా జిల్లా జడ్జి ఒకసారి పాఠశాలను చూడ్డానికి వచ్చారు. బడిలోని బాలు రందరకు చీటీల నిచ్చి అందరిలోకి 'సత్ప్రవర్తన' గల విద్యార్థి పేరు వ్రాయమని కోరాడు. వీరేశలింగం క్రింది క్లాసులోని వాడైనప్పటికి ఎక్కువమంది బాలుర అతని పేరు వ్రాశారు. జడ్జి ఆయనకు రూ. 10 విలువగల పుస్తకాలు బహుమతిగా యిచ్చాడు. ఈ సంఘటన వల్ల వీరేశలింగాన్ని తోటి విద్యార్థులు, ఉపాధ్యాయులు ఎలా మెచ్చుకొనేవారో తెలుస్తుంది.

విద్యార్థి దశలోనే వీరేశలింగం విద్యార్థులకు నాయకత్వం వహించి న్యాయమైన హక్కులకొరకు పోరాటం నడిపి జయించాడు. ప్రవేశ పరీక్షకు చదువుతున్న కాలంలో ప్రధానోపాధ్యాయుడుగా వైయాపురి మొదలియార్ వుండేవాడు. ఆయనకు ఇంగ్లీషు పద్యకావ్యమును బోధించగల శక్తిలేదు. అత డందుకు అర్హుడు కాడని వీరేశలింగంగారికి తోచింది. విద్యార్థుల లాభం నిమిత్తం యింకో సమర్థుని నియమించాలని ఆందోళన చేయసాగాడు. విద్యా శాఖాధికారులకు యీ విషయమై ఒక పిటీషన్ వ్రాసి తరగతిలోని బాలు రందరిచేత సంతకం చేయించాడు. తక్కిన తరగతులలోని బాలుర సంతకాల కొరకు ఒక మిత్రుని కిచ్చి పంపించాడు. ఆ సంగతి ప్రధానోపాధ్యాయుడికి తెలిసింది. ఆయన ఏజంటగు ఒక విద్యార్థి సంతకాలు చేయించుతానని మోసగించి ఆ పిటీషను ఎత్తుకొని పోయి హెడ్మాష్టరు కిచ్చాడు.

## విద్యార్థుల సమ్మె

వీరేశలింగం యింతటితో నిరుత్సాహ పడక, చిత్తప్రతి ననుసరించి మరల పిటీషను వ్రాసి పంపు ప్రయత్నంలో వున్నాడు. మర్నాడు హెడ్మాష్టరు క్లాసులోకి వెళ్ళి వీరేశలింగం మిత్రుని పిటీషను పెట్టినందుకు గొడ్డును బాదినట్లు బాదాడు. వీరేశలింగమున్న తరగతికి వచ్చాడు, తెలివితేటలుగల వాడగుటచే అదివరకు హెడ్మాష్టరు వీరేశలింగం యెడల ప్రేమాభిమానాలు చూపేవాడు. కాని ఇపుడు అతడే పిటీషనుకు కారకుడని తెలిసి మండిపడ్డాడు. "బుద్ధిహీనుడా! Fool"

అని తిటాడు. వీరేశలింగం వెంటనే క్లాసును వదలి బయటికి వచ్చే శాడు. అతనితోపాటు విద్యార్థు లందరూ బయటికివచ్చారు. దానితో సమ్మె ప్రారంభమయింది. ఆ హెడ్మాష్టరుని తీసివేస్తేగాని బడికిపోమని విద్యార్థులు పట్టుపట్టారు.

పిటీషనుపై బడిపిల్లలందరిచేత మరల సంతకాలు చేయించి దాన్ని వీరేశలింగం మద్రాసులోని విద్యా శాఖాధికారికి, ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్‌కు పంపించాడు. అంతేగాక టెలిగ్రాంలు కూడ పంపిం చాడు. ప్రధానోపాధ్యాయుడు స్కూలుకు రాని విద్యార్థుల పేర్లు కొట్టి వేస్తానని మొదట బెదిరించాడు. కాని తరువాత భయపడి. క్షమించి వదలుతానని, బహుమానా లిస్తాననీ, స్కూలుకు రమ్మని కబుర్లు చెప్ప సాగాడు. పిల్లల తల్లిదండ్రులకు కబుర్లు చేసి చూశాడు. కాని ఎంత చేసినా, భయస్థులు ఏ కొద్ది మందో తప్ప విద్యార్థులు జంకలేదు.

విద్యాశాఖనుండి గ్రిగ్గుదొర వచ్చి విచారణ చేశాడు. మొద ల్యారును ట్రాన్స్‌ఫర్‌చేసి కుప్పుస్వామి శాస్త్రిలు అనే వారిని రాజ మండ్రి పాఠశాలకు ప్రధానోపాధ్యాయునిగా నియమించారు. ఈ విధంగా వీరేశలింగంగారు నడిపిన విద్యార్థి పోరాటం జయించింది.

వీరేశలింగంగారు చురుకైన తెలివితేటలు గల వాడగుటచే క్లాసులో ప్రథమముగా వుండేవాడు. అనేక బహుమానాలు పొందుచుండే వాడు. 1870 డిసెంబరులో ప్రవేశ పరీక్ష, అనగా మెట్రిక్యులేషన్ పాసయ్యాడు. అపుడు రాజమండ్రిలో ఉన్నత విద్యకు అవకాశంలేదు.

## ఉపాధ్యాయ దశ

1871 లో పంతులుగారు రాజమండ్రి ప్రభుత్వ పాఠశాలలో రు. 25/ల భృతిపై తాత్కాలికంగా సహాయోపాధ్యాయుడుగా చేరారు. ఒక ఏడాది అచట పనిచేసి, అది ముగియుటచేత ధవళేశ్వరం పాఠశా లలో చేరి పనిచేశారు. ఈ కాలంలోనేవీరు మూఢాచారాల నెదిరించుతూ పత్రికలకు వ్యాసములు వ్రాస్తూ వుండేవారు అపుడే స్త్రీ విద్యయొక్క

ఆవశ్యకతను గూర్చి వ్యాసములు వ్రాయుచేగాక కొందరు మిత్రులతో కలసి చందాలు వేసుకొని 1874 లో ధవళేశ్వరంలో ఒక బాలికా పాఠ శాలను స్థాపించారు.

1876 లో రాజమండ్రిలో "వివేకవర్ధని" అను పక్షపత్రికను స్థాపించారు. దానికి అనుబంధంగా "హాస్య సంజీవిని" అను మాస పత్రికను గూడ నడుపసాగారు. వీటి నిర్వహణకు రాజమండ్రిలో వుండుట అవుసరమయి, ధవళేశ్వరంలో ఉపాధ్యాయ పదవిని వదలి వేశారు. రాజమండ్రిలోని ప్రభుత్వ శాస్త్ర పాఠశాలలో రెండవ తెలుగు పండితులుగా నెలకు రు. 25/- జీతంపై ఉపాధ్యాయ పదవిని స్వీక రించారు.

పంతులుగారు ఉపాధ్యాయులుగా పనిచేసినంతకాలము విద్యార్థు లను ఆకర్షించారు. ఆయన పొట్టకూటి కొరకు మాత్రమే బడిపంతులు గాక, విజ్ఞానం వెదజల్లుట ఆదర్శంగా పెట్టుకొన్న ఉపాధ్యాయుడు. ఆయన కృషి అపుడు చదువుకొనే విద్యార్థులను ఎంతో ఉత్తేజితులను చేసేది. విద్యార్థులు విజ్ఞానం సంపాదించుటకు కృషిచేసేవారు. పంతులుగారు నడుపుతున్న "వివేకవర్ధని", "హాస్యసంజీవిని" పత్రిక లను ఆతురతతో చదివేవారు. పంతులుగారు నాయకత్వం వహించి నడుపుతున్న సంఘసంస్కారోద్యమానికి విద్యార్థి బృందమంతా అండగా నిలచేది. పంతులుగారు సేనాని; విద్యార్థులు సైన్యం!

బాల్య వివాహాలు, వృద్ధులకు కన్యలను అమ్మడం వగైరా మూఢా చారాలను ఖండించినపుడు, విధవావివాహాలు శాస్త్రసమ్మతమని నిరూ పించినపుడు పూర్వాచారపరాయణులగు ఛాందసులు కోపోద్దీపితులయే వారు. విద్యార్థి సైన్యం అట్టి మూర్ఖులకు బుద్ధిచెప్పి, పంతులుగారి కెప్పుడూ అంగరక్షకులై కాపాడేవారు. ఆ రోజులలో ఛాందసులు, శంకరాచార్యులు వగైరా పీఠాధిపతులు విధించిన ఆంక్షలను లెక్క చేయకుండా పంతులుగారు వితంతు బాలికల పునర్వివాహం తానే స్వయంగా చేయించడం విప్లవ కార్యమని చెప్పవచ్చు. అట్టి వివాహాలు జరిపి దంపతులను విద్యార్థుల సహాయంతో ఊరేగించేవారు. ఉపాధ్యా

యుల - విద్యార్థుల మధ్య సన్నిహిత సంబంధమంటే యిలాంటిదిగదా పంతులుగారు విద్యార్థులకు బడిపంతులేగాక, నాయకుడు, ఆదర్శప్రాయుడు. పంతులుగారు తమ చివర దశలో రాజమండ్రిలో ఒక హైస్కూలు నిర్మాణానికి కృషిచేసి కట్టించి, తన పేరును ఉపాధ్యాయుడుగా చిరస్మరణీయం చేసికొన్నారు. ఇదే యిపుడు వీరేశలింగం హైస్కూలని పిలవబడుతూంది.

## సంఘ సంస్కర్త

ఆ రోజులలో ఉద్యోగస్తులలోను, పెద్దమనుష్యులమని చెప్పుకునే వారిలోను వేశ్యాలోలత్వం విపరీతంగా వుండేది. వేశ్యలను వుంచుకోవడం గౌరవముగా ఎంచబడేది. ఊరేగింపులలో భోగం మేళం లేనిదే మజా లేదనేవారు. పంతులుగారు యీ దురాచారాన్ని తమ పత్రికలలోను, తమ ఉపన్యాసాలలోను తీవ్రంగా ఖండించేవారు. త్రాగుడు వగైరా దురభ్యాసాలను నిరసించుతూ వ్యాసాలు, ప్రహసనాలు రచించారు.

పై ఉద్యోగులు భోగం మేళాలతో మేజువాణీలు జరిపి క్రింది తాబేదారులను తమతో పనివున్న వారందరిని ఆహ్వానించేవారు. వీరంతా హాజరయి తాంబూలా లిచ్చినప్పుడు కట్నాలు, ముడుపులు చెల్లించుకోవాలి. ఇది దురాచారమే గాక, తాబేదారులకు యీ కట్నా లిచ్చుకోలేక ప్రాణసంకట మయ్యేది. పంతులుగారు యిట్టి సభల గుట్టును బట్టబయలు చేసి ప్రజలంతా అసహ్యించుకొనునట్లు చేశారు. ఈ సందర్భాలలో పంతులుగారిపై అధికారులు కేసులు తెచ్చి కోర్టుల కీడ్చారు. కాని వాటన్నిటిలోను పంతులుగారు ఎదుటి వారి దోషాలను ఋజువుచేసి, తమ ఆరోపణలు సత్యమైనవని నిరూపించేవారు. వీటి ఫలితంగా కొందరు లంచగొండులు తమ ఉద్యోగాలను కోల్పోయారు కూడా.

లంచాలు పుచ్చుకొనే ఉద్యోగులను పత్రికలలో దుయ్యబట్టేవారు. లంచగొండి తనాన్ని బట్టబయలు చేస్తూ "జమాబంది", "మునిసిపల్ నాటకం" వగైరా ప్రహసనాలను ప్రకటించారు.

ఆ దినాలలో దెయ్యాలు, భూతాలు వుంటాయనే పిచ్చి నమ్మకాలు ఎక్కువగా వుండేవి. పంతులుగారు యీ మూఢనమ్మకాలను నిర్మూలించడానికి కృషిచేశారు. పంతులుగారి దొడ్లో అరటిచెట్టు ఒకసారి తప్పుడు గెలవేసింది. అనగా యీశాన్య దిక్కుకు వేయలేదు. ఆచారం ప్రకారం ఆ చెట్టును కొట్టివేయాలని బంధువులంతా సలహాయిచ్చారు. కాని పంతులుగారు అది మూఢ విశ్వాసం మాత్రమేనని, ఆ సలహాను త్రోసిపుచ్చారు. ఇంట్లో దూలానికి తేనెతుట్టె పట్టింది. ఇంటిని వదలి వేయనైనా వేయాలి, లేదా బ్రాహ్మణులను పిలిపించి శాంతినైనా చేయించాలని ఛాందసులు పట్టుపట్టారు. పంతులుగారు దీనినేమీ లెక్క చేయలేదు. ఈలాంటి ఆచారాలను అవలంబించక పోవుటవల్ల ఏమీ ప్రమాదాలు జరుగవని ప్రజలు క్రమంగా తెలుసుకోసాగారు. ఆచరణలో మూఢ విశ్వాసాలను యిలా ఎదిరించుట ద్వారా పంతులుగారు ప్రజల విజ్ఞానాభి వృద్ధికి తోడ్పడ్డారు.

జ్యోతిశ్శాస్త్రంమీద, శకునాలపైన మూఢ నమ్మకాలుంచడం, అంటువ్యాధులు వ్యాపించినపుడు ఆరోగ్య సూత్రాలను పాటించడానికి బదులు దేవతల కొలుపులకు జంతు బలిచేయడం, వగైరా మూఢాచారాలనుకూడ పంతులుగారు ఖండించారు. పత్రికలలో వ్యాసాలద్వారాను, ప్రహసనాల ద్వారాను వీటిలోని కుళ్ళును బట్ట బయలుచేసి, పంతులుగారు ప్రజలలో జ్ఞానోదయం కలిగించడానికి కృషిచేశారు.

## మహిళోద్ధారకుడు

పంతులుగారు బాలికా విద్యయొక్క అవుసరాన్ని పత్రికలలో వ్యాసాలద్వారా, ఉపన్యాసల ద్వారా ప్రచారం చేశారు. మహిళలలో చైతన్యం కలిగించడానికి, జ్ఞానోదయం కలిగించడానికి అనేక కథలు, పద్యాలు, గ్రంథాలు వ్రాసి ప్రకటించారు. 1883 లో "సతీహితబోధిని" అను మాసపత్రికను కూడ స్థాపించారు. "సత్యవతి చరిత్రము" "చంద్రమతీ చరిత్రము' అను గ్రంథములు వ్రాశారు. ఇవి సులభశైలిలో

వున్నాయి. నేటికి కూడ సోదరీమణులు చదివి నేర్చుకోవలసిన విషయా లెన్నో వీటిలో వున్నాయి.

వీరేశలింగంగారు తెలుగు తల్లికి కొనర్చిన సేవ, స్త్రీ విద్యా ప్రచారం, వారి కుపయోగించే సాహిత్యం ప్రకటించుటతోనే ఆగలేదు. వితంతు బాలికలకు పునర్వివాహాలు చేయాలని పంతులుగారు ప్రచారం చేశారు, పండిత సభలలో వితంతు వివాహాలు శాస్త్ర సమ్మతమని రుజువు చేశారు. తానే 35 వితంతు వివాహాలను స్వయంగా జరిపించారు. చేసికొన్న వధూవరులకు ఎవరూ యిండ్లు అద్దెకివ్వక బహిష్కరించితే వారికి యిండ్లు కట్టించి యిచ్చారు. శాశ్వతంగా వుండే "వితంతు శరణా లయం" అనే సంస్థను నిర్మించి, దానికి స్థలం, బిల్డింగులు, ధనం సమ కూర్చారు.

మోసగాండ్లచే భ్రష్టురాండ్రుగా చేయబడిన పతితలైన స్త్రీలను, వారి సంతానాన్ని రక్షించడానికి "పతిత యువతీ రక్షణా"లయాన్ని నిర్మించారు. తమ దానధర్మాలతో దీని పోషణకు కూడా ఏర్పాట్లు చేశారు. మహిళలను మూఢాచారాల నుండి రక్షించడానికి, స్త్రీ కూడా పురుషునితో బాటు సమాన భాగస్వామిని అనే భావం కలగజేయడానికి, స్త్రీ- పురుషు లిద్దరు విజ్ఞానవంతులై నప్పుడు సంసారం సుఖప్రదమవు తుందనే భావం కలగజేయడానికి పంతులుగారు కృషి చేశారు. ఒకసారి పర్యాలోకనం చేసి చూస్తే, ఆంధ్ర దేశంలో మహిళోద్ధరణ కొరకు పంతులుగారివలె దీక్షతో పనిచేసిన వ్యక్తి మరొకరు యింతవరకు లేరనియే చెప్పవలసి వుంటుంది.

## ఆంధ్ర సారస్వతానికి యుగపురుషుడు

మొదట బౌద్ధ ప్రచారంలోను (6 వ శతాబ్దం వరకు) తదుపరి శైవుల ప్రచారంలోను, ప్రజలలో తమ తమ ధర్మాలను వ్యాపింప జేయడానికి ఆంధ్రదేశంలో ప్రజలకు అందుబాటులో వుండు లాగున మాతృ భాషలో రచనలు ప్రారంభమైనాయి. క్రమంగా హిందూ

ధర్మాన్ని గూడ ప్రజల్లో పాతుకొనునట్లు చేయడానికి అది వరకు సంస్కృతంలో తప్ప కావ్యాలు రచింపకూడదనే వారు సయితం తమ అభిప్రాయాలను మార్చుకొన్నారు. సంస్కృతంలో వున్న పురాణాలను, కావ్యలను ప్రజలలో వెదజల్ల వలెనని తిక్కన, సోమయాజి వగైరా మహాకవులు సులభ శైలిలో తెనిగింపసాగిరి. ఈ భాషాంతరీకరణం 15 వ శతాబ్దం వరకు సాగింది. తర్వాత పురాణములలోని కథలు తీసుకొని ప్రబంధాలు రచించారు. కాని క్రమంగా ప్రబంధ రచన సంస్కృత సమాసాలతో నిండి వుండి, తమ జీవితంతో సంబంధం లేకుండా ప్రజల కందుబాటులో లేకుండెను. పంతులుగారి కాలం నాటికి ఆంధ్ర సాహిత్య మెలా వుందో తెలుసుకోడానికి పంతులుగారు వ్రాసిన "సరస్వతీ నారద విలాప" మనే పుస్తకంలోని పద్యాలను ఉదాహరించుతాను.

క॥ తెలియదు సుమ్మిప్పుడు నా
పలుకుల యర్థంబు నాకె భావములేమిన్
వెల సొమ్ములుగా కివి సం
కెల లయి కడు నాదు మేనికి న్వ్యోతనించున్.

సీ॥ దయమాలి తురముట్ట దలకట్లు సిగిపించి
దీపదై నన్ను బాధించు నొకడు:
పాదంబు లోపల బాదంబు లిమిడించి
పీడదై నన్ను నొప్పించు నొకడు;
ప్రాసంబుపై బెక్కు ప్రాసంబు లడరించి
పోటు బంటయి నన్ను బొడుచు నొకడు;
బెందు పల్కులు గూర్చి నిండించి నగలందు
దిట్టయై చెవులు వేధించు నొకడు;
ఖడ్గ చక్రాదిరూపము లానిపించి
వర్ణముల్ మార్చి నను జిక్కుపరచు నొకడు;
కుమతులొడలెల్ల విరిచి ప్రాణములు తీయ
వాడలి పసలేక కుష్కించి యున్నదాన ;

అని "సరస్వతి"చే పంతులుగారు పలికించారు. ఈ పద్యాలలో ఆనాటి ఆంధ్ర సాహిత్యం యొక్క స్థితి తేటతెల్లం చేయబడింది.

ఈ విధంగా జమీందారీ యుగపు సంకెళ్ళ నుండి విడివడలేక ప్రజాసామాన్యానికి అందుబాటులోలేక ఆంధ్ర సాహిత్యపు పూదోట పెంపుదలలేక గిడసబారియున్న సమయంలో పంతులుగారు రచన ప్రారంభించారు. పెట్టుబడిదారీ ప్రపంచంతో గత రెండు శతాబ్దాలలో భారతదేశానికి సంబంధాలు ఏర్పడ్డాయి. దానితోబాటు పాశ్చాత్య భాషలు అనేక నూతన సాహిత్య రూపాలను పుష్పించాయని మన రచయితలు కూడ గ్రహించసాగారు. వాటి వాసనలు తెలుగు సాహిత్యం వైపు కూడ ప్రసరించసాగాయి. ఈ నూతన సాహిత్య పోకడలతో తెలుగు భాషామ తల్లిని అలంకరించడంలో వీరేశలింగంగారు అగ్రగణ్యులయ్యారు.

పంతులుగారే తమ స్వీయ చరిత్రలో యిలా చెప్పుకొన్నారు. "తెలుగులో వచన ప్రబంధమును నేనే చేసితిని; మొదటి నాటకమును నేనే తెనిగించితిని; మొదటి ప్రకృతి శాస్త్రమును నేనే రచయించితిని: మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని; మొదటి చరిత్రమును నేనే విరచించితిని; స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని."

## 100 గ్రంథాలకుపైగా వ్రాశారు

మొత్తం మీద వీరేశలింగంగారు నూరు గ్రంథాలకు పైగా వ్రాశారు. తెలుగు సాహిత్యానికి ఏవి అవసరమనితోస్తే, వెంటనే వాటి రచనకు పూనుకొన్నారు. ప్రకృతి శాస్త్రముల కొరతను గమనించి శరీర శాస్త్రము, ఖగోళశాస్త్రము (Astronomy) వ్రాశారు ఆంధ్ర కవుల చరిత్ర లేనిలోటును చూచి అప్పటికి దొరికిన పరిశోధనల ఫలితాల నను సరించి, "ఆంధ్ర కవుల చరిత్ర"ను మూడు భాగాలుగా వ్రాశారు. తర్వాత పరిశోధనల ననుసరించి యీ పుస్తకాన్ని సవరించుతూ వున్న సమయంలో మరణించారు.

సమాజ జీవితంలో పాల్గొంటూనే ఉపాధ్యాయ వృత్తి నడిపారు. రాజమండ్రి కళాశాలలోను, మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలోను ఉపాధ్యాయ

వృత్తిలో వుంటూ, వితంతు వివాహోద్యమాల వంటి వాటికి నాయకత్వం వహించి నడుపుతూ యింత భాషాసేవ ఎలా చేయగలిగారా! అని ఆశ్చర్యం వేస్తుంది. కాని సమాజ జీవనంలో పాల్గొనుట, ఉద్యమాలలో లీనమై పోవుట పంతులు గారికి అంత రచనా శక్తినిచ్చాయి; వారి రచనలకు జీవన మిచ్చాయి. నాటి సమాజ జీవనంలోవారి రచనలు ఒక భాగమై పోయాయి.

ఇంతేగాక, పంతులుగారు అనేక అముద్రిత గ్రంథాలను పరిష్కరించి ముద్రించారు. షేక్స్పియర్ నాటకాలను తెలుగున ద్విపదలో అనువదించారు. ప్రబంధ యుగానికి పూర్వం నుండి కూడా ఆంధ్ర దేశంలో అనేక జానపదాలు, పాటలు, పదాలు, ప్రజాసామాన్యం పాడుతుండేవారు. ద్విపదలో "రంగనాథ రామాయణం", గౌరన "హరిశ్చంద్రోపాఖ్యానము" వంటి ఉత్తమ కావ్యాలు కూడ రచించబడ్డాయి. తర్వాత యీ తరహా ప్రజా రచనలను పండితులు, పాలకులు ఆదరించక వెనుకబడ్డాయి. పంతులుగారు పై విధంగా ద్విపదలో నాటకాలను అనువదించి, ప్రజా సాహిత్య రూపాల యెడల తమ ఆదరం చూపారు.

పంతులుగారి శైలిసులభంగా వుండి, ప్రజలచేత మెచ్చుకోబడేది. అందుచే పూర్వాచారపరులగు పండితులు, కవులు, వారి రచనలలో పాండిత్య ప్రకర్షలేదని ఆక్షేపించేవారు. వారికి సమాధానం గానో మన పంతులుగారు "శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన, నైషధం" రచించారు. వీరి పద్యాల సరళత్వం, మృదుత్వం తెలిసికోడానికి కాళిదాసు రచించిన "శాకుంతల" అనువాదాన్ని చదివితే బోధపడుతుంది. ఇదే నాటకాన్ని అనేకమంది యితర కవులు పండితులు అనువదించారు. కాని అవన్నీ పంతులుగారి అనువాదానికి ఏ మాత్రం పోలికకురావు. అవి ప్రదర్శించబడక పోవుటే అందుకు సాక్ష్యం. మచ్చుకు కొన్ని పద్యాలు :

ఉ॥ వాసన చూడనట్టి ప్రసవంబు, నఖంబుల ద్రుంపనటి నూ
త్నా సమపల్లవంబు, పరులానని క్రొవ్విరితేనె, సూచి వి
న్యాసములేని రత్నము, మహాతప పుణ్యఫలంబుబోలు నా
భాసుర గాత్రి సోయగమెవండు భుజింప విరించి వ్రాసెనో!

గీ. చరణమున గ్రుచ్చుకొనె గుశాంకుర మటంచు
గొన్నియడుగులె నడచి యా కొమ్మ నిలిచె;
తరువు శాఖల వస్త్రంబు తగులకున్న
దీసికొనుదానివలె వెన్కదిరిగిచూచె.

ఉ॥ కొందల మందెడెందము శకుంతల తా నిపుడేగునంచయో!
క్రందుగ బాష్పరోధమున గంఠమునుంజెడె; దృష్టిమాంద్యముం
బొందె; నొకింత పెంచిన తపోధనులే యిటుకుంద, నెంతగా
గుందుదురో తమంతగను కూతులబాయు గృహస్థు లక్కటా!

## పంతులుగారు నిర్మించిన సంస్థలు

పంతులుగారు హైస్కూలు, వితంతు శరణాలయమేగాక, టౌను హాలును కట్టించి రాజమండ్రి పౌరులకిచ్చారు. "హితకారిణీ సమాజాన్ని" రిజిష్టరు చేయించి, ధర్మకర్తలను నియమించి పై సంస్థలన్నిటిని వారి అధీనం చేశారు. తమ గ్రంథాల కాపీరైటును యీ సమాజాని కిచ్చారు. తమ యావదాస్తిని యిలాగే ధర్మకర్తలకు అప్పగించారు. తాము నిర్మించిన ఉద్యమాలకు తాము గడించినదంతా యిచ్చివేసి, పంతులుగారు ఒక ఉన్నతమైన ఆదర్శాన్ని ప్రజలముందు వుంచారు.

ఆ యా సంస్థలు పంతులుగారి అనంతరం చురుగ్గా పనిచేయక పోవడానికి కారణం, అది పంతులుగారి లోపం కాదు. ఆ యా సంస్థలలో పనిచేసేవారు ఉత్సాహంతోను, పట్టుదలతోను పంతులుగారి ఆశయాలను అమలు చేయలేకపోవడమే: ఆంధ్ర పెద్దలు అవి చురుకుగా పనిచేసేలా ఉత్తేజపరచక పోవడమే! ముందైనా ప్రజలు తగినంత శ్రద్ధ వహించవలసివుంది. వీరేశలింగం పంతులుగారు ఆంధ్ర సాహిత్యానికి, ప్రజల విజ్ఞానాభివృద్ధికి, మహిళోద్ధరణకు చేసిన సేవను పైన క్లుప్తంగా వివరించాను. ఆయన ఆంధ్ర విజ్ఞానానికి చేసిన సేవ అపారం. ఒక్క మాటలో చెప్పాలంటే, పంతులుగారు ఆంధ్ర సంస్కృతిలో ఒక నూతన శకం ప్రారంభించారు. జమీందారీయుగపు సాంప్రదాయం అనే సంకెళ్ళలో కునారిల్లుతున్న ఆంధ్ర సంస్కృతికి

వీరు పునర్జీవనం పోశారు. శ్రీరాయసం వెంకట శివుడుగారు సెలవిచ్చి నట్లు "వీరేశలింగంగారు నవీనాంధ్ర దేశమునకును, ఆంధ్రవాఙ్మయము నకును యుగపురుషుడు."

కొందరు పంతులుగారి సేవను పరిసితుల కనుగుణ్యంగా పరిశీలించక, వారు కేవలం "సంస్కారవాది లేక మితవాది" మాత్రమేనని అనడం వింటూ వుంటాం. మరికొందరు పంతులుగారు తమ అవసాన దశలో వచ్చిన రాజకీయోద్యమాలను బలపరచలేదు. కాబట్టి అభివృద్ధి నిరోధకుడని అనడం కూడ కద్దు. ఈ రెండు అంచనాలు కూడ పంతులుగారి కాల పరిస్థితులను అవగాహన చేసికోకపోవుట వలన పొరపాటే ననవలసివుంటుంది.

అప్పటికి మనదేశంలో బ్రిటిష్‌వారి సంపర్కంవల్ల పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ప్రవేశించింది. కాని ప్రజలను యింకా జమీందారీ యుగపు సంకెళ్ళలోనే, మూఢ విశ్వాసాల క్రిందనే సామ్రాజ్యవాదులు వుంచారు. ప్రజలలో కుల కక్షలు, మూఢ విశ్వాసాలు అంతరించలేదు. ప్రజాస్వామిక విజ్ఞానం ప్రవేశించలేదు. జమీందారీ యుగపు సాహిత్యం ప్రజా సామాన్యానికి అందుబాటులో లేదు. ఈ పరిసితులలో వీరేశలింగం గారు రంగంలో ప్రవేశించారు. మూఢ విశ్వాసాలను, ఆచారాలను, కట్టుబాట్లను ఎదిరించి పోరాడారు. సాహిత్యాన్ని, విజ్ఞానాన్ని ప్రజలకు అందుబాటులోకి తేడానికి కృషిచేశారు. ఒక నూతన సంస్కృతిని ఆంధ్ర జీవితంలో ప్రవేశపెటారు. తద్వారా ఆంధ్ర జాతీయ వికాసానికి పునాదులు వేశారు. ఇదే పంతులుగారు ఆంధ్రజాతికి యొనర్చిన విప్లవకరమైన సేవ.

## సహాయ నిరాకరణోద్యమం

పంతులుగారు అవసాన కాలంలో సహాయ నిరాకరణోద్యమ రాజకీయాలను ఎదిరించారు. ఇందుకు కొందరు విమర్శకులు తీవ్రంగా ఆక్షేపించుతూ, దానికి కారణం గ్రహించుటలేదు. పంతులుగారు ఏ సాంఘిక పరిస్థితులను ఎదిరించి పోరాడటానికి మహోద్యమాలను నడిపారో, ఆ ఉద్యమాల పరిమితిని దాటి చూడలేకపోయారు వృద్ధా

ష్యంలో వారినుండి ఆ మార్పు ఆశించటం కూడ అత్యాశ అనిపించు కుంటుందేమో ననుకుంటాను.

అంతేగాక నాటి జాతీయ వాదులలో ఒక విధమయిన సంకుచిత భావాలు కూడ వ్యాపించి వుండేవి. ప్రాచీన భారతదేశంలో వున్న జమీం దారీ సాంప్రదాయాలు, మూఢ విశ్వాసాలు ప్రతిదీ మంచిదేననే భ్రమ 1905 నాటి తీవ్ర జాతీయవాదులలో వ్యాపించి వుండేది. అదే భ్రమ కొంతవరకు 1919 నాటి సహాయ నిరాకరణ వాదులలో కూడ వుండేది. వర్ణాశ్రమ ధర్మాలు, కులభేదాలు పూర్వం మాదిరిగా పునరుద్ధరించాలని, బ్రిటిష్ వారిని వెళ్ళగొట్టి నిర్మించే స్వరాజ్యంలో అలాగే వుంటుండనీ వాదనలు కూడ వుండేవి. ఈ సంకుచిత భావాలకు పంతులుగారు వ్యతి రేకులు. ఏమంటే ఐక్యమైన నూతన జాతిని నిర్మించాలనే పంతులుగారు ఈ కుల, మత విభేదాలను పునరుద్ధరించాలనే భావాలను వ్యతిరేకించ డంలో ఆశ్చర్యంలేదు. కాని జాతీయోద్యమం యొక్క ప్రధాన ఆశయం భారత దాసిసత్వాన్ని తొలగించడమనీ, బ్రిటిష్ ప్రభుత్వం ఐక్యజాతి నిర్మాణానికి అడ్డుగా వుందనే సంగతి ఆయన గ్రహించలేదు. అదే విధంగా నాటి జాతీయ వాదులలో కొందరు జాతీయత పేరిట జమీందారీ సాంప్రదాయాలను పునరుద్ధరించాలనే సంకుచిత భావాలను గలిగియున్నా రనే సంగతిని ఆయనను విమర్శించేవారు గ్రహించుటలేదు.

పంతులుగారు వివిధ రంగాలలో తన కృషి ద్వారా ఆంధ్ర ప్రజా నీకంలో జాతీయ చైతన్యం, జాగృతి కలిగించారు. ఆమెట్టునుంచి కాంగ్రెసు ఆంధ్ర ప్రజలను రాజకీయంగా మరొక మెట్టు ముందుకు తీసుకు పోయింది. దేశభక్తిని, స్వాతంత్ర్యేచ్ఛను పునరుజ్జీవింప జేసింది. "నవ్య సాహిత్య పరిషత్తు", "అభ్యుదయ రచయితల సంఘం", "యువజన" "విద్యార్థి" సంఘాలు, "మహిళా ఉద్యమం" యివి పంతులుగారు, కాంగ్రెసూ నిర్మించిన సత్సాంప్రదాయాలను నేడు ముందుకు తీసుకు పోతున్నాయి. అందుచే కీ॥ శే॥ వల్లూరి సూర్యనారా యణగారు సెలవిచ్చినట్లు "వీరేశలింగంగారు మొదలు పెట్టినది ఒక సాంఘిక విప్లవము."

## పంతులుగారు అమరజీవి

అట్టి మన పంతులుగారు 1919 మే 27 వ తేదీ నాడు కీర్తిశేషులయ్యారు. ఈ 27 వ తేదీ నాటికి 25 సంవత్సరాలు గతించాయి. కాని పంతులుగారు తమ రచనల ద్వారా యింకా జీవించే యున్నారు. వికసించుతున్న ఆంధ్ర సాహిత్యంలో ఆయన ఛాయలు నేడు ప్రతిబింబించుతున్నాయి. దిన దినాభివృద్ధి గాంచుతున్న మహిళా ఉద్యమంలో ఆయన కృషి పునరుజ్జీవమై ఆంధ్రావని యంతా వ్యాపించుతోంది. ప్రజా సామాన్యంలో విజ్ఞానం వెదజల్లడానికి ఆయన కృషి వ్యాప్తి చెందుతూ ఆయనను జ్ఞాపకం చేస్తూ వుంది. అందుచే పంతులుగారు ఆంధ్ర సంస్కృతితో పాటు చిరంజీవి!

కాని పంతులుగారి ఆశయాలు యింకా పూర్తిగా ఫలించలేదు. ఆంధ్ర ప్రజానీకమంతా యింకా విజ్ఞాన వంతులు కాలేదు. ఆంధ్ర మహిళలంతా పురుషులతో సమాన హక్కులను యింకా సంపాదించలేదు పంతులుగారిచే నాటబడిన సాహిత్య వనం యింకా తగినంతగా ఫలించలేదు. ఆంధ్ర జాతీయ జీవనంలో పాల్గొంటున్న మన మంతా యీ కర్తవ్యా లన్నిటిని నెరవేర్చుదాం! పంతులుగారి ఆశయాల పరమావధిని చేరుదాం!!

ఆంధ్రరాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘం, విజయవాడ ఆంధ్ర అభ్యుదయానికి యుగ పురుషుడు (వీరేశలింగ వర్ధంతి సంచిక మే 27, 1944)

* * *

# 9. సాహిత్యం - రాయిష్టులు

మానవ సమాజం ఎలా అభివృద్ధిచెంది పెట్టుబడిదారీ విధానం లోకి వచ్చిందో, పెట్టుబడిదారీ సంకెళ్ళను త్రెంచుకొని ముందుకు సోషలిస్టు విధానంలోకి ఎలా సాగిపోవాలో తెలుపుతూ కారల్‌మార్క్స సామాజిక శాస్త్రాన్ని రచించాడు. అందుచే మార్క్సిస్టు విజ్ఞానం సంపాదించిన వారు మానవ నాగరికత ఎలా అభివృద్ధి చెందిందో అవగాహన చేసుకోగలుగుతారు. మానవ నాగరికతయొక్క వివిధ దశలలో సాహిత్యం కళలు ఎలా పరిణామం చెందాయో తెలిసికోడానికి మార్క్సిస్టు దృక్పథం సహాయపడుతుంది. ఇకముందు ఏ పంథా అవలంబించితే అభ్యుదయానికి దారితీస్తుందో సూచించడానికి తోడ్పడుతుంది.

ఆంధ్రప్రజల జాతీయ సంస్కృతి ఎలా పరిణామం చెందిందో, ఆంధ్ర సాహిత్యం - కళలు ఎలా అభివృద్ధి చెందాయో తెలుపుతూ మార్క్సిస్టు (శాస్త్రీయ) దృక్పథంతో వ్రాయబడిన గ్రంథం ఇంతవరకు తెలుగులో వెలువడలేదు. అభ్యుదయ రచయితల సంఘంవారు ప్రకటించిన రెండో సంచికలో శ్రీ కురుగంటి శీతారామయ్యగారిచే వ్రాయబడిన "నవ్యాంధ్ర సాహిత్యవీథులు" అనే గ్రంథాన్ని విమర్శించాను. ఆ గ్రంథ కర్త నవ్యాంధ్ర సాహిత్య చరిత్రను శాస్త్రీయ దృక్పథంతో వ్రాయలేదని నిరూపించాను.

ఈ వ్యాసంలో ఆంధ్రసాహిత్యపు పోకడలను గురించి కొందరు రాయిష్టులు వ్రాసిన సమీక్షలను పరిశీలించుతాను. రాయిష్టులు తాము మార్క్సిస్టు దృక్పథంలో ఆంధ్రసాహిత్యాన్ని సమీక్ష చేస్తున్నట్లు చెప్పుకొంటున్నారు. ముందుగా, సాహిత్యం యెడల ఆంధ్ర రాయిష్టుల భావాలు

ఏలాక్షీమారుతూవచ్చాయో చూపుతాను. అసలు రాయిష్టుల వ్రాతలు మార్క్సిస్టు (శాస్త్రీయ) దృక్పథాన్ని తెలియజేస్తున్నాయో లేదో చర్చించుతాను.

1938 సంవత్సరం జూలై 10 వ తేదీ 'ప్రజామిత్ర'లో ఆంధ్ర రాయిష్టు ప్రముఖులలో ఒకరైన గోపీచంద్‌గారు "భాషాప్రయోజనం ఏమిటి" అనే వ్యాసం వ్రాశారు. భాషలో ప్రొలెటేరియన్ విప్లవం కావాలని ఆయన వాదించారు. అదే భావాలను యింకో రాయిష్టు జి. వి. కృష్ణారావుగారు 1938 సెప్టెంబరు 4 వ తేదీ 'ప్రజామిత్ర' పత్రికలో యిలా విశద పరిచారు :

"ఈ విప్లవతత్వాన్ని గ్రహించిన నవకవులు క్రిందివర్గానికి పనికి వచ్చేటట్లు వ్రాయాలి. పై వర్గంలోని బూర్జువాకవులు 'కళ అధఃపతనం' చెందుతున్నదని విచారపడినా, తెగతిట్టడానికి సిద్ధమయినా శ్రామికవర్గానికి అర్థమయ్యేటట్లు వారి సమస్యలు తీసుకొని వ్రాయాలి.

"కేపిటలిస్టు ప్రభుత్వం తర్వాత రాజకీయంగా ప్రొలిటేరియన్ విప్లవంవచ్చి తీరాలన్నాడు మార్క్స్, అదే కావలసింది కూడ. సాహిత్యంలోకూడ ప్రొలిటేరియన్ విప్లవం వస్తుంది; తీసికొని రావాలి. కవులకిదే కర్తవ్యమంటున్నాడు గోపీచంద్. పూర్వం గ్రాంధికవాదులు భావకవులమీదికి వ్యవహారికవాదుల మీదికి దండెత్తినట్టే ప్రొలిటేరియన్ కవులమీదికి, గ్రామ్యవాదులమీదికీ దండెత్తుతున్నారు."

ఆ కృష్ణారావుగారే 1941 డిసెంబరులో 'ఆంధ్రప్రభ' పత్రికలో సాహిత్యంపై వ్యాసాలు వ్రాశారు. అందులోని భావాలను కొన్ని 'కావ్య జగత్తు' అనే పుస్తకంగా ప్రకటించారుకూడా. వాటిలో కృష్ణారావుగారు ఎలా ప్లేటు మార్చారో చూడండి :

"వర్గ సంబంధాలను మన దేశంలో పరిశీలించిచూస్తే కార్మికుల బలం చాల తక్కువగా వుంది. అసలు ఏ విప్లవం రావాలన్నా రాజకీయ చైతన్యముండాలి. ఇలాంటి చైతన్యం మధ్యతరగతిలోనేవుంది; వుంటానికి అవకాశముంది. పరిశ్రమలు భాగా అభివృద్ధి కాలేదు. ఉన్న కొలది

మంది కార్మికులకు విద్యాగంధం లేదు" అని వ్రాశారు. అదే వ్యాసం మరొకచోట "ముద్రణాయంత్రము మూలబడి ఊరుకొంటుందా ? మనం వ్రాయడానికి పూనుకోకపోతే మరికొందరిచేత వ్రాయించు కొంటుంది. మధ్యతరగతి, పైగా కార్మికులకంటె ఎక్కువగా దబ్బిస్తుంది. దాన్ని ఎవ్వరాపగలుగుతారు ?" అని వ్రాశారు.

ఇంకొకచోట "మనదేశములో మధ్యతరగతికోసం వ్రాయాలి, కార్మికుల జీవితాన్ని చిత్రించవచ్చును. కాని ఆ దృష్టి సోషలిస్టు దృష్టిగా వుంటానికి వీలులేదు. కేవలం ప్రజాస్వామిక విప్లవదృష్టిగా వుండాలి. అపుడే సాహిత్యం ఆదరింపబడుతుంది. మనకు సాహిత్య మవుతుంది" అని ముచ్చటించారు.

'ప్రజామిత్ర'లో వ్యాసాలు వ్రాయునప్పటికి రాయిష్టులు కాంగ్రెస్‌ను విప్లవపార్టీ అని పిలిచేవారు. ప్రతి ప్రాథమిక కాంగ్రెస్ కమిటీనీ 'సోవియట్'గా అభివృద్ధిచేసి అధికారం పట్టుకోవాలనేవారు. ఇంకోపార్టీ వుండకూడదనీ, కిసాన్ సభలు ప్రత్యేకంగా వుండరాదనీ వాదించేవారు. పెట్టుబడిదారీ వర్గము ఏనాడో బ్రిటిష్ సామ్రాజ్య వాదులతో కలిసిపోయిందనీ, స్వాతంత్ర్య పోరాటంలో దానికి స్థానం లేదనీ వాదించేవారు. కాంగ్రెస్‌లోని మితవాద నాయకులను తొలగించి యం. యన్. రాయ్ పెత్తనం వహించితే స్వరాజ్యం పూర్తిపడుతుందని వారి ప్రచారం. అందుకే అతడు రామఘర్ కాంగ్రెస్ అధ్యక్షతకు పోటీ చేశాడు.

కాని ఓడిపోయాడు. అప్పటికే యుద్ధం వచ్చింది. ఫాసిస్టులకు వ్యతిరేకంగా బ్రిటిష్ ప్రభుత్వం పోరాడుతుంది. కాబట్టి దానికి సాయపడటం అవసరమనే వాదనలోకి రాయిష్టులు మారారు. బ్రిటిష్ సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగా ఏ విధమైన పోరాటం సాగించటం కూడ తప్పనే వాదనలోకి దిగారు. తమ పాలసీని అమలు జరపడానికి కాంగ్రెస్ నుండి విడిపోయి 'రాడికల్ డెమాక్రాటిక్ పార్టీ'ని ఏర్పరచారు. కాంగ్రెస్ బ్రిటిష్ ప్రభుత్వాన్ని వ్యతిరేకించుతూంది కాబట్టి కాంగ్రెస్ తత్వమే "దేశీయ ఫాసిజం" అని ప్రారంభించారు. వెనుకటి రోజులలో విప్లవ ప్రజాపార్టీ అని పిలువబడిన కాంగ్రెస్‌ను ఫాసిస్టు

సంస్థ అనీ, జాతీయ ప్రభుత్వం కావాలనడం పెట్టుబడిదారీ నియంతృత్వాన్ని స్థాపించమని కోరడమేననీ వాదించసాగారు. దానికి మారుగా రాయ్, మెహతాల వంటి ప్రజలతో సంబంధం లేని నాయకులతో కూడిన "ప్రజా ప్రభుత్వం" కావాలని వారు నినాదం యిచ్చారు.

రాయిష్టులు రాజకీయ పాలసీలో వచ్చిన యీ మార్పును అర్థం చేసుకుంటే వారి సాహిత్య విమర్శలలో వచ్చిన మార్పు బోధపడుతుంది. మొదటి దశలో వారు కాంగ్రెసులో తమ నాయకత్వం వస్తే చాలు, సోవియట్ ప్రభుత్వం స్థాపించినట్లేనని ప్రచారం చేశారు. అనగా పెట్టుబడిదారీ సూత్రాలకే మార్క్సిస్టు రంగుపూసి ప్రజలను మోసపుచ్చాలని చూశారు. రెండో దశలో కాంగ్రెస్‌ను ఫాసిస్టు సంస్థ అని నిందించుతూ బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు సాయపడుతున్నారు. అందుకు ఫలితంగా జాతీయ ప్రభుత్వం యివ్వొద్దు "ప్రజా ప్రభుత్వం" అనే పేరుతో మాకే పట్టంగట్టండి అని సామ్రాజ్యవాదాన్ని ప్రాధేయపడుతున్నారు.

రాయిష్టులు యుద్ధానికి పూర్వం కోరిన సోవియట్ల సంస్థాపనలోనూ ప్రజలతో సంబంధం లేదు ఇపుడు కోరుతున్న "ప్రజా ప్రభుత్వానికీ" ప్రజలతో సంబంధం లేదు. రెండు దశలలోనూ రాయిష్టుల నినాదాల యొక్క ప్రధానాంశం యిదొక్కటే. ప్రజలతో ఏమీ సంబంధం లేకుండా దూరంగా కూర్చుని, ప్రజల పేరుతో అవాకులూ చెవాకులూ వాగి, ఆ మాటలకు మార్క్సిస్టు దృక్పథం అని పేరు పెట్టడం, నిజంగా మార్క్సిజానికి యింతకంటే అపచారం ఎవరూ చేయలేదు.

"కాంగ్రెస్ కమిటీలను సోవియట్లుగా నిర్మించండి" అనే రోజులలో రాయిష్టులు భాషలో ప్రొలిటేరియన్ విప్లవం కావాలని వాదించారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి అన్ని విధాలా సహకారం చేస్తూ "ప్రజా ప్రభుత్వం" అనే పేరుతో తమకే పట్టంగట్టండి అనే యీ రోజులలో మధ్యతరగతి కోసం సాహిత్యం రచించాలంటున్నారు. అందుకు యిలా వాదించుతున్నారు. "మనం వ్రాయడానికి పూనుకోకపోతే మరికొందరి చేత వ్రాయించుకొంటుంది మధ్యతరగతి. పైగా కార్మికులకంటె ఎక్కువ డబ్బిస్తుంది. దాన్ని ఎవ్వరాపగలరు?" అని ప్రశ్నించుతున్నారు. వారి

రాజకీయ పతనానికి అనుగుణ్యంగానే వుందిగదూ వారి వాదన - వారి సాహిత్య మీమాంస ?

పైగా యీ కృష్ణారావుగారే 'కావ్యజగత్తు' అనే తన పుస్తకంలో ఎవరో కొందరు "సాహిత్యరంగంలో సోషలిస్టు విప్లవం రావాలని వెఱ్ఱి కేకలు వేస్తున్నారు సంధించిన వారిలాగా" అని ఆక్షేపించారు. కృష్ణారావుగారు 'ప్రజామిత్ర'లో వారు 1938 లో వ్రాసిన "ప్రొలిటేరియన్ విప్లవం కావాలి" అనే మాటలు తిరిగి మననం చేసికొంటే మంచిదంటాను. కామ్రేడ్ తుమ్మల వెంకటరామయ్య 1938 నవంబరులో ప్రకటించిన 'నవశక్తి' రష్యా సంచికలో "సోవియట్ సాహిత్యం" అనే ఒక వ్యాసాన్ని వ్రాశారు. దానిలో 'ప్రొలిటేరియన్' కల్చరును గురించి యిలా వ్రాశారు.

"1920-21 లో సోవియట్ రష్యాలో 'ప్రోలికల్ట్' ఉద్యమం బయలుదేరింది. ప్రోలికల్ట్ అంటే ప్రొలిటేరియన్ కల్చర్ అని అర్థం. ఈ ఉద్యమ నాయకులు ఒక్కసారి సాహిత్యాన్ని 'ప్రొలిటేరియనైజ్' చేయాలన్నారు. అందుకు వీ రవలంబించే మార్గంకూడ విచిత్రమే. "దీనిలో వర్గకలహం ఉందా, లేదా" అని పరీక్ష చేయడం. లేకపోతే ఆ సాహిత్యాన్ని త్రోసివేయడం. దీనినిబట్టి పూర్వసాహిత్యాన్నంతా సర్వనాశనం చేసి ఒక్కదెబ్బన "ప్రొలిటేరియన్ సాహిత్యాన్ని" ఆకాశం మీదనుంచి ఊడిపడినట్లుగా సృష్టించాలన్నారు.... లెనిన్ యీ ఉద్యమాన్ని గురించి "హా ! హా !" అని ఎగతాళి చేశాడు" అని వ్రాశారు.

కృష్ణారావుగారి వెర్రికేకలకు ఆ రోజులలోనే పైవిధంగా కామ్రేడ్ తుమ్మల వెంకటరామయ్య చక్కని మందువేశాడు. ఆ సంగతి మరచిపోవడం వల్లనో, ఏమో కృష్ణారావుగారు పైమాటలు వల్లించారు. ఈ సంధి ప్రేలాపనలు ఉన్న 'కావ్యజగత్తు' అనే తమ గ్రంథాన్ని అది "మార్క్సిస్టు దృక్పథం" అనుసరించుతున్నట్లుగా ప్రకటించుకున్నారు కూడ కృష్ణారావుగారు. కాని, పాపం ! ఆ గ్రంథంలో వారేమన్నారో చూడండి : "కార్మికుల జీవితాన్ని చిత్రించవచ్చును. కాని ఆ దృష్టి సోషలిస్టు దృష్టిగా వుండటానికి వీలులేదు. కేవలం ప్రజాస్వామిక

దృష్టిగా వుండాలి" అన్నారు. నేడు ప్రపంచాన్ని, సామ్రాజ్యవాద సంకెళ్ళు బంధించి వున్న ప్రజాస్వామిక హక్కులను రక్షించడం సాధించడంలో మార్క్సిస్టులే అందరికీ అగ్రగాములుగా వుంటున్నారు గదా; అలాంటప్పుడు సోషలిస్టు దృష్టి వుండరాదనడం ఏమిటి?

ఒకివైపున మార్క్సిస్టు దృక్పథంతో వ్రాసిన సాహిత్య సమీక్ష— అని కృష్ణారావుగారు తన పుస్తకానికి పేరు పెట్టుకున్నారు. కాని కార్మికుని జీవితాన్ని మాత్రం సోషలిస్టు దృష్టితో చిత్రించరాదట. భలే వితండవాద మిది. మార్క్సిస్టు విజ్ఞానం కలిగిన రచయిత ఉన్నాడనుకొందాం. అతడు ప్రజల జీవిత పరిస్థితులను చూస్తున్నాడు. వాటిని అతడు సాహిత్యంలో చిత్రించాలి. కృష్ణారావుగారి ఉపదేశం ప్రకారం ఆ రచయిత మార్క్సిస్టు దృక్పథంతో చూడరాదు. 'ప్రజా జీవితాలను సోషలిస్టు దృష్టితో చూడరాదు' — అంటే మార్క్సిస్టు విజ్ఞానం కలిగిన ఆ రచయిత మార్క్సిజాన్ని మరచిపోవాలి. అంతేనా దీని అర్థం? ఏమిటీ తికమక?

మార్క్సిస్టులమని చెప్పుకొనే రివిజనిస్టులు రాజకీయంగా ప్రజలను వదలి సామ్రాజ్యవాదుల వైపుకు పోయారేమిటి? సాహిత్యం మధ్య తరగతికోసం రాయాలంటారేమిటి? కార్మికుల జీవితాన్ని సోషలిస్టు దృష్టితో చిత్రించ రాదంటారేమిటి? అని పాఠకులు ప్రశ్నించవచ్చు.

ఈ వైరుధ్యంయొక్క స్వభావాన్ని తేటతెల్లం చేయటానికి ఒక ఉదాహరణ చూపుతాను. రష్యను సోషల్ డెమాక్రాట్ పార్టీలో బోల్షివిక్కులు, మెన్షివిక్కులు అని రెండు తెగ లుండేవి. ప్రజా వుద్యమం తీవ్రదశకు వచ్చేకొలదీ మెన్షివిక్కులు దిగజారడం మొదలెట్టారు. దీనికి కారణాలను లెనిన్ యీ విధంగా వివరించాడు. రష్యావంటి వెనుకబడిన పెట్టుబడిదారీ దేశంలో ప్రజా విప్లవంలో పెట్టుబడిదారీ ప్రతినిధులుకూడ మార్క్సిస్టులమని చెప్పుకొంటూ కార్మికవర్గంతో తోటి ప్రయాణికులుగా బయలుదేరుతా రన్నాడు ప్రజావుద్యమ స్థాయి హెచ్చి, విప్లవదశవచ్చే సరికి వీరంతా వెనుకకు దిగజారి పోతారన్నాడు. సామాజిక వ్యవస్థనే

తల్లక్రిందులుచేసే ప్రజావిప్లవం, ప్రజలను దోపిడీచేసే పెట్టుబడిదార్ వర్గాన్ని కూడా తుడిచిపెడుతుందని, వారు భయపడతా రన్నాడు.

అలాగే రాయిష్టులు మార్క్సిస్టులమని చెప్పుకున్నా వారు ప్రజా సామాన్యంయొక్క ప్రతినిధులుకారు. ఉద్యోగాల కొరకు బ్రిటిష్ సామ్రాజ్యవాదులను ఆశ్రయించుకొని వుండే కొలదిమంది మధ్యతరగతి మేధావులకు రాయిస్టులు ప్రాతినిధ్యం వహించుతున్నారు. అందుచేతనే రాయిస్టులు యుద్ధంలో ఫాసిసు దుండగీలను ఓడించాలని చెబుతున్నా భారత ప్రజానీకాన్ని సమీకరించడం వారి ఆశయంకాదు. కాంగ్రెస్ నాయకులను "దేశీయ ఫాసిస్టులని"తిడుతూ బ్రిటిష్ సామ్రాజ్యవాదులనుబలపరచడంతో సంతృప్తి పడుతున్నారు. సాహిత్యం విషయమై రాయిసుల దృక్పథం వారి రాజకీయాలకు అనుగుణ్యంగానే వుంది. అందుకనే కృష్ణారావుగారు "మనం వ్రాయడానికి పూనుకోకపోతే మరికొందరిచేత వ్రాయించుకుంటుంది. మధ్యతరగతి" అని వ్రాయగలిగారు."పైగా కార్మికులకంటె ఎక్కువ డబ్బిస్తుంది" అని సమర్థించుకున్నారు.

## గోపీచంద్ వ్యాసాలు

రాయిస్టులు వ్రాసిన వెనుకటి సంగతులు అంతటితో వదిలివేద్దాం ప్రస్తుతానికి వద్దాం. గోపీచంద్‌గారు 'విహారి' 3వ సంపుటి 4, 5, 7 సంచికలలో (1943 డిసెంబరు, 1944 జనవరి, ఫిబ్రవరి) 'ప్రజాసాహిత్యం' అనే శీర్షిక క్రింద వ్యాసాలు వ్రాశారు. వీరుకూడా మార్క్సిస్టు దృక్పథాన్ని అనుసరించే తాము విమర్శించుతున్నట్లు చెప్పుకొన్నారు. "అభ్యుదయ రచన అంటే ఏమిటి ?" అనే సమస్యను చర్చించారు. సమాజం ఎలా మార్పు చెందుతూ వచ్చిందో కొంత తర్కించారు. వీరేశలింగంగారు మొదలుకొని ఆంధ్ర రచయితల పోకడలను పరిశీలించుతూ ఏయే రచయితలు అభ్యుదయానికి కృషిచేశారో, ఎవరెవరు సమాజాన్ని వెనుకకు తీసుకుపోవడానికి తమ రచనలను వినియోగించుతున్నారో విమర్శించారు. ఆయన చర్చలు' తర్కం, విమర్శనలు మార్క్సిస్టు దృక్పథంతో నడిచాయో లేదో పరిశీలించుతాను.

వివరాలకు వెళ్లేముందు ఒక విషయం మనవి చేసాను. అభ్యుదయ రచయితల సంఘం ఒక ప్రజాస్వామిక సంస్థ దానిలో అనేక దృక్పధాలకు చెందినవారున్నారు. మార్క్సిస్టు దృక్పధం అంగీకరించినవారూ, మార్క్సిస్టు దృక్పథం అంటే ఏమిటో తెలియనివారూ వున్నారు. అందుచే అభ్యుదయ రచయితల సంఘ సభ్యుడు ఎవరైనా ఒకరు ఏమైనా వ్రాస్తే దానిని మార్క్సిస్టులకు అంటగట్టడంలో అర్థంలేదు. ఏమంటే, మార్క్సిస్టు దృక్పథం లేనివారు, తెలియనివారు చరిత్రను మార్క్సిస్టు దృక్పథంతో సమీక్ష చేయడం సాధ్యంకాదు గనుక.

అభ్యుదయ రచయితల సంఘంలో వున్న కొందరు "పాత సాహిత్యం ఎందుకూ పనికిరాద"ని చెప్పినమాట నిజమే (వీరు వేళ్ళమీద లెక్కించదగిన వారవడం గమనించాలి). దీనికి కారణం వారికి మార్క్సిస్టు దృక్పధం లేకపోవడమే. ఇ. వి. రామస్వామి నాయకర్, త్రిపురనేని రామస్వామి చౌదరిగార్లు బ్రాహ్మణులమీద తిరుగుబాటుచేసి, పాత పురాణాలన్నీ తగలబెట్టి క్రొత్తపురాణాలు వ్రాయించడమే కర్తవ్యమనుకొన్నట్టుగానే వీరు కూడ పొరబడుతున్నారు. మార్క్సిస్టు దృక్పథం వున్నవారయితే యీ పొరపాటు చేయరు. లెనిన్ యీ విషయమై ఏమన్నాడో చూడండి :

**"Proletarian Culture does not appear from, no one knows, where; it is not something invented by men who call themselves specialists in Proletarian Culture. That is an absurdity. Proletarion Culture should appear as the logical development of the sum of that knowledge which Humanity has accumulated under the yoke of capitalist society."**

"ప్రొలిటేరియన్ సంస్కృతి ఎక్కడినుంచీ ఆకాశాన్నుండి వూడిపడదు. ప్రొలిటేరియన్ సంస్కృతిలో నిపుణులమని చెప్పుకొనేవారు కనిపెడితే వచ్చేదికాదు; అలా జరగడం అసంభవం. పెట్టుబడిదారీ

సమాజంలో మానవజాతి ప్రోగుచేసుకొన్న విజ్ఞాన సంపద యొక్క క్రమాభివృద్ధియే ప్రొలిటేరియన్ సంస్కృతి."

పైన అభ్యుదయ రచయితల సంఘంలో వున్నవారంతా మార్క్సిస్టులు కారని మనవి చేశాను. అందుచే వారి రచనలో వున్న లోట్లను విమర్శించుతూ, గోపీచంద్‌గారు వ్రాసిన విమర్శనలకు జవాబివ్వడానికి నేను ప్రయత్నించను. ఆ విమర్శనలు చేయడంలో గోపీచంద్‌గారు పూర్వ రచనలను ప్రస్తుత రచనలను సమీక్ష చేశారు. ఆ సమీక్ష సరిగా వుందో లేదో మాత్రమే చర్చించుతాను.

ఒక అభ్యుదయ రచయిత పోతనామాత్యుణ్ణి పొగడినందుకు గోపీచందుగారికి గిట్టలేదు. "ఒక్క కల తప్పితే పోతనామాత్యుడు కూడా అభ్యుదయ కవి అని ఇతని అభిప్రాయం అయివుండాలి" అని వ్రాస్తూ, కాదని రుజువు చేయడానికి శ్రమపడ్డారు. పోతనవంటి రచయిత అభ్యుదయ రచయితో కాదో నిర్ణయించేటపుడు అతడు ఏ కాలంలో నివసించాడు అనే విషయంకూడ దృష్టిలో వుంచుకోవాలి. రాజుల మెప్పుకోసం వారి పొగడ్తలతో నిండిన కావ్యాలు వ్రాసే రోజులవి పోతన తన గ్రంథాన్ని "కూళలకిచ్చి అప్పడుపుకూడు భుజించుటకంటె, సత్కవుల్ హాలికులైననేమి, గహనాంతరసీమల కందమూల గౌద్దాలికులైననేమి" అన్నాడు. ఇందులో పోతన వ్యక్తిత్వం ఏముంది? అని గోపీచంద్‌గారు ప్రశ్నించారు. "పోనీ ఆ వ్యక్తిత్వమయినా "నిజదార సుతోదర పోషణార్థ"మే గదా అని యీసడించారు.

"ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులగొన" అని పోతనామాత్యుడు తిరస్కరించినా, "శ్రీహరి"కేగా చివరకు యిచ్చినదని ఆక్షేపించారు.

తన కావ్యాన్ని రాజులకివ్వనిరాకరించి, భూమి దున్నుక కుటుంబ పోషణ చేసికొంటానని చేసిన సవాలుయొక్క గొప్పతనాన్ని గోపీచంద్‌గారు గ్రహించలేదు. ఆ రోజులలో పోతన భౌతికవాది అవడం సాధ్యం కాదనీ తెలుసుకోలేదు. అందుచే పోతన సగర్వంగా చెప్పుకొన్న మాట

లలో జమిందారీ తత్వానికి ఎదురు తిరిగిన రైతు కవి హుందాను గోపీచంద్‌గారు గ్రహించలేకపోయారు. రష్యన్ విప్లవంలోకూడ తజికిస్తాన్ ప్రాంతంలో ముస్లిం రైతులు అల్లా పేరుతోనూ, ఖురాన్ పేరుతోనూ జమిందారులపై తిరుగుబాటు చేశారు. భూమిని పంచుకున్నారు. నేడు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలద్వారా సాగుజేసి అనుభవించుతున్నారు. ఆ ముస్లిం రైతులకు మతంపైన, అల్లాపైన విశ్వాసంవుంది గాన అది అభ్యుదయం కాదనటం పొరబాటు గాదా?

"అభ్యుదయ రచన" అనే పుస్తకంపై గోపీచంద్‌గారు తన వ్యాసాలలో ఘాటుగా విమర్శించారు. ఆ రచయిత ఏదో తన పుస్తకం అచ్చు వేసుకోవాలనే వుబలాటంతో ప్రకటించిన తప్పుల తడక కాబట్టి దాని లోటుబాటుల జోలికి నేను పోను' దాన్ని ఆధారంగా తీసికొని గోపీచంద్‌గారు "వీళ్ళ చరిత్ర జ్ఞానం యింత చక్కగా వెలుగుతూంది" అని తిట్టిపోశారు. అవకాశం దొరికినప్పుడు ప్రత్యర్థులను తిట్టడం సహజమే కాబట్టి ఆ తిట్లజోలికి నేను పోనవుసరం లేదు. దానితోపాటు గోపీచంద్‌గారు మన చరిత్రను పర్యాలోకించారు. ఈ పర్యాలోకన సరిగా వుందో లేదో మాత్రమే చర్చించుతాను.

## బౌద్ధ వికాసం
## (రినైజాన్స్)

బౌద్ధమతం భారత సంస్కృతికి, దేశభాషలకు చేసిన మేలును గోపీచంద్ కీర్తించాడు. "పలుకుబడిలోవున్న పూజారివర్గం మీదకీ, దాని చెప్పుచేతల్లో వున్న క్షత్రియవర్గం మీదకీ - జరిగిన విప్లవం బౌద్ధమతం అన్నారు. బౌద్ధమతం ఓడిపోవడంవల్ల "మళ్ళీ పై రెండు వర్గాలూ పలుకుబడిలోనికి వచ్చినై" అని వ్రాశారు. "యీ చరిత్రని విమర్శదృష్టితో చదివితే యీ విప్లవానికి సాయం చేసింది. చిన్నచిన్న వ్యాపారస్తులూ. మధ్యతరగతీ అని మనకి తేలిగ్గా తెలుస్తుంది" అని గోపీచంద్‌గారు అన్నారు.

గోపీచంద్‌గారు వ్రాసినట్లుగా బౌద్ధమతం రెండు (పూజారి.

క్షత్రియ) వర్గాలమీద క్షత్రియవర్గంచేసిన తిరుగుబాటు మాత్రమే. దానికి యజ్ఞ - యాగాదులనే పేరుతో దోచుకోబడుతున్న ప్రజలు, చిన్న వర్తకులు అందరూ సాయపడ్డారు. క్షత్రియవర్గం పైన కూడ అదివరకు పూజారివర్గం పెత్తనం చేసేది గాన క్షత్రియవర్గం ప్రజలకు నాయకత్వం వహించింది. బౌద్ధమతం కర్మకాండను ఖండించింది. ప్రజలకు ప్రీతిపాత్ర మయింది. జాతిభేదం, కులభేదం, స్త్రీ పురుషుల భేదం లేకుండా బౌద్ధసంఘారామాలలో చేరడానికి హక్కుండేది. ఖచ్చితమైన నైతిక ప్రవర్తన, విద్యాశక్తి కలిగిన బౌద్ధ సన్యాసులు సమిష్టిగా ఆడంబర రహితమైన జీవితం గడుపుతూ ప్రజలకు సేవ చేసేవారు. అందుచే బౌద్ధమతం ప్రజలలో వ్యాపించ గలిగింది. దేశభాషలలో తమ గ్రంథాలను వ్రాసి ప్రజలకు బోధించి వాటిని అభివృద్ధి చేశారు. అదివరకు బ్రాహ్మణ మతంలో వేదాలను చదవడానికి బ్రాహ్మణ, క్షత్రియులకు తప్ప యితరులకు హక్కు లేదు. బౌద్ధమతం అన్నికులాలకు స్త్రీలకు సైతం తమ ధర్మాన్ని బోధించింది. ఇందువలననే బౌద్ధయుగంలో భారత నాగరికత ఎంతో ఘనకార్యాలను సాధించగలిగింది.

కాని క్రమంగా బౌద్ధమతంలో చీలికలు బయలుదేరాయి. క్రమంగా వానిలో కూడ దేవతాపూజలు, తంతులు ప్రవేశించాయి. వీటితో పాటు నైతిక ప్రవర్తనలో కట్టుబాటు సన్నగిలటం ప్రారంభించాయి. ఓడిపోయిన పూజారివర్గం దండయాత్ర చేసిన హూణులతో కలసి బౌద్ధులతో పోరాడి వారిని ఓడించగలిగింది. బౌద్ధమతం క్షీణించి దానిస్థానే సంస్కారం పొందిన బ్రాహ్మణమతం ప్రచారంలోకివచ్చింది. వైశ్యులు కూడ ద్విజులుగా అంగీకరించబడ్డారు. అనార్య ప్రజలలో నుండి లొంగిపోయిన శూద్రులకు నాలవ కులంగా సమాజంలో స్థానం యివ్వబడింది. బ్రాహ్మణులు కూడ దేశభాషలలో భక్తియోగాన్ని ప్రజలలో బోధించసాగారు. క్షత్రియవర్గం యొక్క అధికారాన్ని గుర్తించి పూజారివర్గం వారికి ఏజెంటుగా పనిచేయవలసి వచ్చింది. బ్రాహ్మణమతం పునరుద్ధారకులలో ముఖ్యుడైన శంకరాచార్యులను కూడా బౌద్ధ రినైజాన్సు ఉద్యమానికి చెందినవారిలో చేర్చి గోపీచంద్ వ్రాయడం సరికాదు.

గోపీచంద్‌గారు "ఎవరికి వాళ్ళే బ్రతికే పద్ధతికి వ్యతిరేకం జరగడంవల్ల సహకారంతో కూడుకున్న జమీందారీ విధానం వచ్చింది" అని వ్రాశారు. దీనిలో అచ్చు పొరపాటు లేకపోతే వారు అభ్యుదయ రచయితలను ఆక్షేపించుతూ వ్రాసిన "వీళ్ళ చారిత్రక జ్ఞానం ఇంత చక్కగా వెలుగుతూవుంది" అనే మాటలు గోపీచంద్‌గారికే వర్తించుతాయి అనవలసి వస్తుంది. జమీందారీ విధానానికి పూర్వం ఎవళ్ళకి వాళ్ళే బ్రతికేపద్ధతి లేదనీ బానిస విధానం వుండేదనీ, ఏమాత్రం మార్క్సిసు జ్ఞానం వున్న వారికైనా బోధపడుతుంది. బానిసలుగా పని చేయించే కంటే, రైతాంగం చేత సాగుచేయించి, మక్తాలు కౌళ్ళు పేరుతో రైతాంగాన్ని దోచుకునే భూస్వామ్య విధానం జమీందారీ యుగంలో ప్రారంభమయింది. బానిస విధానంలో పాలకవర్గమైన యజమానులకు స్వంత ఆస్తి హక్కులనేవి ఏర్పడి, జమీందారీ విధానంలో భూస్వామ్య హక్కులు పాలకవర్గ గుత్తసొమ్ముగా వృద్ధిచెందాయి. పెటుబడిదారీ విధానంక్రింద వ్యక్తిగత ఆస్తి, సమిష్టిగా వుత్పత్తిచేసే కార్మికవర్గం కూడ- పెటుబడిదారీ సమాజంలోనే పెంపొందుతూంది. కార్మికవర్గం అధికారం స్వీకరించి, యిపుడు స్వంత లాభాలకు వినియోగపడుతున్న సమిష్టి ఉత్పత్తిని సంఘ ప్రయోజనాలకు వినియోగించుతుంది. దానినే 'సోషలిజం' అంటాము. ఇంత స్వల్ప విషయంలో గోపీచంద్‌గారు ఎందుకు పొరపడ్డారో!

ఇంకా గోపీచంద్‌గారు "నేను అభ్యుదయ రచయితనే. నేనూ సంఘ శ్రేయస్సుకోసమే వ్రాస్తున్నాను" అనేవారి పై మెరుగులు చూచి మోసపోవదని హెచ్చరించారు. నిజమే! పాఠకులు ఏదిమంచిదో విచక్షణాజ్ఞానంతో పరిశీలించి తెలిసికోవలసిందే. అలాగే మార్క్సిస్టులమని చెప్పుకొంటూ గాయిస్టులు చేసే రభసను చూచి మార్క్సిజాన్ని అపార్థం చేసికోవద్దని ప్రజలకు మనవి చేస్తాను.

ఫిబ్రవరి 1వ తేదీ 'ఎహారీ' పత్రికలో సమాజ పరిణామాన్ని గురించి చర్చించుతూ గోపీచంద్‌గారు "ప్రిమిటివ్ కమ్యునిజములోనుంచి

జమీందారీ విధానము వచ్చిం" దని వ్రాశారు. ఆదిమ సమాజంలోనుంచి పశువుల పెంపకం, వ్యవసాయం కొలదిగ వృద్ధిఅయిన తరువాత తెగలు తాము జయించిన శత్రువులను బానిసలుగా పని చేయించుకొనేవారనీ, బానిసవిధానం అమలులోనికి వచ్చిందనీ సమాజశాస్త్రం చెబుతూంది. అలాంటప్పడు గోపీచంద్‌గారు ఆదిమ సమాజంలో నుంచి జమీందారీ విధానం వచ్చిందని ఎలా వ్రాశారు? మార్క్సిజానికి వారు చెప్పే నూతన భాష్యమా ఇది? అని ప్రశ్నించుతాను.

## నవ్యాంధ్ర సాహిత్యం-రచయితలు

వీరేశలింగంగారు జమీందారీ విధానంలోవున్న లోటుపాట్లను బట్టబయలు చేసినవారిలో ముఖ్యులని, వారు యుగపురుషులనీ గోపీచంద్‌గారు సరిగానే గుర్తించారు. గిడుగువారి వ్యవహారిక భాషావాదాన్ని ఆచరణలో పెట్టడంలో గురజాడ చేసిన సేవను కొనియాడారు. సి. ఆర్. రెడ్డి, ఉన్నవ లక్ష్మీనారాయణగార్ల రచనల గొప్పతనాన్ని చక్కగా చెప్పారు.

రామస్వామిగారిని గురించి వ్రాస్తూ వారు "పూజారి వర్గంమీద, ఆ మొత్తం నాగరికతమీద కలహం సాగించారు" అని గోపీచంద్‌గారు వ్రాశారు. పైగా బౌద్ధ విప్లవం నాటినుంచీ జమీందారీవర్గం-పూజారివర్గం కలహించుకుంటున్నాయనీ ఎప్పటికప్పుడు పూజారి వర్గందే పై చేయి అయిందనీ వారు చెప్పారు. పెట్టుబడిదారీ ఆర్థిక విధానంకూడా 20 వ శతాబ్దంలో మనదేశంలో ప్రవేశించినప్పటికీ మన సమాజంపై జమీందారీ నాగరికత ఛాయలు యింకా గాఢంగా వున్నమాట వాస్తవం. కాని జమీందారులకు, భూస్వాములకు, కొత్తగా వచ్చిన పెట్టుబడి దారులకు కూడ తలఒగ్గి పూజారివర్గం పనిచేయవలసి వస్తూంది. అందుచే రామస్వామిగారి కాలానికి గ్రామాలలో బ్రాహ్మణుల పెత్తనంకూడ కొంత వున్నప్పటికీ వారు పాలకవర్గం కాదు. రామస్వామి చౌదరి రామస్వామి నాయకర్‌లు బ్రాహ్మణేతర ఉద్యమ ధ్వజమెత్తారు. కాని ప్రధానవర్గంపై యీ పోరాటం సాగించబడక పెడమార్గం పట్టింది. పూజారీ వర్గంపై

(బ్రాహ్మణులపై) బయలుదేరిన యీ పోరాటం స్వకుల పౌరోహిత్యంతో అంతమైంది. పైగా యీ ఉద్యమం ప్రజాసామాన్యంపై కమ్మ వెలమ, రెడ్డి జమీందారుల పలుకుబడిని వ్యాపింపజేయటానికి వినియోగపడింది. బ్రాహ్మణులపై రేగిన అసంతృప్తి జస్టిస్ పార్టీద్వారా జమిందారీ నాయకత్వాన్ని బలపరిచింది. అందుచే తప్పుదారిన పడిన పాక్షిక తిరుగుబాటే గాని, సక్రమ ప్రజాఉద్యమంగా అది వృద్ధిచెందలేదు. అదిచేసిన మంచి అంతా బ్రాహ్మణేతరులలో విద్యాసక్తి, ఆత్మగౌరవం ఎక్కువ చేసింది. ఈ సత్యాన్ని మన రాయిస్టులు గమనించినట్లు కన్పించదు.

## ముగింపు

రాయిస్టుల సాహిత్యపు పోకడలపై వ్రాసిన విమర్శనలు సాకల్యంగా చర్చించాను. వారు అభివృద్ధిని కోరుతున్నామని చెప్పినా, మార్క్సిస్టులమని చెప్పుకున్నా ప్రధాన సమస్యలను గురించి వారికి మార్క్సిస్టు (శాస్త్రీయ) దృక్పథం లేదని రుజువు చేశాను.

రాయిస్టులు కథలు, నవలలు వ్రాస్తున్నారు. ఈ రచనలలో నూతన టెక్నిక్ ఉపయోగించుతున్నారు. కాని వీటన్నిటిలోనూ ఒకే ప్రధానమైన లోటు వుంది. ప్రజాసామాన్యానికీ, వారి అభిప్రాయాలకీ రాయిస్టులుతావు యివ్వరు. అందుచే ప్రధాన సమస్య లన్నిటిలోనూ వారి వాదనలు "నేల విడచిన సాముపలె" పేలవమైపోతున్నాయి.

ఉదాహరణకు కాంగ్రెస్ మహాసభ యెడల రాయిస్టులు యిపుడు అవలంబించే దృక్పథం చూచాం. భారత ప్రజల స్వాతంత్ర్య కాంక్షకు కాంగ్రెస్ చిహ్నం 1936 లక్నో కాంగ్రెస్ మొదలుకొని చివరకు బొంబాయిలో చేసిన ఆగస్టు తీర్మానంలో కాంగ్రెస్ ఫాసిస్టు వ్యతిరేకతను స్పష్టంగా వెల్లడించింది. కాని యీ సత్యాన్ని రాయిస్టులు గురించనే గుర్తించడంలేదు. పైగా తాము ఫాసిజానికి వ్యతిరేకమని చెప్పుకొంటూనే, కాంగ్రెస్‌ను 'దేశీయ ఫాసిజ'మని నిందించుతున్నారు. అనగా, భారత ప్రజల స్వాతంత్ర్య కాంక్షనే నిరసించుతున్నారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారత స్వాతంత్ర్యాన్ని నిరాకరించడానికి చెప్పేసాకును



మాస్కోలోని ప్రగతి ప్రచురణాలయం తెలుగు విభాగం అధిపతి
శ్రీమతి స్వెత్లానా విజయవాడ అరుదెంచినప్పుడు
విశాలాంధ్ర కార్యాలయంలో జరిగిన సభకు
అధ్యక్షత వహించిన చంద్రంగారు

తాముకూడా వల్లించుతున్నారు. జాతీయ నాయకులనే 'జపాన్ ఏజంట్ల'ని పిలుస్తున్నారు. భారత ప్రజలందరికీ దూరమవుతున్నారు.

అందుచే రాయిస్టుల రచనలన్నీ మొత్తంగా తీసికుంటే వారు సాహిత్యంలో రావాలని కోరుతున్న మార్పు అభ్యుదయమూ కాదు. వారి దృక్పథం మార్క్సిస్టు దృక్పథమూకాదు. సామ్రాజ్యవాద బానిసత్వానికి తలలొంచి "ఉత్తర కుమార ప్రజ్ఞలు" కొట్టే కొంచరి మధ్యతరగతి మేధావుల వదరుబోతు తనము రాయిజము. స్వాతంత్ర్యోద్యమముతో సంబంధములేని కొలదిమంది మేధావుల రియాక్షనే రాయిజము. మార్క్సిజముతోగాని, ప్రజలతోగాని దానికెట్టి సంబంధమూ లేదు సరిగదా ప్రజల ప్రజాస్వామికానికీ, సర్వతోముఖమైన జాతీయాభ్యుదయానికీ వ్యతిరేకము రాయిజము.

ప్రజల సమస్యలను తీర్చి, ప్రజలకు నాయకత్వము వహించి నడుపజాలని కార్యక్రమము మార్క్సిస్టు కార్యక్రమం కాదు; కాజాలదు. అలాగే ప్రజలను ఉత్తేజపరచి కర్తవ్యపాలనా దక్షులను చేయజాలనిది ప్రజాసాహిత్యము కాజాలదు. ఈ సూత్రాలే రాయిస్టులుచేసే భావాలను పరీక్ష చేయడానికి పనికివస్తాయి. ఆపని పాఠకులకే వదలివేస్తాను.

[1944 డిశెంబరు 'తెలుగుతల్లి' సంచిక నుండి]

# 10. ఆంధ్ర సాహిత్యంలో కొత్త పోకడలు

1857 తిరుగుబాటు, ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం ఓడి పోవడంతో బ్రిటిషు ప్రభుత్వం భారత దేశంలో వేళ్లూనింది. భారత ప్రజలను బానిసత్వంలో అణిచి పెట్టడానికి. తమ సామ్రాజ్యాన్ని రక్షించు కోడానికి బ్రిటిషువాళ్ళు రైల్వే నిర్మాణానికి పూనుకున్నారు.

అదివరకు మనదేశంలో జమీందారీ సమాజం వుంది. వ్యవసాయం, చేతి పరిశ్రమలపై ఆధారపడిన ఆర్థికజీవితం అమలులోవుంది. జమీందారులు, జాగీర్దారులు, యీనాందారులచే పీడించ బడుతున్న రైతాంగం, కుల-మత హెచ్చుతగ్గులతో చీలివున్న ప్రజలు, అజ్ఞానంలో మూఢ విశ్వాసాలతో మునిగివున్నారు.

రాజుల-నవాబుల జమీందారీ నాగరికతను బ్రిటిషు సామ్రాజ్య వాదుల పెట్టుబడిదారీ నాగరికత జయించింది. మనం బానిసలమయ్యాము. బ్రిటిషువాళ్లు రైల్వేల నిర్మాణంతో పెట్టుబడిదారీ ఆర్థికవిధానాన్ని ప్రవేశ పెట్టారు. ఈ దేశంలోని ముడి పదార్థాలను చౌకగా కొని తీసుకుపోవడం వాళ్ళ ఫ్యాక్టరీ వస్తువులను దిగుమతిచేసి లాభాలకు అమ్మకోడం ప్రారంభించారు. దీనితో మన దేశంలోని చేతి పరిశ్రమలు నశించిపోసాగాయి. పెట్టుబడిదారీ విధానంతోపాటు అచ్చుయంత్రాలు, పత్రికలు మనదేశంలో కూడా వెలయ సాగాయి.

## వీరేశలింగం యుగం

పై మార్పు లన్నిటి ఫలితంగ నూతన పరిస్థితుల నుంచి నూతనాంధ్ర జాతీయ వికాసం ప్రారంభమయింది. ఈ దశను వీరేశలింగ

యుగమని పేరిడదాము. పాశ్చాత్య నాగరికతతోను, ఇంగ్లీషు సాహిత్యంతోను ఏర్పడిన సంబంధం వల్ల తెలుగు సాహిత్యంపైన మన నాగరికతపైన వీటి ఛాయలు పడసాగాయి. వీటిని తీర్చిదిద్ది తెలుగుసాహిత్యానికి కొత్త అలంకారము చేకూర్చి, మన ప్రజలకు అందజేసి, కందుకూరి వీరేశలింగం పంతులుగారు నిజంగా యుగపురుషు లయ్యారు.

అప్పటికి మన తెలుగుసాహిత్యం రాజుల, జమీందారుల దయ కోసం శృంగార ప్రబంధాలు వ్రాసేస్థితికి దిగజారి పోయింది. మనరాజుల రాజ్యం చిన్నదైనా, అధికారం ఏమీ లేకపోయినా, బిరుదావళి పొడుగ్గా వుంటుంది. అదే విధంగా సాహిత్య రంగంలో పదాడంబరంకోసం తాపత్రయం హెచ్చింది. రెండర్థాలువచ్చే శ్లేషకావ్యాలు,ద్వంద్వార్థకావ్యాలతో డ్రిల్లు చేయడం కూడా పరిపాటి అయింది. ఈ విషయాన్ని గురించి సరస్వతీ శారదా విలాపమనే గ్రంథంలో వీరేశలింగంగారే యిలా చెప్పారు :

క. తెలియుము సుమ్మిపుడు నా
పలుకుల యర్థంబు నాకే భావము లేమిన్
వెలసొమ్ములు గాకివి సం
కెలలయి కడునాదు మేనికి న్వెతనించున్.

సీ. దయమాలి తుదముట్ట దలకట్లు నిగిడించి
ధీరుడై నన్ను బాధించు నొకడు
పాదంబు లోపల బాదంబు లిమిడించి
వీరుడై నన్ను నొప్పించు నొకడు.
ప్రాసంబుకై చెక్కు ప్రాసంబు లడరించి
పోటుబంటయి నన్ను బొడుచు నొకడు;
చెండుపల్కులుగూర్చి నిండించి నగలంచు
దిట్టయై చెవులు వేధించునొకడు

ఖడ్గచక్రాది రూపము ల్గానిపించి
వర్ణముల్ మాన్చి నను జిక్కుపరచు నొకడు

కుమతులొడలెల్ల విరిచి ప్రాణమ్ముతీయు
నొడలి పసలేక శుష్కించి యున్నదాన.

ఇట్టి తెలుగు సాహిత్యాన్ని తీర్చిదిద్దడానికి, ఇంగ్లీషు సాహిత్యంలో చూస్తున్న అభ్యుదయ సాహిత్యరీతులను ప్రవేశపెట్టడానికి వీరేశలింగం గారు పూనుకున్నారు. కాని మొదట్లో వీరుకూడా తమ పాండిత్యగరిమను చూపుకోడానికి కొన్ని రచనలను వ్రాయకపోలేదు. 'రసికజన మనోభి రామం' అనే శృంగార ప్రబంధం. "శుద్ధాంధ్ర నిర్వచన నిరుష్ట్య నైషధం." నీతిచంద్రికలోని "విగ్రహం, సంధి" లాంటివి పాతఫక్కీని వ్రాశారు. కాని అది సరియైన మార్గంకాదని తెలిసికొని ఆ పద్ధతి వెంటనే మానివేశారు.

తెలుగు ప్రజలలోవున్న మూఢవిశ్వాసాలను, దురాచారాలను ఖండించుతూ అనేక ప్రహసనాలు వ్రాశారు. వాటిలో సులభశైలి, నిశిత మైన విమర్శ యిమిడివుంది. సంఘసంస్కార ప్రబోధం వుంది. 'సత్య వతి' 'చంద్రమతి' అన్న కథలను, రాజశేఖర చరిత్ర అను నవలను వ్రాసారు. వీటిలో తెలుగు ప్రజల జీవితం చిత్రించుతూ తాము కోరు తున్న సంస్కార భావాలను ప్రచారం చేశారు.

రాజశేఖర చరిత్ర తెలుగులో వ్రాయబడిన మొదటి వచనకావ్యం దీనినే ఇంగ్లీషులో నావెల్ అంటారు. వీరేశలింగంగారు తరువాత మంచి నవల వ్రాసినవారికి బహుమానాలు యిస్తామని ప్రకటించారు. పోటీలలో బహుమతి పొందినవే చిలకమర్తివారి 'హేమలత, రామచంద్ర విజయం, అహల్యాబాయి' అను నవలలు.

వీరేశలింగంగారు శకుంతల, రత్నావళి వగైరా సంస్కృత నాట కాలను సులభ శైలిలో తెలిగించారు. తాము స్వయముగా హరిశ్చంద్ర వగైరా నాటకాలువ్రాసి నూతనఫక్కీ నాటకాలను ప్రోత్సహించారు. లంచగొండితనాన్ని ఖండించుతూ 'వ్యవహార ధర్మబోధిని' అనే వచన నాటకాన్ని వ్రాశారు.

బాలికా పాఠశాలను నిర్వహించి స్త్రీ విద్యను ప్రోత్సహించారు. స్త్రీ విద్య పనికిరాదన్న వారిని విమర్శించుతూ ప్రహసనాలు, వ్యాసాలు

వ్రాశారు. వితంతు వివాహాలను సమర్థించుతూ ప్రహసనాలు, వ్యాసాలు వ్రాశారు: తాము స్వయంగా ఎన్నో కష్టాలకోర్చి వితంతు వివాహాలను చేశారు. శంకరాచార్యుల ఆంక్షలను – బహిష్కరణ పత్రాలకు గురి అయ్యారు. భావిపౌరులు కానున్న తమ విద్యార్థుల సైన్యంతో శంకరాచార్యుల సన్యాసుల మఠాను ఓడించివేశారు.

'సత్యరాజు పూర్వ దేశయాత్రలు' లో చక్కని హాస్యరసాన్ని చిత్రించి వీరేశలింగంగారు 'సెటైర్' వ్రాయడంలో కూడ అద్వితీయులని నిరూపించుకున్నారు 'ఆడ మళయాళం'లో మన సమాజంలో మహిళల కున్న నిర్బంధాలు, యిబ్బందులు మలయాళంలో పురుషులకున్నట్లు చిత్రించి అపుడెంత హేళనగా వుంటుందోచూపి, తాముకోరే స్త్రీ స్వాతంత్ర్యాన్ని ప్రచారంచేశారు. లంకా ద్వీపయాత్రలో జ్యోతిషశాస్త్రాన్ని అపహాస్యం చేశారు.

ఉద్యోగుల లంచగొండి తనాన్ని నిరసించుతూ వ్యాసాలు, ప్రహసనాలు వ్రాశారు. పరువు నష్టదావాలకు గురి అయ్యారు. కులవిచక్షణ పనికిరాదని నిరూపించుతూ సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేశారు. తమ జంధ్యం తీసివేసి బ్రహ్మసమాజములో చేరారు.

తెలుగులో శాస్త్రగ్రంథాలు లేనిలోటు గమనించి శరీర శాస్త్రము, ఖగోళ శాస్త్రమును వ్రాశారు. అప్పటికి దొరకిన పరిశోధనల ఫలితాలను అనుసరించి ఆంధ్ర కవుల చరిత్రను వ్రాశారు. తరువాత పరిశోధనలను అనుసరించి యీ పుస్తకాన్ని సవరించుతూ వున్న సమయంలోనే 1919 మే 27 తేదీన కీర్తిశేషు లయ్యారు.

వీరేశలింగం పంతులుగారు ఆంధ్ర సాహిత్యానికి, ప్రజల విజ్ఞానాభివృద్ధికి చేసిన సేవ అపారం. ఒకమాటలో చెప్పాలంటే పంతులుగారు ఆంధ్ర సంస్కృతిలో ఒక నూతనశకం ప్రారంభించారు. జమిందారీ యుగపు సాంప్రదాయాలనే సంకెళ్ళతో కునారిల్లుతున్న ఆంధ్ర సంస్కృతికి వీరు పునరుజ్జీవనం పోశారు. "వీరేశలింగముగారు నవీనాంధ్ర దేశమునకు, ఆంధ్ర వాఙ్మయమునకును యుగపురుషుడు" (రాయసం వెంకటశివుడు) "వీరేశలింగంగారే ఒక ఉద్యమం : ప్రజ" (క్రిష్ణశాస్త్రి).

## విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి

పంతులుగారు ప్రారంభించిన సత్సంప్రదాయాలను తరువాత అనేకమంది రచయితలు కొనసాగించారు. వారిలో ముఖ్యులు చిలకమర్తి లక్ష్మీనరశింహంగారు. అనేక నవలలు, కథలు జీవితాలు, ప్రహసనాలు, నాటకాలు వ్రాశారు. వారి "రాజస్థాన కథావళి" ఎంతోమంది తెలుగు యువకులలో దేశభక్తిని రగుల్కొలిపింది. హేమలత అహల్యాబాయి చక్కని చారిత్రక నవలలు రామచంద్రవిజయం, రాజరత్నం, నాటి బ్రాహ్మణకుటుంబాల జీవితాన్ని చక్కగా చిత్రించే సాంఘిక నవలలు. గణపతి మూఢాచారాలను హేళనచేసే హాస్యరస ప్రధానమైన నవల. వీరి నాటకాలు గయోపాఖ్యానం వగైరా ఎంతో జనాదరణ పొందాయి. ఇలాగే అనేకమంది రచయితలు వీరేశలింగంగారి సాంప్రదాయాలను కొనసాగించారు. తానే ఒక సంస్థగా పనిచేశాడు వీరేశలింగంగారు.

1906 లో కొమర్రాజు లక్ష్మణరావుగారు విజ్ఞానచంద్రికా గ్రంథమాల అను సంస్థను స్థాపించారు. రచయితలను ప్రోత్సహించి అనేక గ్రంథాలను వ్రాయించారు, 'అబ్రహాం లింకన్' 'జీవితచరిత్రము' 'స్వీయచరిత్రము' వంటి జీవిత చరిత్రలను, విజయనగర సామ్రాజ్యము, రాయచూరు ముట్టడి, పాతాళభైరవి, అల్లాహో అక్బర్‌లాంటి గొప్ప నవలలను ప్రకటించారు,

హిందూ మహాయుగము, మహమ్మదీయ మహాయుగము, ఆంధ్రుల చరిత్రవంటి చరిత్ర గ్రంథాలను ప్రకటించారు, ఫ్రెంచివిప్లవం అమెరికా స్వాతంత్ర్యము వగైరా రాజకీయ గ్రంథాలు ప్రకటించారు.

భౌతికశాస్త్రము, రసాయనశాస్త్రము, వ్యవసాయశాస్త్రము, ఆర్థిక శాస్త్రము వగైరా సైన్సు గ్రంథాలను తెలుగులో వ్రాయించి ఆంధ్ర సాహిత్యానికి గొప్ప సేవచేశారు. ఆంధ్ర విజ్ఞానసర్వస్వాన్ని గొప్ప ఆశయాలతో ప్రారంభించారు. మూడు భాగాలనుమాత్రం ప్రకటించగలిగారు దురదృష్టవశాత్తు స్వల్పవయస్సులోనే (46 యేండ్లకు) 1923 జూలై 13వ తేదీన మరణించారు.

'విజ్ఞానచంద్రిక'ను అనుసరించుతూ తెలుగు దేశంలో అనేక గ్రంథమాలలు బయలుదేరాయి. ఆంధ్ర ప్రచారిణీ సరస్వతి వేగుచుక్క- వగైరా అనేక గ్రంథమాలలు విరివిగా నవలలను ప్రకటించాయి. ఇంగ్లీషు, బెంగాలీ భాషలనుంచి అనువాదాలు విరివిగా రాసాగాయి. ఆంధ్ర సాహిత్య వనంలో వివిధ రకాల కొత్త కొత్త మొక్కలు అంట్లు దినదినాభివృద్ధి గాంచసాగాయి.

గ్రంథమాలలు మాదిరిగానే గ్రంథాలయాలు (లైబ్రరీలు) గ్రామ గ్రామాన వెలిశాయి. విరివిగా గ్రంథాలు అచ్చుగావడం, చౌకగా దొరకడం, సులభ శైలిని వ్రాయబడిన నవలలూ మొదలైన వచన రచనలు ప్రజాసామాన్యానికి అందుబాటులో వుండటం సాధ్యమయింది. గ్రంథాల యోద్యమంకూడ యిందుకెంతో దోహదం చేసిందని చెప్పాలి.

ఈ సమయంలోనే (1909) మచిలీపట్నంలో ఆంధ్ర జాతీయ కళాశాల ప్రారంభించబడింది. దానితోబాటు పెద్ద వర్కుషాపు (కర్మాగారం) స్థాపించబడింది. ఇంజనీరింగు, చిత్రకళ, తివాశీనేత వగైరా అనేక శాఖలతో ఒక విశ్వవిద్యాలయంలాగ నడపాలనే ఆశతో పునాదులు వేయబడ్డాయి. ఇంతేగాక మొదటి ప్రపంచయుద్ధకాలంలో (1912-18) ఆంధ్ర దేశంలో బందరు పంచదార ఫ్యాక్టరీ, రాజమండ్రి పేపరుమిల్లు. తాడేపల్లి బట్టలమిల్లు వగైరా పరిశ్రమలు మొలకెత్తాయి.

ఈ కాలంలో నూతన జాతీయ వికాసానికి పాటుబడుతున్న రచయితలకు ఆశాజ్యోతి కన్పించేది. భవిష్యత్తును గురించి బంగారు కలలు గనేవారు. అందుకు చక్కని ఉదాహరణ.

## దించు లంగరు

"దించులంగరు దీర్ఘ యుద్ధం
ధర్మపక్షము ముల్లుచూపెను
నరుల పీనుగు పెంటపోగుల
నాటి వెలయును శాంతిపక్షము"

(1913)

నవ్యాంధ్రభాషకు పునాదులు వేసిన వీరేశలింగంగారు, ఆ పునాదులను విస్తరింపజేసిన విజ్ఞానచంద్రికా గ్రంథమాల, చిలకమర్తి వగైరా రచయితలు సులభమైన గ్రాంధికభాషను వాడారు. ప్రబంధాలలోని కృతకభాషను వారు వదలివేసినా, సజీవమైన వ్యవహారభాషలో గ్రంథ రచన చేయడానికి అంగీకరించలేదు. విశ్వవిద్యాలయం వారు కూడ వ్యవహారభాషలో వ్రాసిన రచనలను పాఠ్యగ్రంథాలుగా తీసికొన నిరాకరించారు.

ఈ విషయంలో గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యవహారిక భాషే సజీవమైనదనీ, పూర్వకవుల రచనలలో కూడ భాష కాలాను సారంగా మారుతూ వచ్చిందనీ ఒక ఉద్యమాన్ని లేవదీశారు. గ్రాంథిక భాషను సమర్థించే ఆంధ్రసాహిత్య పరిషత్తుతో హోరాహోరీగా పోరాడారు. భాషాశాస్త్రాన్ని బోధించి పండితులను ఓడించారు.

ఒకసారి రామమూర్తిగారిని హేళన చేయడానికి ఛాందస పండితులు 'వ్యవహారిక భాష వివిధ ప్రాంతాలలో వివిధ రూపాలుగా వుంటుంది. సర్వులకు తెలిసేదిగా వుండదు' అని ఆక్షేపించారు. 'ఉదాహరణకు - పోకచెక్కలను కొన్నిచోట్ల చెక్కలు, మరికొన్నిచోట్ల వక్కలు అని వాడతారు; కందులు, బేడలు అని వేరువేరు ప్రాంతాలలో వాడతారు; అని ఆక్షేపించారు. దానికి రామమూర్తిగారు నవ్వి "ఆ వస్తువులకు మీ గ్రాంథికభాషలో సర్వులకు తెలిసేమాటలేవి? చెప్పండి" అని సవాలు చేశారు. పండితులు తెల్లముఖం వేయవలసి వచ్చింది.

వీరేశలింగంగారు తమ అవసాన కాలంలో 1918 లో గిడుగు ప్రతిపాదించిన వ్యవహార భాషావాదాన్ని అంగీకరించారు. వ్యవహార భాషా ప్రచారక సంఘాన్ని, తాము అధ్యక్షులుగా వుండి స్థాపించారు. కాని తరువాత వీరేశలింగంగారు కొలది మాసాల్లోనే మరణించుటచేత యీ సంఘం పని చేయలేదు.

మూడుకోట్ల తెలుగు ప్రజలు చదువుకోవాలంటే, విజ్ఞానం పొందాలంటే వ్యవహారిక భాషలో పాఠ్యగ్రంథాల రచన అవసరమని గిడుగు రామమూర్తిగారు ఎలుగెత్తి చాటారు.

"సంఘంలో నిరక్షర కుక్షులు ఎక్కువగా ఉన్నంత కాలము సంఘం వృద్ధిలోకి రాదు. సభ్యతన్నది సంఘంలోని భాగ్యవంతులూ, పెద్దలూ, సామాన్య ప్రజలతో పాటు సమానులుగా అనుభవించవలసినదే కాని, తా మొక్కరే అనుభవించవలసినది కాదు. ప్రజలలో విద్య వ్యాపిస్తే కాని సంఘం వృద్ధిలోనికి రాదు."

గిడుగు వాదాన్ని ఆచరణలోపెట్టి, చక్కని రచనలు సృష్టించి ప్రజల మన్ననలను పొందిన మహాకవి గురజాడ అప్పారావుగారు వ్యవహార భాషలో "కన్యాశుల్కం" లాంటి గొప్పనాటకాలు కొన్ని వ్రాశారు దానికి దీటైన నాటకం యింతవరకు రాలేదనే చెప్పాలి.

నీలగిరి పాటలు, ముత్యాలసరాలు అనే పాటలు మాత్రం ఛందస్సులో వ్రాశారు. ముత్యాలసరాలలో అప్పారావుగారు వాడిన భాష మాధుర్యం, జాతీయత, తెనుగుదనం కలది. మాటలు తూచితూచి వాడినట్లు కనబడతాయి. కన్యక, పూర్ణమ్మ, లవణరాజుకల వగైరా కథలను ముత్యాల సరాలలో వ్రాశారు.

వీటన్నిటినీ మించినది అప్పారావుగారి "దేశభక్తి" అనే గేయం. దాని ఒక్కొక్క పాదం నిజంగా ఒక్కొక్క ముత్యంవంటిది. ఈ గేయం ఒక్కటి చాలు అప్పారావుగారిని అమరజీవిని చేయడానికి. భారతదేశంలో అనేక జాతీయ గీతాలు వచ్చాయి. కాని వాటిలో దేనికీ అప్పారావుగారి గీతంలోని భావగాంభీర్యం లేదు. బంకించంద్రుని 'వందేమాతరం' గాని రవీంద్రుని 'జనగణమన' గాని, ఇక్బాల్ 'హిందుస్థాన్ హమారా' గాని 'దేశమును ప్రేమించుమన్నా' గీతానికి ఏ మాత్రం పోలికకు రాలేవు.

అప్పారావుగారు జాతీయవాదులను ఎలా హెచ్చరించుతున్నారో చూడండి :

"దేశాభిమానం నాకు కద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్

పూని ఏదైనాను ఒక మేల్
కూర్చి జనులకు చూపవోయ్"

పూర్వుల గొప్పతనం చెప్పుకొని సంతృప్తి పడవద్దంటూ ఏమన్నారో చూడండి :

"వెనుక చూచిన కార్యమేమోయ్
మంచి గతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగేయ్
వెనుకబడితే వెనుకెనోయ్"

దేశాభివృద్ధిని ఆయన ఎలా కాంక్షించుతున్నారో చూడండి :

"పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్
తిండి కలిగితే కండ కలదోయ్
కండ కలవాడేను మనిషోయ్ !
యీసురోమని మనుషులుంటే
దేశమే గతి బాగుపడునోయ్
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నింపవలెనోయ్"

అప్పారావుగారు పెట్టుబడిదారీ నాగరికతలోని బలహీనతను చూశారు. ఓర్వలేమి పనికిరాదని చెబుతూ యిలా హెచ్చరించుతున్నారు :

"స్వంత లాభం కొంత మానుకు
పొరుగువాడికి తోడు పడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్"
ఐకమత్యంగా వుండమని కోరుతూ—
"అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్"

అంటున్నారు.

మానవుల కష్టంనుంచే సర్వమూ ఉత్పత్తి అవుతూందని ఎంత చక్కగా చెబుతారో చూడండి :

"నరుల చెమటను తడిసి మూలం
ధనం, పంటలు పండవలెనోయ్"

అప్పారావుగారు తెలుగు ప్రజలకు యిచ్చిపోయిన యీ జాతీయ గీతం నిజముగా మహా భాగ్యం. అది వ్రాసి ఇప్పటికి దాదాపు 36 ఏళ్ళు గడిచినా కొత్తదనం ఏమీ పోలేదు.

గిడుగు, గురజాడల వ్యావహారిక భాషావాదం ప్రజలలో వ్యాపించింది. నేడు పత్రికలు, రచయితలు వ్యావహారిక భాషలోనే ఎక్కువగా వ్రాసున్నారు. ఆంధ్రసాహిత్య పరిషత్తు, విశ్వవిద్యాలయం మాత్రం తమ మొండి పట్టుదల వీడలేదు. పిల్లలు చదువుకునే పుస్తకాలు గ్రాంధిక భాషలో వుండి సత్వర విద్యావ్యాప్తికి ఆటంకంగా వున్నాయి. కాని ప్రజలకు సంబంధించినంతవరకు గిడుగు జయించాడు.

గిడుగువారి వ్యావహారిక భాషావాదం అభ్యుదయకరమైనది. ఆంధ్రభాషను వ్యాకరణ పండితుల సంకెళ్ళనుంచి విముక్తిచేసి జీవద్భాషగా చేయడానికి జరిగిన మహత్తర కృషి. గురజాడ అప్పారావుగారు పై భావాలనే 'కన్యాశుల్కం', 'ముత్యాల సరాలు' రూపంలో చిత్రించిన మహా శిల్పి.

## జాతీయవాదం

పెట్టుబడిదారీ నాగరికతను చూసి ఉత్తేజం పొందిన మన దేశభక్తుల, రచయితల ఆశలు నెరవేరలేదు. మన ఆర్థిక జీవితం పెంపొందలేదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పోటీకి నిలవలేక పసిప్రాయంలోవున్న మన పరిశ్రమలు దివాళా తీశాయి. పాశ్చాత్య నాగరికత చూపిన ఆశారేఖలు సన్నగిల్లాయి. ప్రపంచాన్ని యుద్ధమనే మారణహోమంలోకి సామ్రాజ్యవాదులు నెట్టుకుపోయారు.

దీనితో మన నాయకుల చూపు మన ప్రాచీనౌన్నత్యం వైపు మరలింది. మన రచయితలు- బానిసలం కాకముందు మనం బ్రతికివున్న రోజుల నుండీ, చరిత్ర లోతుల నుండీ ఉత్సాహాన్ని పొందసాగారు. ఇది 1905 వందేమాతరం రోజులలోనే రాజకీయంగా వ్యక్తిగత హింసావాదంగాను, తిలక్‌గారి తీవ్ర జాతీయవాదం గాను ప్రారంభమయింది. వీటి పలుకుబడి మన తెలుగు సాహిత్యం పైన కూడ స్పష్టంగా కనబడుతుంది.

ఉదాహరణకు రాయప్రోలు సుబ్బారావుగారి ప్రబోధం చూడండి:

"వేదశాఖలు- పెరిగెనిచ్చట
ఆదికావ్యము- అందెనిచ్చట
బాదరాయణ- పరమ ఋషులకు
పాదుసుమ్మిది చెల్లెలా!
"విపిన బంధుర - వృక్షవాటిక
ఉపనిషన్మధు- వొలికెనిచ్చట
విపులతత్వము- విస్తరించిన
విమల తలమిదె తమ్ముడా!
"పాండవేయుల- పదునుకత్తులు
మండి మెరసిన- మహిత రణకథ"
"లోకమంతకు- కాకపెట్టిన
కాకతీయుల- కదనపాండితి"

చేర్చి పాడమని రాయప్రోలు కోరుతున్నాడు. దీనిలో మన పాత చరిత్ర నుంచి మన ప్రజలలో ఆత్మ విశ్వాసం, గర్వం, ఉత్సాహం పెంపొందించే ప్రయత్నముంది. కాని అప్పారావుగారివలే మనలోని లోట్లను సవరించుకొని "పాడిపంటలు పొంగిపొర్లే దారిలో నువు పాటుపడవోయ్" అనే ఉద్బోధ లేదు.

ఇలాంటిదే విశ్వనాథ సత్యనారాయణగారి 'ఆంధ్రప్రశస్తి-ఆంధ్ర పౌరుషము' కూడ. ఐనప్పటికీ ఆ కాలంలో పెట్టుబడిదారీ నాగరికత

మొదల వుండే భ్రమలు తొలగి పోతున్నాయి. పరిపాలకులతో పోరాడి దేశ స్వాతంత్ర్యం సాధించాలనే తీవ్ర జాతీయోద్యమం బయలుదేరింది. ఆ సమయంలో పాత చరిత్ర నుంచి ఉత్సాహం పొందడం సహజమే. అందుచే యీ రచనలు కూడ అభ్యుదయకర మైనవే.

కాని దానితో పాటు జమీందారీ యుగపు సాంప్రదాయాల వైపు వెనుకచూపు లేకపోలేదు. దేశ గర్వంతోపాటు హిందూజాతీయదురహం కారపు చిహ్నాలు లేకపోలేదు. ఇవి పెరిగి పెద్దవి అగుటవల్లనే తరువాత రాయప్రోలు, విశ్వనాధగార్లు జమీందారీయుగపు ఛాందసాలన్నిటినీ సమర్ధించుతూ, అభ్యుదయానికే వ్యతిరేకించేవారుగా తయారయ్యారు.

ఈ పోకడలో వున్న లోటులను పసిగట్టియే ప్రజా కవి గురజాడ అప్పారావుగారు జాతీయవాదులను యిలా హెచ్చరించారు :

"వెనుకచూచిన కార్యమేమోయ్
మంచి గతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగేయ్
వెనుకపడితే వెనుకేనోయ్"

## 1920 సహాయ నిరాకరణోద్యమం

గాంధీమహాత్మునినాయకత్వాన జరిగిన సహాయ నిరాకరణోద్యమం 1920 లో తెలుగుదేశాన్ని ఉత్తేజపరచింది. ప్రజలలో బయలుదేరిన ఉద్వేగం మన సాహిత్యంలోకూడ ప్రతిబింబించింది.

"దండాలు – దండాలు భరతమాత" అనేపాట, "మాకొద్దీ తెల్ల దొరతనం" అనేపాట గరిమెళ్ళ సత్యనారాయణగారు వ్రాశారు. ఇవి గ్రామ గ్రామాన తెలుగుదేశమంతటా ప్రతిధ్వనించాయి. బ్రిటిష్ ప్రభుత్వంపై ద్వేషాగ్ని రగుల్కొల్పి ప్రజలను స్వాతంత్ర్య పోరాటంవైపు మరల్చడానికి యిలాంటి పాటలు ఎంతో తోడ్పడినాయి. నిజంగా యివి, బసవరాజు అప్పారావుగారి పాటలు 'మా గాంధి' వగైరాకూడ ఎంతో

అభ్యుదయకరమైన పాత్రను వహించాయి. కాని వీటిలోకూడ జాతీయ వాదులలోవున్న లోటు (పూర్వ చరిత్రను తలచి గర్వపడుతూ, లోటులను తెలిసికో నిరాకరించుట) మాత్రం వుంది.

ఈ దశలో వ్రాయబడిన రచనలలో వేలూరి శివరామశాస్త్రిగారి 'అహో బలీయం' అను నవల నా దృష్టిలో చాల ముఖ్యమైనది. ఆయన అప్పటి జాతీయ ఉద్యమంలోని గొప్పతనాన్ని, లోపాలను కూడ సహజంగా చిత్రించారు.

"ఓబయ్య అనే చదువుకున్న యువకుడు కాంగ్రెసువాది అవుతాడు. గ్రామంలో జాతీయ పాఠశాలపెట్టి బీదలకు చదువు చెబుతాడు. పోస్టాఫీస్, కోఆపరేటివ్ సొసైటీ పెట్టించుతాడు. రోడ్డు వేయించుతాడు. బ్రహ్మచర్యం అవలంబించి చిన్నతనంలోనే పెండ్లాడిన భార్యను కాపురానికి తీసుకురాడు. క్రమంగా ఓబయ్య నిర్మాణ కార్యక్రమం అంతా సరియైన పునాదులు లేక కూలిపోసాగింది. ఉత్తరాలు వేసేవారు తగినంత మందిలేక పోస్టాఫీస్ రద్దవుతుంది.అప్పులుతీర్చలేక కోఆపరేటివ్ సొసైటీ దివాలా తీస్తుంది. పిల్లలు సరిగారాక జాతీయ పాఠశాల మూలబడుతుంది. కాని ఓబయ్య కృషి కేవలం వృధాగా పోలేదు. గ్రామంలో కొంపలకు నిప్పంటుకున్నప్పుడు ఓబయ్య శిష్యులంతా మంటలను ఆర్పడానికి సైనికులవలె సుశిక్షణతో పని చేస్తారు.గ్రామంలో ఇళ్ళు తగులబడిన వార్తను వైద్య పరీక్ష ప్యాసై ప్రాక్టీస్ చేస్తున్న ఓబయ్య భార్య వింటుంది. కొంపలు లేక అలాడుతున్న నిరాధారులకు సాయం పంపుతుంది."

ఈ కథనే "అహోబలీయం" లో వేలూరి శివరామశాస్త్రిగారు వాస్తవికంగా చిత్రించి నాటి తెలుగుదేశంలోని జాతీయోద్యమానికి సజీవమైన రూపమిచ్చారు.

ఈ దశలోనే వ్రాయబడిన ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' కూడ చెప్పదగినదే. రష్యన్ విప్లవపుఛాయలు, హిందూ వేదాంత ఛాయలు, అరాజకపు ఛాయలు మిశ్రితమైవున్నాయి. అడివి బాపిరాజుగారి 'నారాయణరావు' లో జమిందారీ సాంప్రదాయాలనుంచి పెకల్చుకొని

పెట్టుబడిదారీ నాగరికత ఎలా నెమ్మదిగా బయటపడుతూందో చూప బడింది. ఇవి నాటి తెలుగుదేశపు ప్రజాజీవితాన్ని చిత్రించుతున్న అభ్యు దయ రచనలు.

## భావ కవిత్వం

జాతీయోద్యమం ప్రబలుతూవున్న రోజులలోనే సాహితీసమితి వచ్చింది లిరిక్‌పొయిట్రీ - భావకవిత్వం తెలుగులో ప్రాయసాగారు. రాయప్రోలు సుబ్బారావుగారి రచనలు విశ్వనాధవారి కిన్నెరసాని పాటలు కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్షం వగైరా యీ రకానికి చెందినవే.

భాష, శబ్దమాధుర్యం. చేకూర్చడంలో యివి ముందజవేశాయి. చింతాదీక్షితులు గారి కథలు, నాటకాలు. పాటలు కూడా యీ పోకడకు చెందినవే. మృదువుగా తెనుగుతనం వుట్టిపడుతూ వుంటాయి.

భావాలకు సంబంధించినంతవరకు విశ్వనాథ, రాయప్రోలు, శివ శంకరశాస్త్రి. దీక్షితులుగారి రచనలది వెనుకచూపే, దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి రచనలలోని విషాదఛాయలుకూడా నాటి మన తెలుగు దేశపుదీన స్థితిని తెలుపుతాయి. కృష్ణశాస్త్రిగారు బ్రహ్మసమాజకులైన ఆర్. వేంకట రత్నం, వీరేశలింగం గార్లకును శిష్యులు. వారి గురువులు, తాముకూడా ఆశించిన నూతనాంధ్ర జాతి యింకా రాలేదు. సంస్కారం జాతీయ వాదం పేర వెనుకచూపు పట్టింది. కృష్ణపక్షంలో శాస్త్రిగా రేమంటారో చూడండి :

"అంత లజ్జా విషాద దురంత భార
వహనమున కోర్వలేని యీ పాడుబ్రతుకు
వంగిపోవును మఱిమఱి క్రుంగిపోవు
లోతెఱంగని పాతాళ లోకమునకు ;
"మీరు మనసారగా నేడ్వనీరు నన్ను
నన్ను విడువుడు; ఒకసారి నన్ను విడిచి
నంత నేకాంత యవని కాభ్యంతరమున

వెక్కి వెక్కి రోదింతును - విసువు లేక
విరతిలేక దుర్భరశోక విషమగీతు
లేడ్చిపైతు; ఎలుంగెత్తి యేడ్చిపైతు."

## తిరుగుబాటులు - అరాచక మార్గాలు

మొదటి ప్రపంచ సంగ్రామం తరువాత పాశ్చాత్య దేశాలలో యుద్ధానికి దారితీసిన పెట్టుబడి నాగరికత యెడల ఏవగింపు బయలు దేరింది. పాత సాంప్రదాయాలు, నియమాలుఉల్లంఘించే కొత్తపోకడలు వచ్చాయి. సాహిత్య రంగంలో కూడ యీ పోకడలు ప్రతిబింబించాయి. డాడాయిజం, క్యూబిజం, ఇంప్రెషనిజం, సర్రియలిజం వగైరా యీ రకానికి చెందినవే. ఛందస్సు నియమాలను రైమ్స్‌ను పాటించకపోవడం బ్లాంక్‌వర్స్ వ్రాయడం, ఊహలో కొచ్చిన తలపులను యధాతధంగా చిత్రించడం యీ పోకడల ప్రత్యేకత.

భారతదేశంలో జాతీయోద్యమం ఫలితంగా పెట్టుబడిదారీ నాగరికతపై ఏవగింపువల్ల జమీందారీయుగపు సాంప్రదాయాలవైపు చూపు మరలింది. అందుచే పై పోకడలు అంతగా దిగుమతికాలేదు. కాని జాతీయోద్యమం మన సంస్కారాన్ని ముందుకు తీసుకుపోనందున, వెనుకచూపుకు మరలినందున యిచటకూడ కొన్ని తిరుగుబాటులు, అరాచకపోకడలు వచ్చాయి.

ఉదాహరణకు గుడిపాటి వెంకటచలంగారి రచనలు. వారు కూడా కృష్ణశాస్త్రిగారివలె బ్రహ్మసామాజికులు. వీరేశలింగంగారి శిష్యులు. వీరు చిన్నతనంలో ఆశించిన స్త్రీ స్వాతంత్ర్యం నూతన సంస్కారం వ్యాప్తి చెందలేదు. కృష్ణశాస్త్రిగారి విషాదగీతాలలో నిస్పృహద్యోతకమయితే, చలంగారి రచనలలో కేవలం తిరుగుబాటుతత్వం స్పష్టంగా కన్పించుతుంది.

చలంగారు ముఖ్యంగా స్త్రీలు మన సమాజంలో అనుభవించుతున్న కష్టనిష్టురాలను వాస్తవికంగా చిత్రించుతారు. సజీవమైన వ్యావహారికభాష

వాడుతారు. వీరి కథలకు నవలలకు అన్నిటికి దాదాపు యితివృత్తం స్త్రీ-పురుష సంబంధాలు, పూర్వ శృంఖలాలను బ్రద్దలుచేసి స్త్రీ తిరుగుబాటు చేయడమే అనేకరూపాలలో చలంగారు చిత్రించారు. కాని వీరేశలింగం గారివలె ఒక నిర్మాణాత్మకమైన మార్గాన్ని మహిళలకు చూపలేక పోయారు. 'బానిసగావుండొద్దు! తిరుగుబాటు చేయ్! ఇంట్లోనుంచి లేచిపో!' అని ధైర్యంగా బోధించారు. కాని యింట్లోనుంచి లేచి బజారున పడిన సోదరికి నేటి సమాజంలో గతి ఏమిటి? పెట్టుబడిదారీ నాగరికతలో తక్కిన అన్ని వస్తువుల మాదిరిగా అమ్ముడుకావడమే గదా! తద్వారా ఆమె యింకోరకపు బానిసత్వంలోకి దిగజారి చివికిపోవడమే గదా! ఈ విషమావస్థనుంచి తప్పించుకునే మార్గాన్ని చలం రచనలు ఏమాత్రం సూచించవు. అదే వాటిలోని అరాజకత్వం.

భాష, రచనా నైపుణ్యం, శిల్పం దృష్టితోచూస్తే చలంగారి రచనలు తెలుగు సాహిత్యంలో కథలను ఒక కొత్తస్థాయికి తీసుకుపోయాయి.

## ఇతర తిరుగుబాటులు

జాతీయోద్యమం వెనుకచూపు పట్టిందనీ, నూతన సంస్కారాన్ని వ్యాపిజేసి నూతనాంధ్రజాతిని సృష్టించడంలో సాఫల్యం పొందలేదనీ యిదివరకే తెలియజేశాను. ఎప్పుడైతే ప్రధాన పోకడ వెనుక చూపుపట్టిందో అపుడే కొన్ని పాక్షిక తిరుగుబాటులుకూడ మొలకెత్తాయి.

త్రిపురనేని రామస్వామి చౌదరిగారి కురుక్షేత్ర సంగ్రామం, నూతపురాణం వగైరా రచనలు యిలాంటివే. వీరి భాష, కవిత్వ పోకడ చక్కగా వుంటుంది. హిందూసాంప్రదాయాలను, బ్రాహ్మణమతాన్ని నిరసించుతూ బయలుదేరిన వీరు రాజకీయంగా జమిందారీ నాయకత్వంలో వున్న జస్టిస్ పార్టీకి అనుబంధమై పోయారు. అందుచే ప్రజలను ఏమాత్రం ఉత్తేజపరచలేకపోయారు. వీరు వేనరాజు కథను 'ఖూనీ' అనే పేరుతో నాటకంగా అభ్యుదయకరమైన పోకడలతో చిత్రించారు. వీరి రచనలలో ఎన్నదగిన పాట "వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరో తెల్పుడు".

త్రిపురనేని రామస్వామిగారి 'శంబుక వధ', ముద్దుకృష్ణ గారి 'అశోకం', చలంగారి 'సావిత్రి' వగైరాల్లో, పురాణంగాథలనే తీసుకొని వాటిని కొత్తదృక్పథం నుంచి చిత్రిరిచారు. వెనుకటిగాథలను తీసుకొని కొత్త భావాలను ప్రచారం చేయడానికి వినియోగించడం యూరపులో రూసో, విక్టర్, హ్యూగోలాంటి వారుకూడా ప్రారంభంలో చేశారు. కాని వారు తరువాత అప్పటి ప్రజా జీవితాన్ని చిత్రించుతూ కొత్త పాత్రలను సన్నివేశాలను సృష్టించుకున్నారు. 'లేమిజరబుల్స్' లాంటి గొప్ప రచనలు చేయగలిగారు. కాని దురదృష్టవశాత్తు మన తిరుగుబాటుదారులు మన పురాణాలలోని మూఢ విశ్వాసాలను తొలగించడానికి కృషి చేశారే గాని కొత్తపాత్రలకు సృష్టించుతూ మహాకావ్యాలను వ్రాయలేకపోయారు.

అందుచే 'అశోకం', 'సావిత్రి' లాంటి రచనలు ప్రజలలోని ఛాందస భావాలకు వ్యతిరేకతను రెచ్చగొట్టాయే గాని, కొత్తదారి చూపలేకపోయాయి. అంతేగాక ప్రజలు మహా పతివ్రతలుగా గౌరవించే సావిత్రి, సీతవంటి పాత్రలకు యముడు. రావణులతో ప్రేమను సృష్టించడం ప్రజలను కొత్త సంస్కారంవైపు ఆకర్షించడానికి సరియైన మార్గముగాదు. గురజాడ అప్పారావుగారివల (కన్యాశుల్కంలో గిరీశం) కొత్త పాత్రలను వాస్తవికంగా సృష్టించగలిగితే తమ ఆశయాన్ని నెరవేర్చుకునేవారు.

## ఆంధ్రజాతీయ తిరుగుబాటు

మనం యింతవరకు పెట్టుబడిదారీ నాగరికతపై తిరుగుబాటు చూశాము. కుల హెచ్చుతగ్గులకు ఆస్కారమున్న హిందూ సంస్కారం పై తిరుగుబాటు చూశాము. జాతీయోద్యమంలో వచ్చిన వెనుక చూపులను గమనించాము.

భారత జాతీయోద్యమంలో ముఖ్యభాగమైన గాంధీజం పరిశ్రమలకు వ్యతిరేకం. హిందూస్థానీని జాతీయ భాషగా తెలుగుదేశంలో విరివిగా ప్రచారం చేస్తుంది. పరిశ్రమలే పెంపొందని తెలుగు దేశంలో వాటిని వద్దని ప్రచారం చేయడం, చేతిపరిశ్రమలను పట్టుకు'వ్రేలాడమని

ఉద్బోధించడం ఒక తిరుగుబాటుకు కారణమయింది. ఇది ముఖ్యంగా శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి రచనలలో కన్పించుతుంది.

శాస్త్రిగారు కథలు, నాటకాలు. నవలలు వ్రాశారు. వీరి రచనలలో తెలుగుదనం వుటిపడుతుంది. సంభాషణలు (కొట్టవచ్చినట్లు) పదునుగా వుంటాయి. హిందీ, తెలుగుకు అపచారం చేస్తుందనీ, వాటినుంచి లాభం పొందుతున్న గుజరాతీలు–మార్వాడీలు పరిశ్రమలు వద్దని ప్రచారం చేయడం. పరిశ్రమలేని తెలుగు 'దేశస్థులు' ఆ మాటలను వల్లించడం ఘోరమనీ ఉత్తర దేశవాసుల వేషభాషలు మనవాళ్ళు అనుకరించడంవల్ల తెనుగుతనానికి ఆంధ్ర జాతీయతకు నష్టం వాటిల్లుతూందని వారు ఎలుగెత్తి చాటుతున్నారు. సంఘసంస్కార ఆశయాలతో వితంతువుల కష్టాలను గురించిన కథలను శాస్త్రిగారు మొదట్లో వ్రాశారు. ఆంధ్ర జాతీయ వాదం భుజానవేసుకున్నాక శాస్త్రిగారు మన ప్రాచీన కళలను రక్షించాలనే ఆవేశంలో వేశ్యావాటికలను సమర్థించే స్థితికి దిగజారారు అందుచే శాస్త్రిగారి రచనలలో గాంధీజంలోని లోటులను సూచించినా, ఆంధ్ర జాతీయ అహంకారంకూడ ప్రస్ఫుట మవుతుంది.

విశ్వనాథ సత్యనారాయణగారు నూతన సాహిత్యారూపా లన్నిటిలోనూ రచనలు సాగించారు. పాటలు. పద్యాలు, కథలు, నవలలు వ్రాయటంలో చేయితిరిగిన దిట్ట. కాని ఆధునిక సాహిత్యరూపాలన్నిటినీ విశ్వనాథ సత్యనారాయణగారు వెనుకచూపుకే వినియోగించారు, 'వేయి పడగలు' అనే నవలలో వర్ణాశ్రమ ధర్మాలను జమీందారీ సమాజాన్ని, పునః ప్రతిష్ఠించాలనే భావంద్యోతక మవుతుంది. వీరేశలింగంగారు మొదలుకొని ఆంధ్రజాతి సాధించిన అభివృద్ధి ఉన్నత సంస్కారం కాదనీ, పూర్వమే ఔన్నత్యంగా వుండేవారమనీ అంటారు. పాశ్చాత్య నాగరికతకు అలవాటుపడి చెడుతున్నా మంటారు. ఆధునిక నాగరికత సరి కాదని ఋజువు చేయడానికి అసహజమైన సన్నివేశాలను కల్పించి 'చెలియలి కట్ట' అనే నవలను వ్రాసారు. వీరి రచనలను పరిశీలనా దృష్టితో చూసే వీరు మన నాగరికతను కరుడుగట్టిన జమిందారీ పంథా వైపు తీసుకుపోవాలని కోరుతున్నారనీ తేటతెల్లమవుతుంది. హిందూ జాతీయ దురహంకారం ప్రస్ఫుటమవుతుంది.

# నవ్య సాహిత్య పరిషత్తు

నవ్య సాహిత్య పరిషత్తువారు వ్యావహారిక భాషా వాదాన్ని ప్రచారం చేశారు వ్యావహారిక భాషలో రచనలు సాగించే వారికి ప్రోత్సాహమిచ్చారు. భాషను ప్రజల దగ్గరకు తీసుకుపోవడానికి కృషి చేశారు.

భావకవిత్వం (లిరిక్ పొయిట్రీ) లో కొన్ని కావ్యాలు వచ్చాయి. మధ్యతరగతి ప్రజా జీవితాన్ని ఆధారం చేసుకొని కథా వాఙ్మయం వచ్చింది. దువ్వూరి రామిరెడ్డిగారి 'కృషీవలుడు' 'కర్షకుడు' అనే కావ్యాలలో రైతుల జీవితాన్ని చిత్రించారు. నండూరి సుబ్బారావుగారి 'ఎంకి పాటలు' కూడా మధురంగా వ్రాయబడిన పాటలు, కాని వీటిలో పల్లెటూళ్ళను పాడి పంటలతో వర్ధిల్లే స్వర్గంగాను, రైతులను శాంతి సుఖాలనుభవించే వారిగాను చిత్రించారు. అంతేగాని, రైతుల కష్టనిష్టూరాలను పల్లెలలోని ఇబ్బందులను సహజంగా చిత్రించలేదు. బసవీల గందరగోళంతో బాధపడేవాడు. తన వూహల్లో పల్లెలు స్వర్గసీమలని చిత్రించుకునే భ్రమలేగాని వాస్తవిక చిత్రం కాదు. ఏమైనా రైతుల జీవితాన్ని సామాన్య ప్రజల జీవితాన్ని చిత్రించడానికి జరిగిన మొదటి అభ్యుదయకరమైన ప్రయత్నాలు అవి. జాషువాగారి గబ్బిలము, స్వప్నగాథ, కాందిశీకుడు అను కావ్యాలు కూడ అభ్యుదయకరమైన రచనలు.

జాతీయవాద యుగంలో ఆంధ్ర సాహిత్య రంగంలో ఒకముఖ్యమైన బలహీనత కన్పించుతుంది. ఈ యుగంలో పరిశ్రమలు, ఆర్థిక జీవితం కుంటుపడ్డాయని చెప్పాను. సాహిత్య రంగంలో కూడ పుస్తక ప్రకటన అమ్మకం విషయమై చెప్పుకోతగ్గ నిర్మాణాత్మకమైన కృషి జరుగలేదు. అంతకుపూర్వపు యుగంవారైనా వీరేశలింగం, చిలకమర్తి విజ్ఞానచంద్రిక వగైరా వారి పుస్తకాలు వేలకొలది అచ్చు అయ్యేవి. ఖర్చు అయ్యేవి. రచయితలకు భుక్తి గడిచేది, ఆదరణవుండేది. జాతీయవాద యుగంలో ఆంధ్ర సాహిత్యరంగంలో యిది పూర్తిగా దెబ్బతింది. వెయ్యిపుస్తకాలు అచ్చువేసి అమ్ముకోగలిగితే గొప్ప విశేషం. రచయితలు భుక్తికే అవస్థలు పడే స్థితిలో వున్నారు. సాహిత్యం ప్రజా సామా

న్యంలోకి విరివిగా వెళ్ల లేదు. దీనికి కొంత బాధ్యత కవులపై ,కూడా వుంది తమ రచనలను దర్జాగా అచ్చువేసి హెచ్చు ఖరీదులు పెడితేగాని అవి విలువైనవని ఎంచరనే భ్రమ వారికుంది. అందువలన రచయిత ఏమీ సంపాదించనూ లేదు. రచనలు ప్రజాసామాన్యంలోకి విరివిగా ప్రాకనూ లేదు.

జాతీయవాద యుగంలో మన సాహిత్యంలో యింకో వెలితికూడ కన్పించుతుంది. ఆంధ్ర ప్రజాజీవితాన్ని సహజంగాను, వాస్తవిక దృష్టితోను సమగ్రంగాను చిత్రించే నవలలు తగినన్ని రాలేదు. దీనివల్లనే పునర్వికాసయుగానికి ప్రజాయుగానికి మధ్య మన సాహిత్యంలో పెద్ద అఖాతం కనబడుతుంది.

ఉదాహరణకు బెంగాలీ, హిందీ సాహిత్యాలను పరికించండి. టాగోరు తరువాత జాతీయవాద యుగంలో శరశ్చంద్ర ఛటర్జీ బుద్ధదేవ బోసు మొదలైన వారు బెంగాలీ సాహిత్యాన్ని ఎంతో ముందుకు తీసుకుపోయారు.ఆవిధంగా వారు రాబోవు ప్రజాయుగానికి బలమైన పునాదులు వేశారు. అలాంటి పునాదులు ఆంధ్ర సాహిత్య రంగంలో మనకు కన్పించవు. ఆంధ్ర దేశంలో ఆర్థిక జీవితంలో వచ్చినలోటే ఆంధ్ర సాహిత్య రంగంలో కూడ ప్రతిబింబించింది.

## ప్ర జా యు గ ం

1930–35 మధ్యకాలం ప్రపంచమంతా ఆర్థిక సంక్షోభం ఆవరించింది. మొదటి ప్రపంచ సంగ్రామంలో పెట్టుబడిదారీ నాగరికతపై విశ్వాసం సడలిందని చెప్పాను. ఈ ఆర్థిక సంక్షోభంలో ఈ నాగరికతపైని నమ్మకమే పోయింది. ఆర్థిక సంక్షోభం, నిరుద్యోగ సమస్యలేని సోషలిస్టు ప్రపంచం (సోవియట్ యూనియన్) వైపు ప్రజలంతా చూడసాగారు.

మన ఆంధ్రదేశంలో 1930–33 శాసనోల్లంఘనోద్యమం విఫలమయింది. సత్యాగ్రహులుగా జైళ్ళకు పోయిన యువకులను ఉత్తరదేశ

విప్లవకారులతో సంబంధా లేర్పడ్డాయి. మార్క్సు, లెనిన్ రచనలను యూరోపియన్ ప్రజాసాహిత్యాన్ని-గోర్కీ, క్రొపాట్కిన్, ఎమిలీజోలా, హ్యూగో, దస్తవాస్కీ మొదలైన వారి రచనలను చదివారు. సోషలిస్టు భావాలతో బయటికి వచ్చారు, రైతుకూలీ ప్రజా ఉద్యమాల నిర్మాణానికి పూనుకున్నారు.

వీటి ప్రాబల్యం మన రచయితలపై ప్రతిబింబించింది. శ్రీరంగం శ్రీనివాసరావుగారు తన "మరో ప్రపంచం" గీతంతో ప్రజాసాహిత్యానికి నాందీ ప్రస్తావన చేశారు.

" మరో ప్రపంచం, మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది....
పదండి పోదాం వినబడలేదా
మరో ప్రపంచపు జలపాతం ?
కనపడలేదా మరో ప్రపంచపు
కణకణమండే త్రేతాగ్ని ?
ఎగిరి ఎగిరి పడుతున్నవి
ఎనభై లక్షల మేరువులు
తిరిగి తిరిగి తిరిగి సముద్రాల్
జలప్రళయ నాట్యం చేస్తున్నవి.
" సలసలకాగే చమురా ? కాదిది,
ఉష్ణరక్త కాసారం
శివసముద్రమూ నయాగరావలె
ఉరకండీ, ఉరకండీ ముందుకు !....

– మరో ప్రపంచం –

" బ్రతుకుకాలి పనికిమాలి
శనిదేవత రథచక్రపు
టిరుసులలో బడి నలిగిన
దీనులారా ! హీనులార !
కూడులేని గూడులేని

పక్షులార ! భిక్షులార !...
హతాశులై
ఏడువ కండేడువకండి !
మీ రక్తం కలగి కలగి
మీ ప్రేగులు కనలి కనలి....
ఏడువ కండేడువకండి !
వస్తున్నా యొస్తున్నాయి
జగన్నాథ రథచక్రా
లొస్తున్నా యొస్తున్నాయి...
సింహాచలం హిమాచలం
వింధ్యాచలం సంధ్యాచలం
మహానగా లెగురుతున్నాయి !
మహారథం కదులుతున్నది !

" అది విలయం
అది సమరం
అటో ఇటో తెగిపోతుంది!....

" స్వాతంత్ర్యం, సమభావం
సౌభ్రాత్రం, సౌహార్దం
పునాదులై యిళ్ళులేచి
జనావళికి శుభంపూచి
శాంతి శాంతి శాంతి శాంతి

—జగన్నాథ రథచక్రాలు—

వాసిరెడ్డి నాగేశ్వరరావు అను రైల్వే కార్మికునిచే వ్రాయబడిన "కూలోడ" పాట కష్టజీవు లందరిని ఉత్తేజ పరిచింది. అలాగే శెట్టిపల్లి వెంకటరత్నంగారి "ఆగునా జీవాలు సాగునా లోకాలు" గరిమెళ్ళ సత్యనారాయణగారి "అన్యాయ కాలంబు దాపురించిం దిపుడు అందరము మేలుకోవాలండి" లోకనాధంగారి "రైతుకూలీ లేకమైతే కూటికి తరుగేమిరా" రైతాంగాన్ని మేల్కొలిపాయి.

ప్రజావుద్యమాలనుంచి ఉత్సాహం పొందిన అనేకమంది యువక రచయితలు ముందుకు వస్తున్నారు. ప్రజల కష్టనిష్ఠురాలను తెలుపుతూ గీతాలు, గేయాలు వ్రాస్తున్నారు. ప్రజలు వాటిని విరివిగా చదువుతున్నారు. పుస్తక ప్రచురణకూడ మరల క్రమంగా ఎక్కువయే సూచనలు కనబడుతున్నాయి.

1939లో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమయింది. ప్రపంచానికి ఫాసిస్టుప్రమాదం వచ్చింది. జపానువాళ్ళు మనదేశంలో విశాఖపట్నం, కాకినాడలపై బాంబులువేశారు. బెంగాలు కరువు వార్తలు, రాయలసీమ, విశాఖ కరువు దృశ్యాలు ప్రజాసేవకుల హృదయాలను కరిగించాయి. గేయాలు, పాటలు, నాటకాలు వగైరా బయలుదేరాయి. ప్రాచీన ఆంధ్ర కళారూపాలన్నిటిని పునరుద్ధరించడానికి ప్రయత్నాలు జరిగాయి. నామమాత్రంగా వున్న బుర్రకథలు, జముకుల కథ, వీధి భాగోతాలను పునరుద్ధరించారు. ప్రస్తుత సమస్యలను తీసికొని రచన సాగుతుంది. గాయకులు, వైజ్ఞానికదళాలు వీటిని ప్రజలకు ప్రదర్శించుతున్నారు. వీటినిచూచి లక్షలకొలది తెలుగుప్రజలు ఉత్తేజం పొందుతున్నారు. కొనకళ్ళ వెంకటరత్నం, నాజర్, సుంకర సత్యనారాయణ కోగంటి గోపాలకృష్ణయ్య మొదలైనవారు వ్రాసిన రచనలను ప్రదర్శనాలను ప్రజలు ఆదరించుతున్నారు.

"తొలిమబ్బు మెరసెరా తొలకరి కురిసెరా !
దుక్కులు దున్నవేమిరా రైతా, రైతా !
నడుము బిగించరా నాగలి పట్టరా
సాగును మొదలుపెట్టరా ! రైతా, రైతా ;"
— కోగంటి

కరువు వచ్చింది. గ్రామజీవితం విచ్ఛిన్నమయిపోయింది. తమ ఇళ్ళనూ వాకిళ్ళనూ విడిచి,కుటుంబాలకు కుటుంబాలు తిండికోసం పట్నాలకెగబ్రాకారు. ఈ దృశ్యాన్ని కవి ఎలా వర్ణిస్తున్నాడో చూడండి !

"వెళ్ళిపోదామా ? మామ
వెళ్ళిపోదమ పట్నావాసపు

కుళ్ళు వీధుల లోబడి -
ఈన మోపైపున్న పైరులు
ఏటిమునక్కల పాలుజేసి
కొంప గోడీ విడిచి పట్టెడు
కూటికై పూరేగవలెరా....
ఒడలు పెంచిన గడ్డమీదే
ఓరిగిపోయ్యే రాత లేదో !
ఊరుగాని ఊరులో చితి
పేర్చుకొమ్మని నుదుటి వ్రాలో !...."

—కొనకళ్ళ వెంకటరత్నం

ఈనాడు మన ప్రజల కర్తవ్యాన్నిగురించి కవి చేస్తున్న ప్రబోధం చూడండి :

"చేయెత్తి జైకొట్టు తెలుగోడా !
గతమెంతో ఘనకీర్తి గలవోడా !
సాటిలేనిజాతి ఓటమెరుగని జాతి
నివురుగప్పి నేడు నిదురపోతుండాది
జైకొట్టి మేల్కొల్పు తెలుగోడా !
గతమెంతో ఘనకీర్తి గలవోడా !

—శ్రీకృష్ణ

కవి ప్రకృతిలో లీనమైపోతున్నాడు. ప్రకృతికూడా ప్రజాసేవ చేస్తున్నది. చూడండి పంటచేను రైతుతో చెబుతుంది.

"పచ్చపచ్చగ పెరిగి పండి ఒరిగున్నాను
ప్రజకు నన్నందిచరావా, ఓరైత,
ప్రళయమౌ కరువాపలేవా ?"

—సుంకర సత్యనారాయణ

# అధి వాస్తవికత

క్రిందటి యుద్ధానంతరం వచ్చిన అరాచక పోకడలలో సర్రియలిజం ఒకటని యిదివరకే చెప్పాను. సర్రియలిస్టులు పెట్టుబడిదారీ నాగరికతపై ఏవగింపువల్ల పూర్వ నియమాలన్నిటినీ తోసివేశారు. యూరపులో వీరు ఏ నియమాలూ లేని బ్లాంక్‌వర్సు వ్రాయసాగారు. తమకు తోచిన భావాలను ఒక క్రమంలో వుంచడానికి కూడ ప్రయత్నించక పోవడమే అధి వాస్తవికతని వీరివాదన.

తెలుగుదేశంలో శ్రీరంగం శ్రీనివాసరావు, నారాయణ బాబుగార్లు అధివాస్తవిక రచనలుసాగించారు. కాని యివి ప్రజామోదాన్నిపొందడం లేదు. "మరో ప్రపంచం"లాంటి శ్రీశ్రీ గేయాలను మెచ్చుకొన్నప్రజలే ఆ శ్రీశ్రీ వ్రాసిన అధివాస్తవిక రచనలను మెచ్చుకోవడంలేదు. వాటి భావాలేమిటో నాకుకూడా బోధపడలేదు.

అధివాస్తవికత పేరుతో మళ్ళీ భావరహితమైన శబ్దాడంబరంకొరకు ప్రయత్నాలు - డ్రిల్లు - జరుగుతున్నాయి. ఉదాహరణకు చూడండి -

తురాయి కంటే
ఆకురాయి కంటే
కీచురాయి కంటే
హిమాంశురాయి గొప్పవాడు

మన మనస్సులో అనేక ఆలోచనలు పుడుతుంటాయి. వాటి కొక క్రమముండదు; నియమంగానూ ఉండవు. కాని మనము ఆ భావాలను బయటకి చెప్పము.మాట్లాడవలసి వస్తే మన ఆలోచనలను క్రమపద్ధతిలో పెడతాము. వ్రాయవలసివస్తే యింకా బాగా సరిదిద్దుకుంటాము. బుర్రలోకి వచ్చిన ఆలోచన లన్నిటినీ మాట్లాడినా, వ్రాసినా మతిపోయిందని ఆక్షేపించుతారు.

అల్లాగే అధి వాస్తవిక రచయితలు కూడ తమ భావాలను ఒక క్రమ పద్ధతిని పంస్కరించుకోవాలి. పాతనియమాలు పనికిరావనుకుంటే

గురజాడ అప్పారావుగారు 'ముత్యాలసరాలు' అను కొత్త మాత్రాచందస్సును సృష్టించుకొన్నట్లే వారుకూడా తాము కొత్త రకపు నియమాలను రైమ్సు సృష్టించుకోవచ్చు. ఉదాహరణకు :

యూరపులో మొదట్లో సర్రియలిస్టులు బ్లాంకువర్సులో మాత్రమే రాసేవారు. లిరిక్ పొయిట్రీ రాయడంకూడ సంకెళ్ళకు కట్టుబడటమే అనుకునేవారు. కాని వారిలో చాలమంది ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో ప్రజలను ఉద్బోధించవలసి వచ్చేటప్పటికి లిరిక్స్ రాయవలసి వచ్చింది. పాత అభిప్రాయాలను మార్చుకొని గేయాలను రాస్తున్నారు. మనతెలుగు దేశంలోని సర్రియలిస్టు మిత్రులుకూడ అనుభవాన్ని బట్టి ప్రజామోదాన్ని పొందే రచనలను పూనుకుంటారని ఆశించుతాను.

## రచయితల కళోపాసకుల కర్తవ్యం

పూర్వకాలంలో పండితులు పురాణాన్ని చదివి అర్థంచెప్పి, ప్రజాసామాన్యానికి విజ్ఞానాన్ని ఎలా అందజేసేవారో అలా ఇపుడు కళోపాసకులు బుర్రకథలు, జముకల కథలు, నాటికలు, నాటకాలు. సమిష్టిగానాలు వగైరా ప్రదర్శనలద్వారా ప్రజలకు సాహిత్యాన్ని అందజేస్తున్నారు.

ప్రజాపుద్యమాలనుంచి వచ్చిన రచయితలకు జీవితానుభవంవుంది. కాని సాహిత్య విజ్ఞానం తగినంతలేదు. అందుచేత నూతన రచయితలు వ్రాస్తున్నవాటిలో వున్న లోపాలను సరిదిద్దటానికి అనుభవజ్ఞులు సాయం చేయాలి! ప్రజా జీవితాన్ని చిత్రించే గేయాలను, బుర్రకథలను, హరికథలను వ్రాసే బాధ్యత అభ్యుదయ రచయితలది. వాటిని ప్రదర్శనల ద్వారా ప్రజలలోకి తీసుకుపోయి ప్రజావిజ్ఞానాన్ని అభివృద్ధిచేసే బాధ్యత కళోపాసకులది.

తెలుగు ప్రజలలో నూటికి 15 మంది మాత్రమే నేటికీ చదువగలరు. రాయలసీమలోనూ, తెలంగాణాలోనూ యింకా వెనుకబడి వున్నారు. ఇంకా ప్రజలలో కులమత భేదాలు, మూఢ విశ్వాసాలు

వున్నాయి. నవ్యాంధ్ర జాతీయ వికాసానికి మూలపురుష లయిన వీరేశ లింగంగారు తమ అంతిమ సందేశంలో యిలా కోరారు. "అజ్ఞానంలో, అమాయకత్వంలో జీవిత సంస్కారంలేని ప్రజాసామాన్యానికి విద్య, విజ్ఞానం, సమానత్వం, సంస్కారము కలిగించడానికి కృషి చేయాలని కోరుతున్నాను" అన్నారు.

మనందరి ఆశయమదే. అందుకొరకు రచయితలు, కళోపాస కులు, మేధావులు కృషిచేయాలి.

ఆంధ్రప్రజా జీవితాన్ని వాస్తవికదృష్టితో చిత్రించే నవలలు తగినన్ని మనకులేవు. అభ్యుదయ రచయితలు అందుకు కృషిచేయాలి.

తెలుగు జాతీయ కళారూపాలను పునరుద్ధరించడానికి, నూతన కళారూపాలను రూపొందించడానికి, తీర్చిదిద్దుకోడానికి గాయకులు, చిత్రకారులు, నటులు, నర్తకులు వగైరా కళాకారు లందరూ దీక్ష వహించాలి.

అపుడే జాతీయ వికాసాన్ని, సంస్కృతిని పెంపొందించుకో గలుగుతాము. నూతనాంధ్రజాతిని బలవత్తరం చేసుకో గలుగుతాము.

(1948 అక్టోబరులో ప్రకటితమైన అభ్యుదయ సంచిక 1 నుంచి]

# తెలుగు తల్లి హృదయావేదనలు

1946లో ఆంధ్రజాతి మాతృభూమిలో భాగమైన తెలంగాణములో రజాకార్ల దుండగాలు ప్రారంభమయ్యాయి. ఆకునూరు, మాచిరెడ్డిపల్లి గ్రామాలలో భర్తలను చెట్లకు కట్టి ఆడపడుచులను నైజాం పోలీసులు అవమానించారు. ఈ అమానుష చర్యలకు తెలుగు ప్రజా హృదయం దద్దరిల్లింది. ఆంధ్రజాతి అంతా ఏకకంఠంతో రాక్షస చర్యలను ఖండించింది.

నాటినుంచి నేటికి ఐదేండ్లకు పైగా గడచిపోయాయి. ఈ కాలం ఆంధ్రజాతి జీవితంలో చరిత్రాత్మకమైనది. నైజాం నవాబు ముష్కర పాలనకు వ్యతిరేకంగా తెలంగాణా రైతాంగం వీరోచితంగా పోరాడింది. వీర తెలంగాణాకు శాయశక్తుల తోడ్పడటానికి ఆంధ్ర ప్రజానీకం కృషి చేసింది. నైజాం నవాబును రక్షించడానికి పూనుకున్న ప్రతీఘాతక శక్తులతో ఢీకొని వేలకొలది ప్రజలు నేలకొరిగారు. తెలుగు వీరుల రక్తంతో ఆంధ్రభూమి పునీతమయింది మన ప్రజల త్యాగాలతోనూ, మన వీరుల రక్తంతోను నవ్యాంధ్ర జాతి చరిత్ర నిర్మించబడుతున్న కాలమిది.

తెలుగుతల్లి హృదయ వేదనలను, ప్రజల వీర గాథలను చిత్రించుతూ రచనలు వ్రాయడానికి, వ్రాసినవాటిని ప్రకటించడానికి అనేక ఇబ్బందులు వున్నాయి. ఐనప్పటికీ అనేక పాటలు, గీతాలు, జానపదాలు బుర్రకథలు వగైరా మన కవులచే రచింపబడ్డాయి. ప్రజాసామాన్యంలో నుంచి అనేకమంది కొత్త కవులు ఉత్పన్నమయ్యారు.

"ఖబడ్దార్, ఖబడ్దార్ నైజాం పాదుషాహే"

అంటూ ఆంధ్రజాతి శత్రువయిన నైజాం నవాబును హెచ్చరిక చేస్తూ సోమసుందర్ వ్రాసిన పాట మన చెవులలో యింకా ప్రతిధ్వనించుతూవుంది. సుంకర సత్యనారాయణ వ్రాసిన సీతారామరాజు బుర్రకథ గ్రామగ్రామాన ఆంధ్రపుత్రుని వీరగాథను వినిపించి ప్రజానీకంలో జాతీయాభిమానాన్ని నూరిపోసింది.

సుంకర, వాసిరెడ్డి భాస్కరరావులు రచించిన "మా భూమి" నాటకం తెలంగాణా రైతులు భూమికొరకు సాగించిన విప్లవ పోరాటాన్ని చిత్రించి, ముక్కోటి ఆంధ్ర ప్రజల మెప్పును బడసింది. ప్రజాశక్తుల విజృంభణను వీరోచిత పోరాటాలను వర్ణించుతూ 1948 వరకు అనేక పాటలు, గీతాలు, కథలు రచింపబడ్డాయి. అనేక మంది ప్రజాకవులు సాహిత్య రంగంలో ప్రవేశించి సూటిగా జీవిత సమస్యలను తమ రచనలలో ప్రతిబింబించ సాగారు.

ఇంతలో నైజాం నవాబుతో లాలూచి అయిన ఇండియా ప్రభుత్వం తెలంగాణా రైతాంగానికి తోడ్పడుతున్న ఆంధ్రప్రజానీక మంతటిపైనా దమననీతి ప్రారంభించింది. సుంకర, వాసిరెడ్డిలాంటి కవులను, నాజర్ మాచినేనిలాంటి గాయకులను సైతం హింసించడం ప్రారంభించింది. నైజాం - నెహ్రూల మిలాఖత్ వలన తెలుగుభూమి యంతటా మధ్య యుగపు రాక్షస పరిపాలన అమల్లోకి వచ్చింది.

తెలంగాణాలోని అజ్ఞాత కవి ఒకరు అప్పటి పరిస్థితులను ఎలా వర్ణించారో వినండి.

"వద్దురా మనకొద్దురా రైతన్నా, కాంగ్రెసు రాజ్యం
వద్దురా అసలొద్దు కూలన్నా ।
గద్దె లెక్కియు ప్రజల నణచగ
రద్ది పేరుతో దాడిజేతురు ॥వద్దురా॥

రక్కసుడు నైజాం రాజన్నా
రజాకార్ల పంపి హత్యలకు దిగెనన్నా
మొక్కవోని ధైర్యముతో మనమొక్కపై నైజాం
కుక్కలా నెదిరించుతుంటే
నెహ్రూ ప్రభువన్నా నవాబు కండగను
సేనలను పంపి సాయపడె నన్నా

॥వద్దురా॥

ఈ విషయాన్నే తెలంగాణ రైతాంగంలో ప్రచారంలో వున్న మరొకపాట ఎలా చిత్రించుతుందో చూడండి.

ప్రజల రాబందవల్లె పీడించు నైజాము
పాపిపాలన నిలుపబయలు దేరింది॥
కుళ్ళి గబ్బెక్కియు కూలిపోతున్నట్టి
జమిందారీ పద్ధతికి జీవగడ్డదిరా
ఆంగ్రెజులోవున్న కాంగ్రెసు సర్కారు
మేడిపండురబాబు మేకవన్నె మొకము॥

## ప్రజాకవిత్వం

ఈ పాటలు గెరిల్లా ప్రాంతాలలో ప్రత్యక్షంగా ప్రజలతో పాటు ఇడుములు పడుతూవున్న ప్రజాకవులు సూటిగా వ్రాసినవి. ఈ కవులలో కొందరికి చదువైనా సరిగా రాదు. ఐనప్పటికీ ప్రజా హృదయాన్ని సూటిగా ప్రతిబింబింప గలిగారు.

"నైజాం సర్కారోడ! నా కొడకా" అంటూ తెలంగాణా గ్రామాలలో మార్మోగిన పాట చాలా పత్రికలలో యిదివరకే ప్రకటించబడింది. ఈ ప్రజాకవుల విశిష్టత ఏమంటే వీరు ప్రజలనుద్దేశించి వారి శత్రువులను ఉద్దేశించి సూటిగా చెప్పుతారు :

తేనెపూసిన కత్తి నెహ్రూరయ్యా
తెలిసింది నీరూపు నెహ్రూరయ్యా"

అని పాడుతూంటే సైన్యాల దుర్మార్గాన్ని ప్రత్యక్షంగా అనుభవించుతున్న ప్రజాహృదయం ఎలా వుప్పొంగుతుందో వేరుగా చెప్పాలా? ఇంకోపాటలో ఒక అజ్ఞాతకవి కాంగ్రెసును వుద్దేశించి యిలా అంటున్నాడు.

" తెలిసింది తెలిసింది అసలైన రూపు
తెలిసింది కాంగ్రెసు సిసలైనరూపు "
తిండి దొంగలబట్టి చెండుతానన్నావు
ధనిక దోపిడిదార్ల తరుముతానన్నావు
దున్నేవాడిదే భూమి అన్నావు ఆనాడు
గద్దెక్కి మాగొంతు కొయకవచ్చావా ?
ఆవుతోలు తొడిగినావా ఓ పులిమామా ! !"

మీ రంగు తెలిసిపోయింది సుమా ? అని తెలుపుతూ ప్రజాకవి కాంగ్రెసు ప్రభుత్వాన్ని వుద్దేశించి ఏమంటున్నాడో వినండి ?

" నీ బంధువర్గాల నిజరూపుగన్నాము
నీ చిలుక పలుకలా మోసాన్ని విన్నాము
భయములేదోయి మాకు బహురూపు గారిడీ
వినవోయి తుదిమాట ధనజాతి పెన్నిధీ "

మోసాన్ని తెలిసికొని చైతన్యవంతులైన ప్రజాసామాన్యం దుర్మార్గాన్ని యింక సహించరని తేటతెల్లం చేస్తున్నాడు:-

" పొట్టగాలే పేదల పుట పగిలిందోయ్
పెనుబాముపై చలి చీమ లెగబడ్డాయ్
తెలుగు ప్రజలంత తెగించి నిలచారు
" తెస్తాము స్వర్గాన్ని తెస్తాము విశాలాంధ్ర
దేశసౌఖ్యంపు రాజ్యాన్ని చూస్తామోయ్."

అని ప్రజలపై పూర్తి నమ్మకంతో, భవిష్యత్తుపై సంపూర్ణమైన విశ్వాసంతో ప్రజాకవి ఎలుగెత్తి చాటుతున్నాడు. తెలంగాణా ప్రజల ఆత్మ విశ్వాసాన్ని తెలిపే మరోపాట వినండి.



శ్రీ చంద్రం, శ్రీమతి పుష్పావతి

" తెలుగుతల్లి బిడ్డలం - తెలంగాణ వీరులం
మాతృదేశ ముక్తికోరకు పోరుసల్ప కదిలినాం
వెట్టి పనులు కట్టిపెట్టి జబర్దస్తీ నెగురగొట్టి
స్వేచ్ఛగాను బ్రతుకుకొరకు ఐక్యమై నిలచెదాం"
తరతరాలనుండి మేము సాగుచేయు భూమినంత
లాగుకున్న దేశముఖుల సాగనంప దలచినాం
తెల్లదొరల పెద్దతొత్తు ఘనుడనే ప్రభువునంచు
పంపుగాక మిలటరీని - చంపలేదు మాదుశక్తి
కరకు నిజాంతోను కలసి - కటికి దొరలునాడు
చీల్చినారు తెలుగుభూమి - చేర్చవలెను ఒకటిగా."

ఈ పాటలో తెలంగాణా ప్రజల తక్షణాశయం వ్యక్తమవడమే గాక "చీల్చినారు తెలుగుభూమి - చేర్చవలెను ఒకటిగా" అనే పదంలో ఆంధ్ర జాతీయ వాంఛను సూటిగా తెలుపుతోంది. జాతీయ కర్తవ్యాన్ని ప్రబోధిస్తోంది.

## సింబాలిజం — (అన్యాపదేశం)

ఐతే ఆరోజుల్లో గెరిల్లా ప్రాంతంలోని ప్రజాకవులు సూటిగా చెప్పినట్లుగా ఇతరచోట్ల వున్న కవులకు ప్రజా హృదయాన్ని సూటిగా వ్యక్తీకరించడం సాధ్యపడదు. ప్రజావెల్లువతో ప్రత్యక్ష సంబంధం లేక పోవడం ఒకచిక్కు. సూటిగా వ్రాస్తే ప్రకటించే అవకాశం వుండదనే బాధ. ప్రభుత్వం నిషేదించుతుందనే భయం మరొకవైపు రచయితలను చికాకు పరుస్తుంది. అందుచేత అన్యాపదేశంగా వ్రాసే పద్ధతిని (సింబాలిజం) చాలమంది కవులు అవలంబించారు.

ఆరుద్ర వ్రాసిన "త్వమేవాహం"అలాంటిదే.ఐతే యీ కావ్యంలో "ఆరుద్ర" విపరీత శీపులు, డొంకతిరుగుడు పద్ధతులు అవలంబించి నందున సామాన్యులకు అర్థంగాకుండా పోయినప్పటికీ ఈ కావ్యంలో కూడ ప్రజలను ఉత్సాహపరచే కొన్ని ఘట్టాలు వున్నాయి.

'పర్వదళ' అనే గేయంలో 1948–50 నాటి తెలంగాణా పరిస్థితులను దృష్టిలో వుంచుకొని యిలా ఆవేదన వెల్లడించారు.

" బ్రెయిన్‌లో బ్రెన్‌గన్
రెయిన్‌లా ఆలోచనల ట్రెయిన్
స్పయినల్ కార్డులో స్ప్రెయిన్
గ్లూమీ తిమిరాలు చెరిషించి
సైతాన్ మనల్ని పరిషించునపుడు
నిర్వేదనా పవనాలు వర్షించు
సింతటిక్ చింతను ధరించుకవి "

ఈ రచనలో అన్యభాషాపదాలు ఎక్కువగా వుండటం వల్లను, మెలికలు తిరిగినమాటల్లో అన్యాపదేశంగా చెప్పినందువల్లనూ రచనలోని గాంభీర్యాన్ని సామాన్య తెలుగుపాఠకుడు పూర్తిగా అవగాహన చేసుకోలేడు. ఐనప్పటికీ "సైతాన్ మనల్ని పరిషించునపుడు, నిర్వేదనాపవనాలు వర్షించు, సింతటిక్ చింతను ధరించుకవి" అనే మాటలు పాఠకుని హృదయాన్ని కదలించుతాయనడంలో సందేహం లేదు.

" చెయిన్సులో మగాళ్లు
చెరచబడ్డ ఆడవాళ్ళు
చెదపురుగులు
మదమెక్కిన సోల్జర్లు "

అని ఆ రోజుల్లో తెలుగుదేశంలో జరుగుతున్న దారుణకృత్యాలను ఏవగించుకుంటాడు రచయిత. పెట్టుబడిదారీ సమాజంలోని అవకతవకలను గురించి వ్యంగ్యధోరణిలో ఆరుద్ర యిలా వ్యాఖ్యానించాడు:–

"విదేశ వ్యవహారాలశాఖ
పాత్రికేయుల ప్రశ్నాపరంపరలనుంచి
సురక్షితంగా తప్పించుకొని
తనలో తాను
తర్జన భర్జనలు చేస్తుంది

పుకారుల భారీపరిశ్రమ మీద
అధికలాభాల పన్ను అక్రమమనే
వాణిజ్యసంస్థల రాయబారం
విజయవంత మవుతుంది
అబద్ధాల అమ్మకాన్ని ప్రభుత్వాలు
జాతిపరం చేస్తాయి."

మహాకచోట యిలా ఆవేదన వెల్లడించుతాడు :-

"నువ్వు ఎక్కదలచుకొన్న రైలు
ఎపుడూ ఒక జీవితకాలం లేటు
ఏళ్లూ పూళ్లూ నిరీక్షించలేక
ఎక్కేస్తావేదో ఒకబండి."
"నువ్వు వెళ్ళదలచుకొన్న ఊరు
నువ్వు బతికుండగా చేరదారైలు
దేవుడా! ఇంతచేశావా అని
ఉన్నఊళ్లోనే ఉండు" (26 పేజీ).

అని రచయిత నిరాశను వ్యక్తపరుస్తాడు. మహాకచోట ప్రజలు పొందిన ఆశాభంగాన్ని ఎంత నిశితంగా రచయిత వర్ణించగలిగారో చూడండి!

"ఈ గొంగళీని చూసి
మేజిక్ తివాసీ అనుకున్నాం
ఎగరడం మాట అటుంచి
ఏమాత్రం కదల్లేనా కదల్దు" (40 పేజీ).

"ఈ కొడిగట్టిన గుడ్డిదీపం చూసి
అమరజ్యోతి అనుకొన్నాం
అల్లాఉద్దీన్ స్వర్గాలటుంచి
అంగుళం మేరయినా వెల్గదు

ఈ అద్దం కళాయి
వెలిసిపోయింది ఇంకేం చూపెడుతుంది" (41 పేజీ)

"వేదనాశకలం" అనే గేయంలో ఆరుద్ర—

"వీక్షించండి కనులారా
విశాలాంధ్ర జనులారా
ఏమిటనుకొన్నారు ప్రపంచం
మూర్తీభవించిన లంచం" (55 పేజీ)

అని ప్రజల నుద్దేశించి పలుకుతాడు. కటువుకాటకాలకు కారణాన్ని తెలుపుతూ రచయిత తెరలోనుంచి యిలా వినిపించుతాడు.

"దారుణం ఇది దారుణం మన ధారుణీప్రజ మారణం
కారణం ఒకటుందిలే ఇది కాదులే ఆ నివారణం
వారివారి సుఖాలకోసము వంతులాడెడి పెద్దలే
కారణం ధనదాహ భూతపు కాళ్లపట్టెడి మొద్దులే
నకనక లాడెడి ఆకలి తోడను నా పసితమ్ములు పాలకులన్
అకటకటా తమ ఆకలి తీర్చెడి అన్నము కోరిన నేరముచే
ప్రకటిత కోపులు పాపులు రాజులు పాపము మామక సోదరులన్
వికసిత తీక్షణ దృక్కుల కాల్చి వివేక విహీనత చూపెదరే" (56 పేజీ)

తమ దారిద్ర్యానికి కారణం తెలిసికొని చైతన్యం పొందిన జనత యిలా పలుకుతుంది.

"గుండెలో దిగులు కూకటి వేళ్ళన్
చెండుమీ చెడుపు చేసెడి వాళ్ళన్
నిండియున్న అవినీతిని చంపన్
చండభానునికి స్వాగతమయ్యా" (57 పేజీ)

జన సామాన్యం ఆశించే లక్ష్యానికి చిహ్నంగా రచయిత భరత వాక్యం యిలా చెబుతాడు.

"భూమిపయి దేవతల భూమి విహరించవలె
లేమిగల వారలకు కామితము పంచన్
ఆమని సదా అవని భామని వరించవలె
గ్రామములు సస్యముల హేమము ధరించన్
క్షామములు పోయి ధరక్షేమము వసించవలె
నీమనకి సుందరత కోమలత నించన్
దాములు నశించవలె ప్రేముడి హసించవలె
భూమి అల దేవతలు భూములను మించన్"

"ఆరుద్ర'' గాప తన అభిప్రాయాలను అన్యాపదేశంగా ఎలా వ్యక్తీకరించుతారో చూడండి :

"వీల్లే దిదుగో సామ్యం
ఖిల్లామనదే జగం
ఆవేదం అయితే
అల్లాకూడా స్వామ్యం
వీల్లేదయ్యా దొరా
కవీ ఇక రయితే''

తథాస్తు అనే గేయంతో ఆరుద్ర తమ కావ్యాన్ని ఇలా ముగించుతాడు :—

"ప్రజ భయపడ కూడదు
ఇల నిజం గెలుస్తుంది
కనుక నీతి వెలుస్తుంది
జరామరణాలిక కల
ధ్వజం కొన నిరంతరం సమధర్మం చూస్తాం''

"త్వమేవాఽహమ్'' కావ్యంలో ఆరుద్ర కలం చిత్రించిన కొన్ని ఉదాత్తమైన భావాలను పైన పుల్లేఖించాను. ఐతే ఈ పసిడి తునకలతో పాటు ఆ కావ్యంలో సామాన్య పాఠకునికి అర్థంకాని ముళ్ళపొదలెన్నో

వున్నాయి. చివరలో మాత్రం భవిష్యత్తుపై విశ్వాసాన్ని ధీమాగా వెల్లడించాడు.

## మార్చ్ ఆన్

''ఆరుద్ర''గారే మార్చ్ ఆన్ అనే పాటలో ప్రజలను సూటిగా ఉద్బోధించారు.

''ఏమర్రా బాధితులారా !
లేవర్రా బానిసలారా !
మీరే ఒకకట్టు కట్టితే
వీరే ఒకపట్టు పట్టితే
కొట్టేందుకు కొరడా లుండవు
పట్టేందుకు పగా లుండవు''

అని ప్రారంభించి స్తబ్ధత పనికిరాదని యిలా హెచ్చరింతున్నారు.

"నిట్టూర్పుల వంతెన మీదుగ
కష్టాలను దాటేకాలం
వెళిపోయిం దెళిపోయిందని
చాటర్రా ఏక గొంతుతో
శ్రమ ఘర్మ సలిలంపోసి
పండించిన సుఖాల పంటకు
కోతల మినహా అంతా
సిద్ధంగా వున్నాయర్రా"

అని ప్రోత్సహించుతారు. ఇంకా

"మన లక్ష్యాన్నందు కొందికి
ఆ స్వర్గం చేరేటందుకు
సంకెళ్ళను ఘటుక్కున తెంచి
నడవర్రా మానవులారా !"

అని ప్రజలను ఉద్బోధించుతున్నారు. ఈ పాటతో తిక్కిరిబిక్కిరి "సింబాలిజం"లోనుంచి రచయిత మార్చ్ ఆన్" అవుతారని అందరం ఆశించుదాం.

## భగ్నశాంతి

"భగ్నశాంతి" అనే రూపకంలో ఇండియా సైన్యాలు ప్రవేశించాక తెలంగాణా పరిస్థితులను చక్కగా చిత్రించారు దాశరధిగారు. వీరు కూడా "సింబాలిజం" ఫక్కీని వాడినా రచన సులభంగా అవగాహన అవుతుంది. తెలంగాణానే అన్యాపదేశంగా "శాంతి" అనే స్త్రీగా చిత్రించుతారు.

"గన్ను" అనే సైనికుణ్నిచూసి భయంతో

"వాడుపోయి వీడెవ్వడు ?
వీడు హాయిగా నవ్వడు
వీడు మరోదుంపగీడు
లేక మరో కొత్తకీడు !"

అని "శాంతి" ఆక్రోసించుతుంది. "గన్ను" ప్రవేశించి యిలా అంటాడు :-

"నిన్ను కాపాడుట - కై వచ్చితిరా, పాడుట
కాపాడుట కల్లాడుట-కోపిల్లా ! ఏల వెనుకాడుట ?
''నీ శత్రువును త్రుంచి-నిన్నుగట్టిగా రక్షించి
నీకోసం స్వర్గందించి తెచ్చాను; మ్రోయించు విపంచి
నీవిప్పుడు నా దానివి-చూస్తే ఫరవాలేదు రవి"

కల్లబొల్లి కబుర్లుచెప్పి ''శాంతిని'' మభ్యపెట్టాలని సైనికుడు ప్రయత్నించుతాడు. ఆమె తటపటాయించితే ''గన్ను'' తన పశుప్రవృత్తిని కనబరుస్తూ-

"నీవు ఇలా తప్పించుకుంటే
నీమెళ్ళో బంగారుకంటె
నీకింకా దక్కబోదు
నాది అది, నీది కాదు."

అని బెదిరించుతాడు. భయపడుతున్న "శాంతిని" ఆదరించుతూ–

"వాడి మాటలు కావు నిజం
రానేరాదు సోషలిజం
అది నిజంగా విరిగిన భుజం"
"వెనక్కిపోతావే గజం గజం
నీకూ తెలుసు నా రొమాన్సు!
చేస్తావుటే నీవు డాన్సు?

ఆహ్వానించాడు. జంతువువలె "గన్ను" "శాంతి"మెడికి పట్టు గెత్తుతాడు. తెరవెనుక సంగీతంలాగా జాతిజెండా పాటను కవి అనిపించుతాడు.

"శాంతి" బాధతో "అ....మ్మా" అని పిలుస్తుంది. భూమి (మన తెలుగు భూమే) "ఏం! తల్లీ!" అని పలకరించుతుంది.

"శాంతి :– నేతలంతా నేడు రాజులు
బూజు పూసిన పాతగాజులు

భూమి :– అవును, తల్లీ, అవును!

శాంతి :– రాక్షసులతో పోరు చేసి

రాజు పై తమ కత్తిదూసి
అసువు లొడ్డిన వీరులంతా
లేరు; నేనిక వీరి సొంతా?"

అని "శాంతి" ఆక్రోశించుతుంది. ఈ రూపకం అన్యాపదేశంగా వ్రాసినప్పటికి "శాంతి" నోట కవి పలికించిన యీ మాటలు 1949-50

నాటి తెలంగాణా నిజరూపాన్ని కండ్లకు కట్టినట్లు చూపుతాయి. శ్రోతల హృదయాలలో దుర్మార్గులపై ఏహ్యభావం. జాతీయాభిమానం వెల్లి విరుస్తుంది. రచయితకు అదొక గొప్ప విజయమేగదా ?

## విషాదాంధ్ర

మహాకవి శ్రీరంగం శ్రీనివాసరావుగారు వ్రాసిన ఈ పాట నిజంగా ఆంధ్రదేశంలో నాయకులని చెప్పుకునే వాళ్ళందరికి ఒక కొరడా దెబ్బలాంటిది.

''బాకాలు లాభంలేదు బాజాలు లాభంలేదు
ఎంత యీదినా ఏంఫాయిదా ఎక్కడా తీరం కనబడదు
తలమాత్రం మెదికుంచి నిలువీత ఈదుతున్నాం
గమనం పిసరూలేదు గమ్యం అసలేలేదు
అని హెచ్చరించారు.
''ఈ గొంగళీ వయస్సు ఇరవై అయిదేళ్లు
ఇంకా ఎక్కువేఅనుకో ఎవడుచూశాడు లెక్కలు
తీర్మానాలూ ఉపవాసాలూ చేశాం ఖద్దరూ కేకలు వేశాం
మోసుకొచ్చాం స్వరాజ్యమ్మూట మూటవిప్పితే ఏమీలేదు"

అని నాయకుల కుంటినడకను ఆక్షేపించుతూ ప్రస్తుతావస్థను యిలా వర్ణించారు.

''శిశువుపు దక్కని స్తన్యంలాగ ప్రవహిస్తున్నాయి గోదావరినీళ్లు
బదలైన గుండెలాగ బీటలువేశాయి పొలాలు
మన పరిశ్రమలు ప్రణాళికల్లో నే, మనప్రతిభ చాకిరీకి తాకట్టు
మనకో ఇల్లంటూలేదు రచ్చకెక్కి రాద్ధాంతాలు"

ఇలా ఆంధ్రజాతి విషాదావస్థను గుండెలు జలదరించేలాగ వర్ణించాక, కర్తవ్యాన్ని మరచిన నాయకులకు పౌరుషం కలిగించడానికి మహాకవి యిలా అపహాస్యం చేస్తున్నాడు.

"కొంగల్లారా జపంచేయండి పిల్లి పిఠించు మంత్రాలు
ఎలుకలారా సభ జరుపండి ఎవరు గంటకట్టాలని
ఇంకోమారు ఎగరవే నక్కా, ఈసారి అందవచ్చు ద్రాక్షపళ్లు
కోతీ తీసుకురా త్రాసు పంపకం తెగడంలేదు."

శ్రీశ్రీ కలంనుంచి వచ్చిన ఈ మాటలు ఆంధ్రాభిమానమున్న వారందరినీ కర్తవ్యోన్ముఖులుగా ప్రోత్సహించుతాయనడంలో సందేహం లేదు.

## భవిష్యత్తుపై విశ్వాసం

"తెలుగుతల్లి" అనే పాటలో శ్రీ. శ్రీ.

"అదెవో తెలుగు తల్లి
అందాల నిండు జాబిల్లి
ఆనందాల కల్పవల్లి
అదె నీ తెలుగు తల్లి"

అంటూ మాతృభూమిని వర్ణించుతారు. భవిష్యత్తుపై విశ్వాసాన్ని ఇలా విశదీకరించుతారు :-

"పదవోయి తెలుగువాడా
అదె నీ తెలుగు మేడా
సంకెళ్ళులేని నేల
సంతోష చంద్రశాల"

అని చెప్పి గమ్యస్థానంవైపు సందేహాలు వదిలి ముందుకు సాగిపొండని ప్రజలను శ్రీశ్రీ యిలా హెచ్చరించాడు :-

"ఆందోళనాల దోల
సందేహాల హిందోళ
ఎందాక వూగిసలాట
ఇదే నీ గులాబి తోట.

'' పదవోయి తెలుగుబాట
ఇదిగో తెలుగు కోట
పదవోయి నిర్భయంగా
పదవోయి దిగ్జయంగా
పదవోయి నిశ్చయంగా !

## ఆగస్టు 15

1947 ఆగస్టు నాటికి మౌంట్‌బాటెన్ - నెహ్రూ రాజీ ఫలితంగా వచ్చిన కాంగ్రెసు ప్రభుత్వం ప్రజాశ్రేయస్సు సాధించగలదని చాలా మంది భ్రమిశారు. జీవితానుభవం ద్వారా తెలంగాణా ప్రజానీకం ఏ విధంగా సత్యాన్ని తెలుసుకున్నారో తెలిపే పాటలు వ్యాసం మొదటి భాగంలో వుదహరించాను.

'' మూలపడి విరిగిన చరఖా
గాంధీజీ పేరు అనే బురఖా
ధరించి వచ్చిన యీ తారీఖు
మాచెడ్డ నిషాచేసే అరఖు ''

అంటూ ''ఆగస్టు స్వరాజ్యం'' బురఖాను ఆరుద్ర ఎత్తివేస్తాడు.

'' ఆగదే ఆకలితో పోరాటం
ఆరదే దహించే ఆరాటం
అశాంతి కోటిన్నర వోట్లులు
ఎక్కడ చూసినా రివోల్టులు
స్వేచ్ఛగా వీస్తుందా గాలి
నేడు మన ఖర్మంగాలి
మచ్చుకైనా లేవు పచ్చికబయళ్ళు
రెచ్చిపోయాయి గాని జైళ్ళు ''

అంటూ ప్రజల కష్టాలు, సంకెళ్ళు అలాగే వున్నాయని రచయిత నిరూపించుతాడు, ముక్తాయింపుగా :-

" కరిమింగింది వెలగపండు
కాదు కాదంటే పోనిండు
మన స్వతంత్రం మేడిపండు
మన దరిద్రం రాచపుండు "

అని ఆరుద్ర ముగించుతాడు. ఒండొరులకు కొన్నివందల మైళ్ళ దూరం అడ్డుగావున్న తెలంగాణాలోని ప్రజాకవి, మద్రాసులో వున్న ఆరుద్ర ఒకేభావాన్ని ఎలా వ్యక్తీకరించారో చూడండి.

"మేడిపండురా బాబు మేకవన్నె మెకము" అని తెలంగాణాలోని అజ్ఞాతకవి అన్నాడు.

మన స్వతంత్రం మేడిపండు
మన దరిద్రం రాచపుండు

అని ఆరుద్ర అన్నాడు. ఆంధ్ర ప్రజా హృదయంలో నుంచి వ్యక్తమవుతున్న ఒకే భావాన్ని ఇద్దరూ చక్కగా చిత్రించారు. రెండింటికి విశిష్టత వుంది. దేనికదే సాటి!

## కాంగ్రెసు రాజ్యంలో ప్రజాజీవితం

ప్రజాకవి సుంకరను వుద్దేశించిన "బహిరంగలేఖ" అనే పాటలో కాంగ్రెసు రాజ్యంలో ప్రజాజీవితాన్ని అన్యాపదేశంగా రమణారెడ్డి—

"జీవితం మసిపూసిన వదనం
జీవితం అఖండ భయసదనం
జీవితం గాలివీచని సాయంతనం"

అని వర్ణించాడు.

"జలగలమడుగే యిది
ఎవడయ్యా దిగుతాడు
జముని రాజ్యమే యిది

ఎవడయ్యా మనుతాడు
ఎవడయ్యా ఎవడయ్యా ఎవడు
సాహసిస్తాడు
శాపజలం ఆచమించిన
పాపిచేతు లు త్తరిస్తాడు
శాపవాక్కు ధ్వనించిన
కోపిగొంతు క త్తిరిస్తాడు"

అని శ్రీ రమణారెడ్డి నాడు తెలుగు భూమిలో జరుగుతున్న ఖూనీల యెడల తమ ఆక్రోశాన్ని వెల్లడించాడు. "సత్యం – శివం – సుందరం" అనే పాటలో అన్యాపదేశంగా అదే రచయిత యిలా అన్నారు:

"ఆరోపిస్తున్నాను నేను
ఈ నరహంతకుల మీద అభియోగం
అరదండాలు మాత్రమే చాలవు
మరణానికి మరణమే శిక్ష"

తిండి, బట్టల కరువుతో మాడిపోయే ప్రజానీకం తరఫున పాలక వర్గాన్ని ఉద్దేశించి రంధి సోమయాజి అనే రచయిత ఇలా అంటున్నారు:

" మా బ్రతుక్కి మెతుకే లేదని
మీ మహత్తుకు కుదుపేలేదని "
" మా మానాలకు గుడల్ లేవని
మీ వేషాలకు అడ్డుల్ లేవని "
" మా కుంటానికి గుడిసెల్లేవని
మీ భవనాలకు గుండెల్లేవని "
ఎరుగుదునోయ్ నే నెరుగుదును
" మా జీవాలకు మీ భావాల్లేవని
మీ భావాలకు మరి జీవాల్లేవని ॥ఎరుగు॥
" మా మార్గానికి మరణం లేదని
మీ వర్గానికి మార్గం లేదని

ఎరుగుదునోయ్
నే నెరుగుదును "

''ప్రత్యేక ప్రకటన'' అనే పాటలో సా. జోగిరాజు అనే రచయిత పాలకవర్గ ధోరణిని స్తోత్రం చేయించుతూ వ్యంగ్యంగా ''భజన పార్టీ'' చేత యిలా పాడించుతారు:

" ఎంతో జాగ్రత్తగా
మర్రిచెట్టు నీడలా
మనల నేక్షణాన మరువక
ఖద్దరు, అహింస, హిందీ
కావాల్సినంత సప్లయి చేస్తూ
ఆకలిదయ్యం మనలను
సోకకుండా కాపాడే
మన ప్రభుత్వం లాంటిది భువిలో
కనీవినీ ఎరుగం ఎన్నడు
రక్షరేకు జెండా వొక్కటి
వక్షానికి గుచ్చుకుంటే
ఎందుకిక మనకు భయం లేదుగా
కనులు మూయవచ్చు హాయిగా
ఖద్దరు, అహింస, హిందీ
ఖద్దరు, అహింస, హిందీ ,
ఏడువొకట్లా ఏడు ఊ, ఊ, ఊ, ఊ"

## ఝుం ఝూ సంగీతం

దాశరధి "ఝుం ఝూ సంగీతం" అనే వైతాళిక గానంలో—

"మనం వెనక్కి నడవం
జనం వెనక్కి నడవరు
జనం మనం మనం జనం

జనం లేంది మనం లేము
చల్లని చమురుంటేనే
జ్వాలావళి కీలావళి
ప్రజాబలం వుంటేనే
ప్రభుత్వాలు రాజ్యాలు
వ్యక్తులు పాలించే
శక్తి నశించింది నేడు
రక్తంలో అణువణువు
శక్తి గడించింది నేడు

అని ఉద్ఘోషించుతాడు. ఇంకా యిలా చెప్పుకుంటున్నాడు:-

"నాదిమేటి తెలంగాణము
ధర పలికిన మంచి మాగాణము"
"అది వ్యాపిస్తోంది తుఫాన్‌లా అంతట
దాన్ని అడ్డలేరు కొండంత వారు ఇంతట

"తెలంగాణము చల్లారని నీటి అగ్గి
దేవతలని దెయ్యాలని చేస్తుంది బుగ్గి

పాలకవర్గాన్ని రచయిత యిలా అడుగుతున్నాడు.

"జయఘంటలు కొట్టేవారలు
చూచారా నెత్తుటి చారలు
వనపతాక పట్టేవారలు
కన్నారా పీనుగు బారులు
వారే యే వర్గంవారో
వారెందుకు చేస్తున్నారో
తెలుసుకునే యోగంలేదా
తెలిసికూడ స్ఫురణకు రాదా"

అని ప్రశ్నించుతున్నారు. భవిష్యత్తుపై విశ్వాసాన్ని యిలా ప్రకటించుతున్నారు.

"ఇక వుడకవు మీ పప్పులు
మీ మెళ్ళో కడతాం చెప్పులు
ఒక చెప్పులుకుట్టే మోచీ
పెట్టాడోయ్ మీకొక పేచీ
ఇది పేదలు గెలిచేకాలం
బాంబుల్లో నేలకు రాలం
మాదే సముజ్వలమగు భావి
అదిగో ప్రాభాతికదేవి"

అన భవిష్యత్తులో విశ్వాసం తెలుపుతోపాటు దాశరధి వుదాత్తమైన భావాలను ఈ పాటలో తెలియజేశారు.

ఇదే భావాన్ని తెలంగాణా రైతాంగపోరాటంలో భాగస్వామి అయిన ఒక అజ్ఞాతకవి వెల్లడించిన పదాలను మళ్ళీ ఒకసారి గుర్తు చేసికుందాము.

"పొట్టగాలే పేదల పుట్ట పగిలిందోయ్
పెనుబాము పై చలిచీమ లెగబడ్డాయ్
తెలుగు ప్రజలంతా తెగించి నిలచారు
తెసాము స్వర్గాన్ని తెస్తాము విశాలాంధ్ర
దేశసౌఖ్యంపు రాజ్యాన్ని చూస్తామోయ్"

అదే విశ్వాసాన్ని శ్రీశ్రీ 'తెలుగు తల్లి' అనే పాటలో యిలా చాటారు. తిరిగి గుర్తు చేసుకుందాం.

"పదవోయి తెలుగువాడా
అదే నీ తెలుగు మేడా
సంకెళ్లు లేని నేల
సంతోష చంద్రశాల"

దేనికదే సాటి! వేర్వేరు మార్గాలలో తీవిగా ప్రజల హృదయాల లోని ఉద్వేగాన్ని, విశ్వాసాన్ని చక్కగా చిత్రించాయి. ధన్యవాదాలు రచయితలకు.

[1952 జనవరి 'సందేశం' సంచిక నుండి]

# తెలుగుదేశ సాంస్కృతిక పునరుజ్జీవనకు కమ్యూనిస్టు పార్టీ జరిపిన కృషిలో కామ్రేడ్ చంద్రంగారి ప్రముఖ పాత్ర

[ తెలుగు ప్రజల పురోభివృద్ధికి, సాంస్కృతిక పునరుజ్జీవనకు కమ్యూనిస్టుపార్టీ గావించిన కృషి, అందులోని పార్టీ నిర్మాతలలో ఒకరైన మద్దుకూరి చంద్రశేఖరరావు గారి ప్రముఖపాత్ర గురించి 1974 ఆగస్టు 22 వ తేదీన విశాలాంధ్ర కార్యాలయంలో జరిగిన సంస్మరణ సభలో భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ చండ్ర రాజేశ్వరరావుగారు చేసిన ప్రసంగం పూర్తి పాఠాన్ని దిగువ యిస్తున్నాం. ]

చంద్రంగారి చిత్రపటాన్ని ఆవిష్కరించుకుంటున్నాం. నేను మాత్రం ఆఖరుసారి ఆయనను చూడలేకపోయాను. ఇందులో పాల్గొన డానికి అవకాశం కలిగినందుకు నాకు ఎంతో సంతృప్తిగావుంది. చంద్రం గారి విషయం తెలిసినవారు చాలామంది వున్నారు. చంద్రంగారి సుదీర్ఘ మైన రాజకీయ జీవితంలో పరిచయం వున్నవారు చాలామంది వున్నారు. ఆయన గుణగణాల్ని చాలామంది తెలిసినవారున్నారు.

దాదాపు 40 సంవత్సరాల లోపుగా నాకు ఆయనతో పరిచయం ఉంది. 1937 నుండి వారి సహచరుడుగా వుంటూ వచ్చాను. మేమంతా రాష్ట్రకమిటీలో ఉన్నప్పటికీ వారిని మేమంతా పెద్దగా గౌరవిస్తూ ఉండే వాళ్ళం.

మన ఆంధ్రదేశంలో కమ్యూనిస్టుపార్టీకి పునాదిరాయి వేసినవారిలో వారొకరు. శ్రీ సుందరయ్య, శ్రీ కంభంపాటి సత్యనారాయణ, శ్రీ చలసాని వాసుదేవరావు మొదలగువారితో పాటు చంద్రంగారు కూడా మన ఆంధ్రదేసంలో కమ్యూనిస్టు ఉద్యమానికి పునాది వేశారు. అప్పటినుండి వారి జీవితాన్ని కమ్యూనిస్టు ఉద్యమానికి అంకితం చేశారు. నిస్వార్థంగా, నిరాడంబరంగా వారు సేవ చేశారు.

## జాతీయోద్యమ సాంప్రదాయాలు

కమ్యూనిస్టు ఉద్యమానికి వారు తీసుకొనివచ్చిన కొన్ని ప్రత్యేకతలున్నాయి. ముఖ్యంగా అనేకమంది యువకులు జాతీయోద్యమాలలో పాల్గొన్నవారు చాలామంది మన రాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమంలో ఉన్నారు. వారందరికీ కూడా జాతీయోద్యమంయొక్క మంచి సాంప్రదాయాలున్నందువల్ల, వారు స్వయంగా ఆకళింపు చేసుకున్నందువలన ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమంలోకి వాటన్నిటినీ తీసుకొని వచ్చారు. అదే విధంగా తెలంగాణా ప్రాంతాన్నుండి కూడా అక్కడ జాతీయోద్యమానికి నాయకత్వం వహించిన వారందరూ దాదాపు నూటికి 90 మంది కమ్యూనిస్టు ఉద్యమంలోకి వచ్చారు. శ్రీ నారాయణరెడ్డి. బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి, సర్వదేవభట్ల రామనాథం: దేవులపల్లి వెంకటేశ్వరరావు యిత్యాదులందరుకూడా జాతీయోద్యమం నుండి వచ్చినవారే. అయితే వీరందరూ కమ్యూనిస్టు ఉద్యమంలోకి 910 ప్రాంతాలలో వచ్చారు. కాని చంద్రంగారు 1934 ప్రాంతాలలోనే వచ్చారు.

## నవయుగ వైతాళికుల సుసంప్రదాయాలు

అదే విధంగా మన ఆంధ్రుల యొక్క సుసాంప్రదాయాలు ముఖ్యంగా నూతన యుగానికి వైతాళికులుగా ఉన్న వీరేశలింగం పంతులుగారు, గురజాడ అప్పారావుగారు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు గిడుగు రామమూర్తి పంతులుగారు మొదలైన వారంతా ఆంధ్రదేశంలో

ఆధునిక యుగానికి ప్రారంభోత్సవం చేశారు. వారి సుసాంప్రదాయాలను మన కమ్యూనిస్టు ఉద్యమంలోకి తీసుకురావడంలో చంద్రంగారు చాలా పెద్ద పాత్ర నిర్వహించారు. ఈ మాట నేను ఎందుకు చెబుతున్నానంటే తరువాత కమ్యూనిస్టు ఉద్యమంలో అనేకమైన ఘట్టాలు వచ్చాయి. ఒడుదుడుకులు కూడా వచ్చాయి. ఆ సందర్భంలో చంద్రంగారియొక్క ఈ అనుభవం, అంటే జాతీయోద్యమం యొక్క అనుభవం, జాతీయోద్యమాన్ని అర్థం చేసుకోవడంలో ఆంధ్రదేశంలో వున్న కమ్యూనిస్టు ఉద్యమానికి ఎంతో తోడ్పడ్డారు. అనేక ఘటనలు తరువాత వచ్చాయి.

## జాతీయ అంతర్జాతీయతలకు సమన్వయం

ఒకానొక సందర్భంలో మనదేశ ప్రయోజనాలు, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం యొక్క ప్రయోజనాలు వీటికీ మధ్య ఏదో వైరుధ్యం ఉన్నట్టు కనబడింది. కాని వాస్తవంగా అర్థం చేసుకుంటే వైరుధ్యం లేదు. కాని ఆ సందర్భాల్లో కమ్యూనిస్టు ఉద్యమం శైశవదశలో ఉన్నప్పుడు ఆ రెంటికీ వైరుధ్యం లేనటువంటి విషయం. అది సిద్ధాంత రూపంలో అయితే ఒప్పుకోవడం జరిగింది కాని: ఆచరణలో దాన్ని అన్వయించుకొనటంలో మాత్రం అనేక ఒడుదుడుకులు వచ్చాయి. సోవియట్‌పై పెద్ద నాజీ దాడి జరిగినప్పుడు: నాజీ సైన్యాలు చాలా ఉధృతంగా అనుకోని విధంగా మాస్కోపైపు పరుగులెత్తుకుంటూ వస్తూ వుంటే: అంటే దరిదాపు ఒక నెలలోనే మాస్కో దగ్గరకు వచ్చేసినపుడు అసలు సోవియట్ యూనియన్ ఉంటుందా ? పోతుందా ? అని అనిపించినప్పుడు ఆ సందర్భంలో కాంగ్రెస్‌లో ఉన్న జవహర్‌లాల్ నెహ్రూగారు అటువంటి ప్రముఖులు కాంగ్రెస్ ఉద్యమంలో అంతర్జాతీయతను, తరువాత ప్రజా స్వామ్య సంప్రదాయాలను, ఫాసిస్టు వ్యతిరేక సంప్రదాయాలను నెలకొల్పినటువంటి వారు చాలామంది బాధపడ్డారు. కాని కొంతమంది కాంగ్రెస్ నాయకులు మాత్రం చాలా ఉల్లాసంగా సోవియట్ యూనియన్ పోతుందంటే: ఏదో మంచి

జరుగుతున్నట్లుగానే అనుకొన్నారు. ఆనాడు యువకులుగా ఉన్న మేము అందుకు ఆగ్రహం చెందినమాట వాస్తవం.

సోవియట్ యూనియన్‌ను కాపాడాలి. మరో వైపున దేశ స్వాతంత్ర్యోద్యమాన్ని ముందుకు తీసుకుపోవాలి. ఈ రెండింటినీ సమన్వయం చేసుకోవడానికి మాకు కొంచెం కష్టమైంది. సరే. ఆ సందర్భంలో దీనిని సమన్వయం చేయడానికి చంద్రంగారు చాలా తోడ్పడ్డారు. మొత్తంమీద ఆంధ్ర యూనిట్‌లోని మేమందరమూ చంద్రంగారు చేసిన సమన్వయానికి ఒప్పుకున్నాం.

సరే ఎప్పుడైతే సుభాష్‌చంద్రబోసులాంటివారు, ఆయన స్వచ్ఛమైన జాతీయవాది, అందులో ఏమీ సందేహంలేదు. ఆయన హిట్లరును కలుసుకొన్న సందర్భంగా కూడా. మా దేశ స్వాతంత్ర్యం సంగతి ఏమిటని హిట్లరును అడిగితే ఆయన ఏమీ మాట్లాడకపోయేసరికి నీతో నాకు సంబంధంలేదనిచెప్పి తరువాత హిట్లరును వదిలివేసి ఆయన జపాన్ వెళ్ళడం, అక్కడకూడా ఇదేవిధంగా అడిగినప్పుడు జపాన్‌వాళ్ళు మాత్రం మీ స్వాతంత్ర్యం మీకు యిస్తామని ఒప్పుకొనడం జరిగింది. అయితే ఫాసిజం గెలిస్తే భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చేది కాదుగాని ఆయన మాత్రం వాళ్ళు యిస్తారనే నమ్మకంతో ఆనాడు ఆ పని చేశారు.

## పొరబడిన దేశభక్తుల పట్ల వైఖరి

సోవియట్ యూనియన్ జీవన్మరణ పోరాటంలో ఉన్నపుడు మరి మాకు జాతీయవాదులు వీరంతా వ్యతిరేకంగా ఉన్నపుడు మేము ఏమి చేయాలా అనే సమస్య ఏర్పడింది. శ్రీ కాట్రగడ్డ మధుసూదనరావుగారు మొ॥ పెద్దలు కొందరు మాకు సలహాలు చెప్పేవారు. ఇటువంటివారు చేసేది తప్పేగాని, వారిని పంచమాంగ దళం అని మాత్రం అనకూడదు అని వారు చెబుతూ ఉండేవారు. వారితో మేము ఒప్పుకొన్నాం. వారు పొరబడిన దేశభక్తులు. అంతే. అప్పుడు చంద్రంగారి యొక్క నాయకత్వాన మేము ఆ విధంగానే నిర్ణయానికి వచ్చాం. కాని

కేంద్రం నుండి వ్యాసాలు వేసు విధంగా మాకు వచ్చాయి. సుభాసు బోసు ఏంజటు అనీ, జయప్రకాశ్ నారాయణ్ మీదకూడా అదే విధంగా వ్యాసం వచ్చింది. కాని చంద్రంగారి సలహా ప్రకారం, ఆయన నాయకత్వం క్రింద ఈ వ్యాసాల్ని మేము ఆనాటి పార్టీ పత్రిక ప్రజాశక్తిలో ప్రచురించడానికి నిరాకరించాము. నిరాకరిస్తే అప్పుడు మమ్మల్ని అందర్నీ కేంద్రానికి పిలిచారు. మేము నలుగురం వెళ్ళాం. నేను, చంద్రంగారు, శ్రీ బసవ పున్నయ్య, శ్రీ కడియాల గోపాలరావు బొంబాయి వెళ్ళాం. తీరా మేము అక్కడకు వెళ్ళేసరికి హిందూ ముస్లిమ్ మత కలహాలు జరుగుతున్నాయి. అక్కడ అప్పుడు మాకు ఒక్కక్షణం ఉండబుద్ధి పుట్టలేదు. మా కళ్ళ ఎదురుగుండానే హత్యాకాండ జరుగుతూంటే ఏమీ చేయలేని పరిస్థితిలో యిక్కడ వుండటం అనవసరం, మన ప్రాంతానికి మనం వెళ్ళిపోదాం అనుకున్నాం.

పార్టీ కేంద్రంవారు చివరకు మాకు నిర్ణయం యిచ్చారు. దాని ప్రకారం ఒక వ్యాసం తరువాత మరొక వ్యాసం కేంద్రం వారు పంపిన విధంగా ప్రచురించాం. ముందు బోసుమీద వ్యాసం వేశాం. తరువాత జయప్రకాశ్ నారాయణ్ మీద వేశాం. తరువాత రంగా గారి మీద వేశాం. దానితో విజయవాడ వీధులు రణరంగంగా మారాయి. వాలంటీర్లను పెట్టుకొని మీటింగులు పెట్టుకోవలసిన పరిస్థితులు వచ్చాయి.

నాకు యిటువంటి వాటిలో అప్పుడు పెద్ద అనుభవంలేదు. కాని చంద్రంగారి నాయకత్వం క్రింద సుభాష్‌బోసు తదితరులను అట్లా అనడం పొరపాటని భావించాం. కాని దురదృష్టవశాత్తు మాకు ఆనాడు అంత తాహతులేదు. ఆ రకంగా ఒక ఘటన జరిగింది. ఇటువంటి ఘటనలు అనేకం ఉన్నాయి.

ఆనాడు బొంబాయినుండి మేము బయలుదేరే సమయానికి హిందూ ముస్లిం కలహాల్లో ఏ క్షణంలో ఎవరు పొడుస్తారా అన్న పరిస్థితి నలుగురు నాల్గు ప్రక్కల నుండి స్టేషన్‌కు వచ్చాం. స్టేషన్ ప్లాట్‌ఫారం మీద కూడా పొడుస్తున్నారు. అక్కడ ముస్లిములనుకూడా పొడుస్తున్నారు.

ఎందుకంటే అక్కడ ముస్లిములకు బలడలేదు. మేము పంచలు కట్టు కున్నాం కనుక మమ్మల్ని ఎవరూ ఏమీ అనలేదు.

## సాంస్కృతిక పునరుజ్జీవన : పార్టీ కృషి

ఆంధ్ర కమ్యూనిసు ఉద్యమానికి మొదటినుండి ఒక ప్రత్యేకత ఉంది. ఇతర రాష్ట్రాలలోలేదు. కేరళవంటి కొన్ని రాష్ట్రాలలో ఉంది. ఏమిటంటే భారత దేశంయొక్క నాగరికత గురించికాక ఆ రాష్ట్ర ప్రజలయొక్క నాగరికత, సంస్కృతి, సాహిత్యం మున్నగు వాటి పట్ల శ్రద్ధ తీసుకొనే విషయం, ఈ విషయంలో ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు ఉద్యమం మొదటినుండి శ్రద్ధ తీసుకుంది.

ఉదాహరణకు కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు మున్నగువారి గురించి అసలు అందరూ మర్చిపోయిన స్థితిలో ఏ కాలేజీ లోనైనా కందుకూరి వీరేశలింగంగారు ఎవరంటే ఎవరూ చెప్పలేని స్థితి ఏర్పడింది. నవయుగాంధ్ర వైతాళికుల రచనలను ఆ విధంగా పాతిపెట్టేయడం జరిగింది. 1943లో వారి రచనలన్నింటినీ బైటికి తీశాం. వీరేశలింగం పంతులుగారి జీవిత చరిత్ర, ప్రహసనాలు, వారి ఉత్తమ మైన నాటకాలు, తిరిగి బైటకు తీసుకొని వచ్చాం. అట్లాగే గురజాడ అప్పారావుగారి ముత్యాల సరాలు-వారి కన్యాశుల్కం అందరికి తెలుసు. కాని, ఆయన వ్రాసిన ముత్యాల సరాలు గురించి జనబాహుళ్యం అందరికీ తెలియదు. అయితే సాహితీవేత్తలకు తెలుసుననుకోండి వాటిని తీసిచూస్తే మాకందరికి చాలా ఆశ్చర్యంవేసింది. ఏవికమ్యూనిస్టుసిద్ధాంతా లని మేము అనుకుంటూ వచ్చామో అవి సూచనప్రాయంగా గురజాడ అప్పారావుగారు ముత్యాల సరాల్లో చక్కగా అందరికీ అర్థమయ్యేట్టు ఉన్నాయి. అవన్నీ మేము అచ్చువేస్తే ఆ రోజుల్లో కొన్ని వ్యాఖ్యానాలు కూడా వచ్చాయి. ఆ రోజుల్లో బహుశా జన్మభూమి అనుకుంటాను. ఆ పత్రికలో- "అసలు ఇవన్నీ అప్పారావుగారు వ్రాశారా ? ఆయన ఏవో కొన్ని వ్రాస్తే కమ్యూనిస్టులు వాళ్ళ యిష్టం వచ్చినట్లు ఇవన్నీ కల్పించి వ్రాశారు" అని వ్రాసి పడవేశారు.

## చిలకమర్తివారి స్వీయచరిత్ర ప్రచురణ

అదే విధంగా ఆ రోజుల్లో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు తమ వృద్ధాప్యంలో చాలా అవస్థలు పడుతున్న సమయంలో-తిండికి కూడా యిబ్బంది పడుతున్నప్పుడు, ఆయన స్వీయచరిత్ర ప్రచురించి, ఆయనకు ఆ రూపేణా ధనసహాయం చేయాలనుకున్నాం. కాని ఆయనకు ఎవరో "కమ్యూనిస్టులు చాలా దుర్మార్గులు, వాళ్లు అచ్చు వేసుకుంటారు. కాని, డబ్బు మాత్రం యివ్వరు" అని చెప్పారట. అందువలన ఆయన మొదట తన స్వీయచరిత్ర అచ్చు వేయడానికి యివ్వలేదు. అప్పుడు రాష్ట్ర కమిటీ తరపున వెళ్లి ఆయనకు వెయ్యిరూపాయలు యిచ్చి దానిని అచ్చువేసి ఆయనకు విజయవాడలో సన్మానం చేయటం జరిగింది.

తరువాత ఆయన ఆచరణలో కమ్యూనిస్టులు ఎటువంటివారో, ఎటువంటి నిజాయితీపరులో అర్థంచేసుకొని సన్మాన సభలో అనేక విషయాలు చెప్పారనుకోండి. నేను ఈ విషయం ఎందుకు చెబుతున్నానంటే ఆంధ్ర దేశానికి, ఆంధ్ర దేశం మంచికి, ఆంధ్ర ప్రజల సంస్కృతి మొదలైన వాటన్నింటికోసం కమ్యూనిస్టుపార్టీ చాలా త్యాగాలు చేసిందని నేను సగర్వంగా చెప్పుకోగల్గుతాను.

## తెలుగు ప్రజల సమైక్యత : విశాలాంధ్ర నినాదం

అసలు హైద్రాబాద్ తెలుగు పట్నం అనే విషయం చాలామందికి తెలియదు. తెలంగాణాలో 1940 లో కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభమైంది. అక్కడ జాతీయ ఉద్యమానికి నాయకత్వం వహించిన శ్రీ రావి నారాయణరెడ్డి, తదితరులంతా కమ్యూనిస్టు ఉద్యమంలోకి వచ్చారు. ఆంధ్ర సంస్కృతిని రక్షించే ఉద్యమంతో అక్కడ జాతీయోద్యమం ప్రారంభమైంది. కాని, రాజకీయోద్యమంతో కాదు. మేము తెలుగు చదువు

కుంటాం, తెలుగు మాట్లాడతాంఅన్న ఉద్యమంతో ముందు గ్రంథాలయా లతో ప్రారంభమైంది. కమ్యూనిస్టు పార్టీ కూడా ముందు గ్రంథాలయా లను పెట్టింది. ఆ రకంగా అక్కడ ఆంధ్ర మహాసభలో, గ్రంథాలయో ద్యమాలలో పాల్గొంటూ వచ్చాము.

"ఆంధ్రదేశం ఇంత ఉంది. హైద్రాబాద్ తెలుగు పట్నం. మద్రాసు కోసం మనం అవస్థ పడనక్కరలేదు. రాని దానికోసం మనం ఎగబ్రాకవలసిన పనిలేదు" అని మేము 1946 లోనే చెప్పాం. అందుకని విశాలాంధ్ర అనే నినాదం, విశాలాంధ్రలో ప్రజా రాజ్యం అనే నినాదం అప్పుడు యిచ్చాం. సుందరయ్యగారు అపుడు విశాలాంధ్రలో ప్రజారాజ్యం అనేది ఏ విధంగా ఉంటుంది ? దాని స్వరూప స్వభావాలు ఏమిటి ? దాని ఖనిజ సంపద ఏమిటి ? అనే దాన్ని గురించి ఒక పుస్తకం వ్రాశారు.

## "మా భూమి" చరిత్రాత్మక పాత్ర

నిజంగా ఆ పుస్తకం విశాలాంధ్ర ఉద్యమానికి, తరువాత మన పోరాటానికి కూడా చాలా సహాయం చేసింది. మా భూమి, తదితర నాటకాలు పెద్ద సాంస్కృతిక ఉద్యమాన్ని తీసుకొని వచ్చాయి. మా భూమి అనే నాటకం – తెలంగాణా పోరాటంలో చాలా పెద్ద పాత్ర నిర్వహించింది. శ్రీ సుంకర, వాసిరెడ్డి ఆ నాటకాన్ని వ్రాశారు. ఈ విధంగా ఆంధ్రదేశం యొక్క మంచి కోసం, ఆంధ్రదేశం యొక్క ఐక్యత కోసం ఆంధ్ర దేశం యొక్క సంస్కృతిని ముందుకు తీసుకురావడం కోసం కమ్యూనిస్టుపార్టీ ఆరోజు నుండి కృషిచేసింది. ఇటువంటి ప్రజా సాంప్రదాయాలు కొన్ని రాష్ట్రాల్లోని కమ్యూనిస్టు యూనిట్లకే ఉన్నాయి, కేరళలో కమ్యూనిస్టు పార్టీకి కూడా యిట్టి సంప్రదాయం వుంది.



శ్రీ చంద్రంగారి కుమార్తెలు మంజరి, రాగిణి

1484

నేను ఇంత దూరం చెప్పింది ఎందుకంటే, ఇందులో ఇతరులకు కూడా చాలా మందికి పాత్ర వున్నది. కాని కామ్రేడ్ చంద్రం గారు ఇందులో ప్రముఖమైన పాత్ర నిర్వహించారు.

ఆయనకు సాహిత్యంలో కూడా ప్రవేశం ఉండటంవలన, ఈ సాంప్రదాయాలు కూడా వారికి తెలియడంవలన ఆయన దీంట్లో చాలా పెద్ద పాత్ర నిర్వహించారు, ఈ విధంగా ఆయన ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమానికి ఈ రూపంగా చాలా ప్రత్యేకమైన సేవ చేశారు. తరువాత ఇంకా అనేక త్యాగాలు జరిగాయనుకోండి. తెలంగాణా పోరాటం జరిపాం. విశాలాంధ్ర ఆ విధంగా సాధించుకున్నాం.

## రాష్ట్ర సమైక్యతకోసం కమ్యూనిస్టుపార్టీ పోరాటం

అందుకనే చాలా మందికి అర్థంకాలేదు — ఏమిటి? రాష్ట్రం చీలి పోతుందనే ప్రమాదం ఏర్పడినప్పుడు కమ్యూనిస్టులు ఎందుకు అంత ఆందోళన చెందారు అని? ఎందుకంటే ఈ రాష్ట్రం ఏర్పరచడంలో విశాలాంధ్ర రాష్ట్రం ఏర్పరచడంలో, ఇతరులంతా ఉన్నారుకాని, కమ్యూనిస్టు ఉద్యమం ప్రముఖమైన పాత్ర నిర్వహించింది. ఆంధ్ర రాష్ట్రం కావాలని అందరూ అన్నప్పటికీ మద్రాసు రాజధాని కావాలి అన్న సమస్యపై తగవుపెట్టుకొని రాష్ట్రం రాకుండా చెడగొట్టుకుంటూ ఉండేవారు. మద్రాసు రాజధాని అన్న డిమాండు వదులుకుంటే తప్ప ప్రత్యేక రాష్ట్రం రాదు అనికమ్యూనిస్టుపార్టీ గట్టిగా చెప్పింది. ఇటు ప్రకాశం పంతులుగారిని, అటు రాయలసీమలో సంజీవరెడ్డి

గారిని కూడా వ్యతిరేకించి పోరాడి 11 జిల్లాల, మూడు తాలూకాలతో ఆంధ్ర రాష్ట్రం ఏర్పర్చడంలో కమ్యూనిస్టుపార్టీ ఆ విధంగా ప్రముఖ పాత్ర నిర్వహించింది. అందుచేతనే ఆ తరువాత రాష్ట్రం చీలి పోతుందనే పరిస్థితి ఏర్పడినప్పుడు కమ్యూనిస్టుపార్టీ ఇందుకు వ్యతి రేకంగా గట్టిగా నిలబడింది.

రాష్ట్ర సాధన కోసం కమ్యూనిస్టుపార్టీ ఇన్ని త్యాగాలు చేసింది కనుకనే ఆ విధంగా చేసింది. ఐక్యంగా ఉంచడానికి కూడా అనేక త్యాగాలు చేసింది. 1969 లో ప్రత్యేక తెలంగాణా ఉద్యమం వచ్చి నపుడు, ఆ ఉధృతాన్ని తట్టుకొని నిలబడింది. ఆంధ్ర ప్రాంతంలో వచ్చిన ఉద్యమాన్ని కూడా తట్టుకొని నిలబడవలసి వచ్చింది. అంటే దీనికి పునాది అంత లోతుగా ఉన్నదన్న మాట. దానిలో చంద్రంగారికి పెద్ద పాత్ర ఉంది.

## చండ్రంగారి ఆదర్శ గుణగణాలు

చంద్రంగారి గుణగణాల గురించి తెలిసిన వారు చాలామంది ఉన్నారు. ఆయన గురించిన స్మృతులు చాలా ఉన్నాయి. నేను కొన్నిటి గురించి మాత్రమే చెప్పాను. ఇంకా చాలా ఉన్నాయి.

లెనిన్ మహాశయుడు - ఆయన గుణగణాలు చాల గొప్పవి. ఆయన పెద్ద సిద్ధాంతవేత్త. అనేక క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొని ఆయన మహా విప్లవాన్ని చాకచాక్యంగా నడిపారు, సాధించారు. మన చంద్రంగారికి, అటువంటి అవకాశం దక్కక పోయినప్పటికి లెనిన్

గారి జీవితం గురించి ఏ గొప్ప గుణగణాలున్నాయని మనం చదువు కున్నామో చంద్రంగారిలో అటువంటి గుణగణాలన్నింటిని మేముచూడ గల్గాం (హర్షధ్వానాలు) ఇంత పెద్ద జీవితంలో ప్రతి వ్యక్తి ఏవోకొన్ని పొరపాట్లు చేస్తూనే ఉంటాడు. ఏ పొరపాట్లు చేయడని నేను అను కోను. చంద్రంగారు చనిపోయిన తరువాత, మరోసారి ఆయనతో నాకుగల 40 ఏళ్ళ సాహచర్య జీవితాన్ని ఒక్కసారి పరిశీలించి చూసి నప్పుడు, నాకు మాత్రం ఏదీ దొరకలేదు. మానవునికి అనేక అపేక్ష లుంటాయి. ఆ విధంగా ఉండటం తప్పుకాదు. కాని వాటిని సాధించ డానికి తప్పు పద్ధతులు అవలంబిస్తే మాత్రం అది తప్పు. ఈ 44 ఏళ్ళ సాహచర్య జీవితంలో ఆయనలో ఎటువంటి స్వార్థంకాని, లేక ఉద్యోగ అపేక్షగాని, - ఇటువంటివి ఏ కోశానా నాకు కనబడలేదు.

## పార్లమెంటరీ ప్రజాస్వామ్య : పదవులు

బూర్జువా ప్రజాస్వామ్య సంస్థలలో స్థానం లేనంతవరకు కమ్యూ నిస్టుపార్టీకి ఉద్యోగాపేక్ష ప్రమాదం ఏదీ సోకలేదు. కాని 1962 నుండి కూడా చాలా పెద్దయెత్తున అటువంటి అవకాశం వచ్చింది. అదొక నూతన యుగం. ఈ నూతన దశలో కమ్యూనిస్టు ఉద్యమానికి పెద్దగా అనుభవాలు లేవు. కమ్యూనిస్టు ఉద్యమానికి ఈ బూర్జువా ప్రజా స్వామిక సంస్థలయొక్క అనుభవంలేదు. ఆ సందర్భంగా మా నల్గు రిలో అంటే సుందరయ్యగారు, నేను, చంద్రంగారు, బసవపున్నయ్య గార్లలో ఎవరు ఎక్కడకు వెళ్ళాలి ? ఏ బాధ్యతలు వహించాలి ! అన్నప్పుడు సుందరయ్యగారు, బసవపున్నయ్యగార్లను పార్లమెంటు

లోను, నన్ను శాసనమండలిలోను ఉండమన్నారు. చంద్రంగారు కూడా రాజ్యసభకు వెళ్ళాలన్న ప్రతిపాదన వచ్చింది. కాని చంద్రంగారు "నేను ఎందుకయ్యా దాంట్లో? కె. యల్. నరసింహంగారిని పంపితే ఉపయోగపడుతుంది" అన్నారు. ఆ ప్రకారంగానే కె. యల్. నరసింహంగారు అప్పుడు రాజ్యసభకు వెళ్ళారు. అది రైల్వే పనివారల ఉద్యమానికి ఉపయోగపడింది. అలా మొదటనుండి ఈ పార్లమెంటరీ ప్రజాస్వామ్య సంస్థలలో పదవులకు, అట్టి వ్యామోహానికి దూరంగా ఉంటూ వచ్చారు. చంద్రంగారిలో అట్టి వ్యామోహం ఏకోశానా లేదు. ఇట్టి వ్యామోహం నేడు కమ్యూనిస్టు ఉద్యమంలో లేకపోలేదు.

ఈ బూర్జువా ప్రజాస్వామ్య యుగంలో అటువంటి అవలక్షణాలు అంటనివారు కొందరున్నారు. ఈ విషయంలోకూడా ఆయన నిప్పులా ఉండగల్గారు.

మంచి కమ్యూనిస్టు అనేవాడు ఎలా వుండాలి? అనే విషయమై లీషావ్‌చీ ఒక పెద్ద పుస్తకం వ్రాశారు. మార్క్స్, లెనిన్, ఏంగిల్స్ మొదలైన వారి జీవితాలు చూస్తే మంచి కమ్యూనిస్టు అనేవాడు ఎలా ఉండాలో అర్థం అవుతుంది. చంద్రంగారి జీవితం తీసుకున్నప్పటికీ ఆ విషయం అర్థమవుతుంది. దాంట్లో ఏమీ సందేహంలేదు.

## పార్టీ ఐక్యతకోసం చంద్రంగారి కృషి

ఇక శిక్షణవిషయంలో ఆయనకు ఆయనె అందెవేసిన చేయి. ఏ ఒక్క సమయంలో కూడా ఆయన – పార్టీ క్రమశిక్షణను ఉల్లంఘించ

లేదు. పార్టీ యొక్క ఐక్యతను కాపాడటంకోసం మన చంద్రంగారు చాలా కృషి చేశారు. రాష్ట్ర కమిటీలో తీవ్ర అభిప్రాయ బేదాలు వచ్చినప్పుడు, చంద్రంగారు ఏదోవిధంగా సర్ది, ఆయన అభిప్రాయాలను కూడా ప్రక్కన బెట్టుకొని రాష్ట్ర కమిటీని ఐక్యంగా ఉంచడానికి కృషి చేశారు.

ఆ రోజుల్లో జైలులోకూడా చాలా అభిప్రాయ భేదాలొచ్చాయి. 1948 – 52 ఉద్యమంలో కమ్యూనిస్టుపార్టీలో అట్టి అభిప్రాయభేదాలు చాలావచ్చినాయి. ఆ ఉద్యమాన్ని చివరికంటా యీడ్చడంవలన అవి వచ్చాయి. అందువల్ల చాలా నష్టం వచ్చింది. జైలులో కూడా తీవ్ర అభిప్రాయభేదాలుంటే ఆ నాల్గు గోడల మధ్య ఒకరికొకరు చూసుకొనే పరిస్థితులు లేనప్పుడు – అది కడలూరు జైలు అనుకుంటాను–అప్పుడు ఆ జైలులో ఉన్న చంద్రంగారు దానిని చాలా ఐక్యంగా నిర్వహించారు. ఆ తరువాత పెరోల్‌మీద జైలునుండి బైటికివచ్చి తప్పుకొని మళ్ళీ రహస్య జీవితానికి వెళ్ళారు. ఆ విధంగా ఎంతో శిక్షణను ఆయన కల్గివున్నారు.

## సామాన్య పార్టీ సభ్యునిగా చంద్రంగారి జీవితం

ఒక్క ఘటనను మాత్రం చెప్పాలి. నాయకుడు అన్నవాడు సామాన్య పార్టీ సభ్యుడుగా ఉండటం మాత్రం చాలా కష్టసాధ్యమైన విషయం. కాని చంద్రంగారు మాత్రం అది సాధ్యమని ఆచరణలో రుజువు చేశారు. ఎందుకంటే నాయకుడుగా ఉన్నవాణ్ణి తొలగించినప్పుడు

అనేక అవలక్షణాలను ప్రదర్శించిన వారున్నారు. అసలు ఇటువంటివారు నాయకత్వంలో ఇన్నాళ్ళు ఎలా వున్నారా? అని అనిపించేటట్లు ప్రవర్తించినవారుకూడా ఉన్నారు.

కాని పార్టీలో ముఠా తత్వం వచ్చిన తరువాత చంద్రంగారు ఒక నిశ్చయానికి వచ్చారు. ఇక తాను పార్టీని ఐక్యంగా ఉంచలేను ముఠా తత్వాలలో మాత్రం పాల్గోలేను. అని స్పష్టంగా రాష్ట్ర కార్యవర్గంలోను, రాష్ట్ర కౌన్సిల్‌లోనుకూడా చెప్పారు. అప్పుడు తన భార్య పేరఉన్న కొద్ది పాటి భూమి అమ్మి - తన పేరఉన్న భూమిని ఎప్పుడో పార్టీకి యిచ్చి వేశారనుకోండి - కర్నూలుజిల్లా వెళ్ళిపోయి అక్కడ కొంత భూమికొని, సాగుచేసి, స్వయంగా దున్ని, దోకి ఆ విధంగా వ్యవసాయం చేసుకుంటూ అక్కడ ఒక చిన్న పార్టీ యూనిట్‌ను నిర్మించారు.

అందులో సామాన్య పార్టీసభ్యులుగా ఉంటూ ఆ విధంగా శిక్షణా యుతంగా తన జీవితాన్ని గడిపారు. ఇది మనందరకు శిరోధార్యమైన విషయం. చంద్రంగారి గుణగణాలు చెప్పాలంటే యింకా చాలా వున్నాయి.

## చంద్రంగారి ఆదర్శ జీవితాన్ని అనుసరించండి

నేడు మనం బూర్జువా ప్రజాస్వామ్యంలో ఉన్న పరిస్థితుల్లో ప్రతి కమ్యూనిస్టు కూడా చంద్రంగారి గుణగణాలను సదా దృష్టిలో పెట్టు కొన్నట్లయితే మనకు యీ బూర్జువా ప్రజాస్వామ్యంలో ఉన్న పంకిలం అంటకుండా మనం కాపాడుకోగలుతాం.

మేమంతా ఆయనతో కలిసి పనిచేసి నప్పుడు ఆయన గుణగణాలను ప్రత్యక్షంగా చూశాం. నామట్టుకు నేను ఈ విషయంలో ఆయనను ఎల్లపుడూ ఆదర్శంగా పెట్టుకొని ఉన్నాను.

మన పార్టీ సభ్యుల కుటుంబాలలో వచ్చే సమస్యలను కూడా ఆయన పరిష్కరించేవారు.

ఆయన జీవితాన్ని మనం ఆదర్శంగా పెట్టుకొన్నప్పుడు ప్రస్తుతం ఉన్న పరిస్థితులలో పార్టీని చాలా ముందుకు తీసుకు పోగలం.

కామ్రేడ్ చంద్రంగారు చూపిన ఆదర్శాన్ని అనుసరించడం వల్లనే ప్రస్తుతం ఉన్న రాష్ట్రనాయకత్వం పార్టీలో చీలిక వచ్చిన తదుపరి తిరిగి పార్టీని సమైక్యంగా ముందుకు నడిపించగలుతూంది. ఆంధ్ర ప్రదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం రెండుముక్కలైపోయిన తరువాత జరిగిన సంఘల సమరంలో ఇక ఆంధ్రప్రదేశ్‌లో పార్టీ ఏమీ మిగలదని అనుకున్నాం. అటిపరిస్థితులలో చంద్రంగారు పెట్టిపోయిన సంప్రదాయాలను గుర్తుంచుకోవడం వల్లనే నేను ఒకమాట సగర్వంగా చెప్పుకోగలను.మన రాష్ట్ర కమిటీలో పదవీ వ్యామోహాలు కాని, వాళ్ళ కాళ్ళువీళ్ళు, వీళ్ళకాళ్ళు వాళ్ళు లాగాలనేధోరణులుకానిలేవు. అందుకనే రాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమాన్ని రక్షించాం. ముందుకు తీసుకు పోగల్గాం. దాంట్లో మాత్రం చంద్రంగారు పెట్టిపోయిన వరవడి వారి వ్యక్తిగత గుణగణాలు యిందుకు కారణమయ్యాయని నేను చెబుతూ యింతటితో విరమిస్తున్నాను.

★


155



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | LPSA110B121 |
| పుస్తకం పేరు | మద్దుకూరి చంద్రశేఖరగారిరచనలు |
| తారీఖు | 13 March 2025 |
| ముందు అట్ట | [illegible] |
| వెనుక అట్ట | [illegible] |
| మొత్తం పేజీలు | 173 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CI,10H,IIA, |
| లేని పేజీలు | 33TO44 |
| తయారు చేసినది | Chaitanya |
| పేజీలు విడదీసినది | Chaitanya |
| స్కాన్ చేసినది | Navya |
| పరీక్ష చేసినది | TRIVENI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |

B 92B , 124B / 148B / 156.BCT